


## మిడతలా మజాకా!

'ఈ మిడతల దండేం చేస్తుందిలే?' అనుకోకండి! వీటిని చూసి దేశాలకు దేశాలే బెంబేలెత్తి పోతున్నాయి. మడగాస్కర్, ఈజిప్ట్, లిబియా, అల్జీరియా, ఆస్ట్రేలియాలో ఇవి ప్రభుత్వాలకు, ప్రజలకు పెను సవాలు విసురుతున్నాయి. అక్కడి లక్షలాది ఎకరాల పంట పొలాలపై ఇవి తరచుగా దాడులు చేస్తూ రైతులు పండించిన ధాన్యాన్నంతా అవురావురుమని ఆరగిస్తున్నాయి. వీటిని ఎలా వదిలించుకోవాలో తెలియక అధికారులు తలలు పట్టుకుంటున్నారు!

# ముఖచిత్రంగా మీ ముఖారవిందం!




క్యూట్ క్యూట్ బేబీస్, యూత్‌ఫుల్ లేడీస్‌కు ప్రాధాన్యం
అందం, ఆకర్షణ, తగిన డ్రస్‌సెన్స్ ఉంటే చాలు...
మీ అభిమాన విపుల / చతురకు
మీరే ముఖచిత్రం అవుతారు
చేయాల్సిందల్లా - పోస్ట్‌కార్డ్ సైజ్ క్లోజప్పులు రెండు.
అదే సైజ్ 3/4 ఫొటో ఒకటి వెంటనే మాకు పంపండి.
ఫొటోలు మెయిల్ కూడా చేయొచ్చు

**నోట్ : ఫొటోల ఎంపికలో తుది నిర్ణయం సంపాదకులదే.**
**ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు, వాదవివాదాలకు చోటేలేదు.**

- ★ ఫొటోలు పంపేవారు విధిగా తమ ఫోన్‌నెంబర్లుసహా తమ తల్లిదండ్రుల అంగీకార పత్రాలు పంపాలి.
- ★ మీరు బాగున్నా, ఫొటోలు క్వాలిటీగా లేకుంటే మేమే ఫొటోగ్రాఫర్‌ని పంపుతాం.
- ★ ప్రచురణ తర్వాత ఫొటోలు తిరిగి కావాలనుకునేవారు తగిన పోస్టేజిస్టాంప్‌లంటించిన స్వంత చిరునామాగల కవరును జతపరచాలి.

చిరునామా : సంపాదకులు, చతుర/విపుల, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ - 500082 ఈ మెయిల్ : vipula.chatura@eenadu.net
vipula.chatura@gmail.com









# మనసున ఉన్నదీ...



★ పాఠకుల నాడి తెలిసిన 'చతుర' నేటి తరాన్ని ఆకట్టుకునే విధంగా నిత్య నూతనంగా రంజింపజేస్తోంది. ఈ పత్రిక ఇంకా ఉన్నత శిఖరాలకు ఎదిగి, సర్వతోముఖాభివృద్ధి సాధించాలని ఆకాంక్షిస్తున్నాను. సంపాదకవర్గానికి అభినందనలు.

*– నీలం శివగంగాధర,*
వీరపునాయునిపల్లె, కడప జిల్లా

★ ఉమాపతి నవల 'శశి' అమాయక ఆడపిల్లలకు కనువిప్పు కలిగించేలా ఉంది. మాస్టారివల్ల తన సంసారాన్ని దిద్దుకోవడం చిన్న మెలిక. అభినందనచందనంతో చతుర గుబాళిస్తోంది. కొత్తగాలులన్నీ బాగున్నాయి.

*– జి.జి.కె రావు,* శ్రీకాకుళం

★ 'చతుర'కు ప్రముఖ ఆకర్షణ 'కొత్తగాలి' చిరుకవితలు. రచనలో బిగువు, భావంలో పరిపక్వతతో పత్రిక తెరవగానే తమవైపు తిప్పుకుంటున్నాయి. 'అక్షరధార'లో భద్రపరచుకోదగిన విలువైన సమాచారం అందిస్తున్నారు. ఉమాపతి నవల 'శశి'లో కొన్ని విషయాల్లో చంద్రకాంతి ప్రసరించినా అక్కడక్కడా అమావాస్యపు చీకట్లు కూడా ఉన్నాయి.

*– డాక్టర్ శివభూషణం,* కర్నూలు

★ ముచ్చటైన ముఖచిత్రంతో, కనువిందు చేసే బొమ్మలతో జులై 'చతుర' మమ్మల్ని ఆనందింపజేసింది. నవల 'శశి' సుఖదుఃఖాల సమ్మేళనం! రచయిత ఉమాపతి నవలను నడిపించిన తీరు బాగుంది.

*– కరణం శివానందరావు,*
బెంగళూరు

★ జులై 'చతుర' నవల 'శశి' చదువుతుంటే మా కాలేజీ రోజులు గుర్తుకొచ్చాయి. శశి పాత్ర ద్వారా యవ్వనదశలో విద్యార్థినులు లోనయ్యే ఆకర్షణలని రచయిత చక్కగా చూపించారు. చతురకతలు 'అవాక్కు' 'బదిలీ' బాగున్నాయి. ఇందిరాగోస్వామి అస్సామీ కథ 'పాపం' నీడల్ని కళ్లకు కట్టింది.

*– యు. చిట్టిబాబు,* కొత్తపాల్వంచ

★ జులై 'చతుర' ముఖచిత్రం బాగుంది. 'చతురంగం' పెద్దలమెదడుకు పరీక్ష. కొత్తగాలి కవితలు ఆలోచింపజేసే జ్ఞానదీపాలు! 'చతుర ప్ర.జ.' ద్వారా చాలా ఉపయోగకర విషయాల్ని తెలుసుకుంటున్నాం. నవల 'శశి' ప్రేమకు కొత్త అర్థం చెప్పింది.

*– ఈ వేమన,* శ్రీకాకుళం

★ జులై చతుర నవల 'శశి' ఆసక్తికరంగా ఉంది. మారిన మనుషులు, మార్చిన మనుషుల జీవితాల గురించి సాగిన ఈ నవల బాగా ఆకట్టుకుంది. తొలినవల హృద్యంగా తీర్చిదిద్దిన రచయితకు అభినందనలు.

*– శివలెంక చంద్రశేఖర్*

★ చిన్నారి ముఖారవిందంతో వచ్చిన జులై చతుర ఎంతో ముచ్చటగా ఉన్నది. ఉమాపతి కలం నుండి జాలువారిన 'శశి' నవల ఆద్యంతం చక్కగా చదివించింది. ఒక సినిమా చూసిన అనుభూతి కలిగింది.

*– పక్కి బాలకృష్ణారావు,* విజయనగరం జిల్లా

★ 'శశి' నవల శైలి గుండెల్ని తాకేలా ఉంది. ఆద్యంతం ఏకబిగిన చదివించింది. చతురకతలు, చతుర ప్రపంచం, కొత్తగాలులు అన్నీ మా ఇంటిల్లిపాదికీ నచ్చాయి.

*– కాళహస్తి వెంకటశేషగిరిరావు,* నెల్లూరు

★ జులై 'చతుర' ఆసాంతం అద్భుతంగా ఉంది. ఉమాపతి నవల 'శశి' బాగుంది. 'అక్షరధార' ద్వారా ప్రాచీన సుభాషితాలను తెలుసుకుంటున్నాం. అసాధారణ మేధావి సంజీవ్‌దేవ్ చతురోక్తులను ఆస్వాదించాం. ఇందిరాగోస్వామి అస్సామీ కథ 'పాపం'కు పాలకోడేటి వారి అనువాదం ప్రతిభావంతంగా ఉంది. మా పిల్లలకు సైతం అభిమానపాత్రురాలైన 'చతుర విరాజిల్లాలని కోరుకుంటున్నాం.

*– గుర్రం శారదాశ్రీనివాస్,* చెరకుపల్లి

---

చిరునామా : మనసున ఉన్నదీ... సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082
ఈ మెయిల్ : vipula.chatura@gmail.com
vipula.chatura@eenadu.net

సంపుటి -36 సంచిక - 7
427వ సంచిక, పేజీలు : 132
ఆగస్టు 2013

# చతుర



**చేతి**లో విషం
సీసా పట్టుకుని కొడుకు కొమర్రాజుకు ఎదురుగా నిల్చుంది తల్లి బంగారమ్మ. కొడుకు ఆమె చేతిలోని సీసా లాక్కుని 'ఏం జరిగిందమ్మా? ఎందుకిలా చేస్తున్నావు?' అడిగాడు వణుకుతున్న గొంతుతో.
'ఏందా..? అంతా సర్వనాశనమైందిరా. ఏదైతే జరగకూడదనుకున్నానో నువ్వదే పనిని చేస్తావుండావురా. నీదీ మీ నాయిన రక్తమేకదా!' అంటూ అక్కడే ఉన్న కత్తితో మణికట్టుకు గాటు పెట్టుకుంది.
ఆ తర్వాతేం జరిగింది? ఇంతకీ కొడుకు కొమర్రాజు ఏం చేశాడు? ఆ తల్లి ఆవేదనకు కారణమేంటి? ఆద్యంతం ఉత్కంఠగా చదివించే **ఎ. పుష్పాంజలి** నవల **శాంతిహోమం** 6వ పేజీలో...

బొమ్మలు : బాలు



✦ ముఖచిత్ర ఛాయాగ్రాహకుడు : **దిలీప్ బెనర్జీ**
✦ చివరి కవర్ : బేబీ శ్రీ కీర్తన
పుస్తకాలంకరణ : **రాజు యాట**

గుమ్మడిదిబ్బ, వీరంపల్లె గ్రామాల మధ్య పచ్చగడ్డి వేస్తే భగ్గుమనేటంత శత్రుత్వం! పగలు, ప్రతీకార జ్వాలలకు బలైన వీరంపల్లె గ్రామ నాయకుడు కొమర్రాజు కూతురే వీరమ్మ. గ్రామకక్షల గురించి ఆమెకు తెలియకూడదని చిన్నప్పటి నుంచి వీరమ్మను దూరంగా ఉంచి పెంచుతుంది తల్లి మంగమ్మ. సాధారణ అమ్మాయిలకు భిన్నంగా కత్తిసాము, కర్రసాము, గుర్రపుస్వారీ తదితర విద్యల్లో శిక్షణ పొందుతుంది వీరమ్మ. యుక్త వయసులో తన స్వగ్రామానికి తిరిగొచ్చిన ఆమె, మగాడిలా అన్ని పనుల్నీ చేసుకుపోతుంటుంది! గ్రామస్థుల ద్వారా తన తండ్రిని హత్య చేసిందెవరో తెలుసుకుంటుందామె. ఆ తర్వాత ఆమె ఏం చేసింది? పగలు, ప్రతీకారాలతో అట్టుడికే ఆ గ్రామాల్లో శాంతికు సుమాలు పూయించిందా? లేదా పులిమీద స్వారీ లాంటి ఫ్యాక్షనిజాన్నే ఆమె కూడా అనుసరించిందా? వెనుకబడిన ప్రాంతాలలో కార్చిచ్చులా రగిలే కక్షలకు మూలకారణాన్ని అత్యద్భుతంగా విశ్లేషించిన ఎ. పుష్పాంజలి నవల **శాంతిహోమం** చతుర స్వాతంత్ర్య దినోత్సవ కానుక!

# శాంతిహోమం

## - ఎ. పుష్పాంజలి

గంభీరంగా నల్లమల పర్వతశ్రేణి. మిట్టమధ్యాహ్నపు వాతావరణం దాన్ని మరింత గంభీరం చేస్తూ వుంది. పర్వతశ్రేణి దిగువన కాకులు దూరని ఒక కారడవి ఉంది.

ఆ అరణ్యపు పాదాన్ని స్పృశిస్తూ ఒక నది ప్రవహిస్తోంది. దాని పేరు నందిక. అనేక నదుల్లా అది తూర్పు సముద్రాన్ని చేరడానికి ఔత్సాహికయై ప్రవహించక రాయలసీమలో అనేక పల్లెలకు జీవికగా ఉంటూ, కాలువలుగా చీలి, బీడువారిన భూములను తడుపుతూ ఎక్కడెక్కడో అంతమైపోతోంది.

అది కర్నూలుకు సుదూరపు ప్రాంతం.

ఆ ప్రాంతంలో నందికా నదీ తీరాన విసిరివేయబడ్డట్టు పరమయోగి ఆశ్రమం ఉంది. దాని వెనుక చల్లదనాన్నీ, పచ్చదనాన్నీ నింపుకున్న ఒక అరటి తోట ఉంది.

అక్కడ మనుష్య సంచారం అతి తక్కువ.

ఆ మిట్టమధ్యాహ్నపు వేళ ఆశ్రమం ముందొక మానవాకారం తూలుకుంటూ వచ్చిపడ్డది.

పడబోయే ముందు ఆ మానవాకారం నోటి నుంచి వెలువడిన ఒక ఆక్రందన లోపలున్న ఆశ్రమవాసుల చెవిని సోకడంతో వారు తుళ్లిపడ్డారు. ముగ్గురు వ్యక్తులూ తమ చేతిలో పుస్తకాలు పక్కనపెట్టి, వెలుపలికి పరుగెత్తారు.

వారు 'స్వాములు'గా పేరొందిన సదానంద, శివానంద, సత్యానందులు.

సదానందస్వామి పడిపోయిన ఆ వ్యక్తిని చూసి "ఎవరో క్షతగాత్రుడల్లే ఉంది!" అన్నాడు.

అతని భుజంలో నుంచి స్రవిస్తున్న రక్తాన్ని చూశాడు శివానంద.

సదానందస్వామి కూడా అది చూసి ఆందోళనగా "ఇతన్ని వెంటనే లోపలికి పట్టండి" అని తొందర చేశాడు.

వెంటనే సత్యానంద "ఆగండి స్వామి! గురువుగారి అనుమతి తీసుకొని వస్తాను" అంటూ లోనికి పరుగెత్తాడు.

మిగతా వ్యక్తులిద్దరూ ప్రాణం కోల్పోవడానికి సిద్ధంగా ఉన్న ఆ క్షతగాత్రుడిని నిస్సహాయులై గమనిస్తూ ఉండిపోయారు.

అతని వయసు నలభైలోపే ఉంటుంది. బాగా మాసిన బట్టలు అక్కడక్కడా చినిగిపోయి ఉండడమే గాక, రక్తసిక్తమై ఉన్నాయి. అతని జుట్టు తైలసంస్కారం లేక అట్టలు కట్టడమేకాక, జేగురు రంగుకు తిరిగి ఉంది.

అతని భుజం నుంచి కారుతున్న రక్తం ఆశ్రమ ద్వారానికి రక్తతర్పణం వదులుతున్నట్లుండడంతో వారిద్దరూ మరింత కంగారుపడ్డారు.

ఆశ్రమం లోపల, చెట్టుకింద, ఆ ఆశ్రమానికి పెద్దగా పరిగణించే పరమయోగి ఒక అరుగు మీద ఆసీనుడై, కళ్లు మూసుకొని ధ్యానముద్రలో ఉన్నాడు. ఆయన కళ్లు తెరిచి, కంగారుగా తన దగ్గరికి పరుగెత్తుకొచ్చిన సత్యానందుని వంక చూసి కళ్లతోనే ఏమిటన్నట్టు ప్రశ్నించాడు.

"స్వామీ! ఆశ్రమం వాకిట్లో ఒక వ్యక్తి స్పృహ తప్పి పడివున్నాడు. అతని భుజం నుంచి రక్తం ధారగా కారుతోంది. ఎవరో కత్తితో పొడవడమో, పిస్తోల్తో కాల్చడమో జరిగినట్లుంది. మరి..." అంటూ ఆగిపోయాడు.

పరమయోగి చిరునవ్వుతో "నీ భయం పోలీసుల గురించే కదా! ఫరవాలేదు. మనం ఏ కేసులోనూ ఇరుక్కోము. ఎటువంటి విపత్కర పరిస్థితుల్లోనూ మనకు గుర్తుకు రావలసినది మానవధర్మమే కదా! ఆపదలో ఉన్న ఒక మానవుని రక్షించి, అతని ప్రాణాలు నిలపడం మన ధర్మం కాదా? మానవత్వం వ్యర్థ సందేహాలకు

తావివ్వదు. కావున అతన్ని వెంటనే లోనికి తీసుకువచ్చి తగిన చికిత్స ప్రారంభించండి" అన్నాడు.

ఆ సమాధానం కోసమే ఎదురు చూస్తున్న సత్యానంద స్వామి ఒక్క ఉదుటున వెలుపలికి పరుగెత్తి "పట్టండి.. పట్టండి.. చికిత్సాలయానికి చేర్చండి" అన్నాడు ఆత్రుతగా.

పరమయోగి అనుమతి లభించిందని గుర్తించి మిగతా ఇరువురు కర్తవ్యోన్ముఖులైనారు.

అక్కడ అందరూ మానవసేవకు అంకితమైనవారే. మానవధర్మాన్నే పరమ ధర్మంగా భావించినవారే. వారు ముగ్గురూ ఆ రక్తసిక్త శరీరాన్ని చికిత్సాలయంలోకి చేర్చారు.

చికిత్సాలయం అంటే అక్కడున్న మిగతా పూరిళ్లలాగా అదీ ఒక పూరిల్లే. కాకుంటే అక్కడ కొన్ని ప్రకృతి సిద్ధమైన ఔషధాలు సీసాల్లో, డబ్బాల్లో ఉన్నాయి.

ఆశ్రమవాసులు ఎవరైనా రోగగ్రస్తులైతే వారిని కొన్నాళ్లు చికిత్సాలయంలో ఉన్న వెదురుమంచం మీద పడుకోబెట్టి, చికిత్సలు చేస్తారు.

ఆ చికిత్సలు చేయడానికి వెలుపలి వైద్యులెవరూ రారు. ఆశ్రమవాసుల్లోనే ఆయుర్వేదం తెలిసినవారు, ఇంకా ఆయుర్వేదం అభ్యసిస్తున్నవారూ ఉన్నారు. ప్రస్తుతం చికిత్సాలయంలో ఎవరూ లేరు. ఇప్పుడు వారు లోనికి తీసుకొచ్చిన ఆ క్షతగాత్రుడే ఏకైక రోగి.

ఆయుర్వేదంలో నిపుణుడనిపించుకున్న నిత్యానందస్వామి చకచకా చికిత్స ప్రారంభించాడు.

అతను కుచ్చుగా ఉన్న ఒక జిల్లేడు కర్రతో గాయాన్ని అటూ ఇటూ కదిలించి,

లోపలికి దిగిన పిస్టల్ గుండును పెకిలించాడు.

రక్తం జివ్వున చిమ్మింది. అయినా ఆ మనిషిలో చలనం లేదు.

నిత్యానందస్వామి గాయాన్ని శుభ్రంగా తుడిచి, పసుపు కలిపిన ఆకుపసరు మిశ్రమంతో కట్టుకట్టాడు.

మిగతావారు అతని ఒళ్లంతా వేడినీళ్లతో తుడిచారు. గాయాలకు కట్లు కట్టారు. ఆ తర్వాత అతని బట్టలు మార్చారు. తల శుభ్రంగా దువ్వారు.

ఇంత జరుగుతున్నా, తనకేం జరుగుతున్నదో ఎరుగని ఆ మనిషి అచేతన స్థితిలోనే ఉన్నాడు.

అతనికి చాలా రక్తస్రావం అవ్వడం గమనించిన ఆ శిష్యులు, అతనికి బలవంతాన ఏదో ద్రవపదార్థం తాగించడానికి ప్రయత్నించారు.

నోట్లో పోసిన ద్రవంలో ముక్కాలు భాగం బయటికే వచ్చి కారిపోయింది. మిగతాది ఆ మనిషి గుటకలు వేయడంతో వాళ్లకి ధైర్యం వచ్చింది.

ఆ వ్యక్తి అలాగే రెండు రోజులు అచేతన స్థితిలో పడివున్నాడు. మూడవ రోజు మధ్యాహ్నం వేళ అతనికి స్పృహ వచ్చింది.

కాచుకొని వున్న ఆ స్వాములు అతనికి వేడివేడి జావ తాగించారు.

ఎన్నో రోజుల తర్వాత కడుపులోకి కాస్త ఆదరువు దొరకగానే, అతను మళ్లీ నిద్రలోకి జారుకున్నాడు. అతను పూర్తిగా స్పృహలోకి రావడానికి అతని మెదడు సరిగ్గా పనిచేయడానికి మరి రెండు రోజులు పట్టింది.

'ఏమిటిది? తనెక్కడున్నాడు? తను ఆ నదిలో దూకాడుగా! అప్పుడు ఎక్కడో తుపాకీ పేలింది. గుండు తన భుజం వెనక కండరాన్ని చొచ్చుకుని లోపలికి పోయింది. అంతే! ఆ తర్వాత ఏం జరిగిందో తనకు సరిగా తెలియదు. తనిప్పుడెక్కడున్నాడు? ఇదెవరిల్లు?'

అతని మస్తిష్కం సుషుప్తావస్థ నుంచి జాగృతమైంది. తన ఊరు, ఇల్లు, తన కుటుంబం, తన చుట్టూ నెలకొన్న పరిస్థితులు, తన పోరాటం... అన్నీ గుర్తురాసాగాయి.




నల్లమల పర్వతాలకు కొంతదూరంలో వున్న ఆ పల్లె పేరు గుమ్మడిదిబ్బ. ఐదారు వందల జనాభా గల ఆ పల్లెలో పాలెగాళ్ల వంశం ఇంకా మిగిలి ఉంది. ఆ ఊళ్లో ఒక చిన్న బంగళాలాంటి ఇల్లు, చుట్టుపక్కల ఎకరాల కొద్దీ పొలాలు, నాలుగైదు వ్యవసాయ బావులు కలిగిన ఆ పాలెగాళ్ల వంశపువాడే భాస్కరయ్య. అతని కొడుకు సమరయ్య. భాస్కరయ్య పూర్వీకులు గుమ్మడి దిబ్బనూ, ఆ చుట్టుపక్కల ప్రాంతాల్ని అహంకారపూరితంగా ఏలారు.

ప్రజలను పన్నుల రూపంలో దోచుకోవడం, ఎదిరించిన వారిని నిర్దాక్షిణ్యంగా శిక్షించడం, వీలైనపుడంతా సమీపంలో ఉన్న పట్టణాలకు తరలివెళ్లి ప్రజల సొమ్మును తమ విలాసాలకు విచ్చలవిడిగా ఖర్చు పెట్టడం... ఇది తప్ప మరో జీవన విధానం తెలియదు వాళ్లకు.

ఆ పరిస్థితులనెదుర్కొనడానికి సమీప

గ్రామమైన వీరంపల్లె నుంచి వీర్రాజనే ఒక యువకుడు బయల్దేరాడు. అప్పటికే గుమ్మడిదిబ్బను సమరయ్యా ఏలుతున్నాడు. వీర్రాజు వీరంపల్లె గ్రామస్థులను, సమరయ్యకు వ్యతిరేకంగా ఉసిగొల్పాడు. ఫలితంగా వీరంపల్లె గ్రామస్థులంతా పన్నులు కట్టలేమని ఎదురు తిరిగారు. వీరంపల్లెలో పన్ను వసూలుకొచ్చి మకాం వేసి, గ్రామంలో స్త్రీల మీద అకృత్యాలు చేస్తున సమరయ్యా మనుషలను చితకబాది తరిమివేశారు. వాళ్లు గుమ్మడిదిబ్బను చేరి, ఉన్నవీలేనివీ కల్పించి చెప్పారు తమ నాయకుడికి. నాయకుడు సమరయ్యా ఈ ప్రజల తిరుగుబాటుకి కారణం అన్వేషించగా, దీని వెనకాల వ్యక్తి, శక్తి వీర్రాజని తేలింది.

ఫలితంగా యాభైమంది సాయుధులైన అనుచరులతో వచ్చి వీరంపల్లెపై పడ్డాడు సమరయ్యా. వీర్రాజుని పట్టితెచ్చి గ్రామం మధ్యలో రచ్చబండ పక్కనే ఉన్న వేపచెట్టుకు ఉరితీయించాడు. భయభ్రాంతులైన గ్రామస్థులను ఊచకోత కోయించాడు. అతని అనుచరులు ఆ గ్రామాన్ని తమ ఇష్టం వచ్చినట్టు దోచుకున్నారు. ఊరు కాడయింది.

సమరయ్యా ఈ దురాగతానికొడిగట్టినప్పుడు వీర్రాజుతోపాటు అతని సోదరుని కుటుంబాన్ని, ఆరేళ్ల పిల్లవాడితో సహా మట్టుబెట్టాడు

ఈ మారణకాండ నుంచి ముఖ్యుడైన ఒకడు తప్పించుకోగలిగాడు. వాడే వీర్రాజు కొడుకు కొమర్రాజు. అప్పటికి కొమర్రాజు అయిదేండ్లవాడు. అతణ్ణి తీసుకొని తల్లి బంగారమ్మ అంతకు ముందురోజు సాయంత్రమే పుట్టింటికి వెళ్ళింది. ఆమె పుట్టినిల్లు కట్టకిందిపల్లె. అది వీరంపల్లెకు దాదాపు ఇరవై కిలోమీటర్ల దూరంలో ఉంది. తల్లి బంగారమ్మ తిరిగి వీరంపల్లె కొచ్చినపుడు కొమర్రాజుని తీసుకురాలేదు. అతన్ని తన అన్నలిద్దరి సంరక్షణలో, కట్టకింది పల్లెలోనే ఉంచింది. ఆ అన్నలిద్దరూ పిల్లవాడిని చాలా జాగ్రత్తగా సంరక్షించారు. వాళ్ళు వాణ్ణి హైద్రాబాద్ తీసుకెళ్లి, పేరు, వేషం, మార్పించి ఒక బోర్డింగ్ స్కూల్లో చేర్పించారు. సంరక్షకుడిగా సెక్రటేరియేట్‌లో ఉద్యోగం చేస్తున్న తమ ఊరి పూజారి కొడుకును నియమించారు. అతని పేరు శాస్త్రి. ఈ విషయం తల్లికేకాదు, మరో పురుగుకు కూడా తెలియకుండా, అతిగోప్యంగా ఉండేటట్టు జాగ్రత్తలు తీసుకున్నారు. బంగారమ్మ తండ్రి, తాతలకు శాస్త్రివంశం తరతరాలుగా రుణపడి ఉండటంతో, వారు తగువిధాన సహకరించారు.

బంగారమ్మ ఊహించినట్టే కొమర్రాజు ఆచూకీ సమరయ్యకు అస్పష్టంగా తెలిసింది. కొమర్రాజు తన మేనమామల దగ్గరే ఉన్నాడని అనుకుని ఒకనాడు సమరయ్యా తన సాయుధులైన అనుచరులతో కట్టకిందిపల్లె చేరి బంగారమ్మ అన్నలను, వాళ్ల ఇంట్లో ఉన్న మగసంతానాన్నీ క్రూరంగా వధించాడు. హైదరాబాదులో చదువుకుంటున్న కొమర్రాజు మట్టుకు తమ బారి నుంచి తప్పించుకున్న సంగతి వారికి తెలియదు.

ఈ సంఘటనల ఫలితంగా గుమ్మడిదిబ్బ, వీరంపల్లెల మధ్య పచ్చ గడ్డివేస్తే భగ్గుమనేటంత శత్రుత్వం మాత్రం స్థిరంగా నిలబడ్డది. ఇది ఒక వీర్రాజు, సమరయ్యల వంశాలకే పరిమితం కాలేదు. ఆ ఊరివాళ్లు ఈ ఊరివాళ్లను చూస్తేనే చంపుకునేటంతగా అది కోరలు చాచింది.

★ ★ ★

కొమర్రాజు ప్రస్తుతపు పేరు వినోద్‌కుమార్. వీరంపల్లెనూ, కట్టకిందిపల్లెను వినోద్‌కుమార్ లీలగా మాత్రం గుర్తుంచుకోగలిగాడు. అతనికి తమ ఊళ్ళో జరిగిన

మారణకాండ గురించి తెలియదు. తండ్రి వీర్రాజు అతనికి గుర్తులేడు.

సెలవుల్లో అతన్ని శాస్త్రి ఢిల్లీకి తీసుకెళ్ళేవాడు. ఢిల్లీలో అతనికి ముఖ్య స్నేహితుడొకడుండేవాడు. అతనికీ నిజం చెప్పకుండా 'మా బంధువులబ్బాయి' అని చెబుతుండేవాడు. తన బాధ్యతను శాస్త్రి అంత బాగా నెరవేర్చగలిగాడు.

ఇన్ని జాగ్రత్తల మధ్య పెరిగిన వినోద్ కుమార్ కాలేజికి రాగలిగాడు. అతను తన అసలు పేరు కొమర్రాజన్న విషయం రానురాను పూర్తిగా మర్చిపోయాడు.

ఎటువంటి వారైనా, ఏ పరిస్థితుల్లోనైనా మాతృమూర్తిని, ఆమెప్రేమను మరవలేరు.

## కొత్తగాలి...

**ఎదగడమే**
**జీవరహస్యం**
**విత్తనమే**
**అందుకు సాక్ష్యం**

– పి.వి. రమణకుమార్,
చిలకలూరి పేట

వినోద్‌కుమార్‌కు కూడా తల్లి బంగారమ్మ అప్పుడప్పుడు గుర్తుకువచ్చేది. ఆమెతో కలిసి తను మామగార్లింటికి వెళ్ళడం, పొలానికి పోవడం, బండి ప్రయాణాలు అన్నీ అతనికి లీలగా గుర్తొచ్చేవి.

తల్లి గుర్తుకు వచ్చినపుడు ఆమె తనను ముద్దుగా 'కొమ్మూ, కొమ్మూ, కొమ్ము బిడ్డా' అని సంబోధించడం జ్ఞాపకం వచ్చేది. మహనీయమైన మాతృప్రేమ తీయదనాన్ని తను ఆ తర్వాత పొందలేకపోవడం, ప్రస్తుతం తన జీవితానికీ తనకు గుర్తున్న ఆ మధురమైన బాల్యస్మృతులకూ మధ్య సంధి లేకపోవడం అతన్ని కలచివేసింది.

అతను కాలేజీలో చదువుతుండగా బంగారమ్మ అక్కడికి రావడం తటస్థించింది. భర్తను, అన్నలను పోగొట్టుకోవడం, అటు కొన్నేళ్ళ క్రితమే ముక్కుపచ్చలారని కన్నకొడుక్కు దూరమై ఉండటం మూలాన ఆమె మానసిక స్థితి క్షీణిస్తూ వచ్చింది. వైద్యం కోసం ఆమెను హైద్రాబాదు తీసుకొవచ్చారు. తల్లీబిడ్డా తారసపడినా ఒకరికొకరు ఎవరో తెలియదు.

విధి జీవితాలతో ఆటలాడుకుంటుంది. ఒక్కోసారి ఆ ఆటలు బహు విచిత్రంగా, క్రూరంగా ఉంటాయి. కాకుంటే నూనూగు మీసాల పుత్రరత్నం తనకళ్ళముందు తిరుగుతున్నా, వాణ్ణి గుర్తుపట్టే స్థితిలో లేదు తల్లి బంగారమ్మ.

తను తల్లి దగ్గర లేకున్నా, కనీసం మేనత్తగార్ల దగ్గర పెరిగివున్నా కొమర్రాజు ప్రేమకు నోచుకునేవాడేమో! కాని అతను దానికీ నోచుకోలేదు. తన చుట్టూ ఉన్న మనుషులతో తన సంబంధాలు యాంత్రికంగా తోచేవి వినోద్‌కుమార్‌కు.

శాస్త్రి భార్య కౌసల్యమ్మను తను 'అమ్మా' అని అంటున్నా ఆమె తన పిల్లలతో ఉన్నంత ప్రేమగా తనతో ఉండకపోవడం అతని దృష్టిని దాటిపోలేదు.

అనేక విషయాలను గుర్తించడం అలవడ్డాక అతని మనసు ఆందోళనలో కొట్టుకులాడసాగింది. తెరమాటు వ్యవహారాలెన్నింటినో అన్వేషించడం మొదలుపెట్టింది.

అతను డిగ్రీ చివరి సంవత్సరంలో ఉండగా తిరిగి మరొకసారి బంగారమ్మను చూశాడు. ఆమె మనఃస్థితి ఇప్పటికి కాస్త మెరుగుపడ్డది. ఇప్పుడు గతాన్ని గుర్తుచేసుకోగలదు. దాంతో తను పోగొట్టున్న వారి విషయమై కన్నీరుమున్నీరుగా విలపించసాగింది.

ఆమెను ఊరడించే ప్రయత్నంలో

జై సచ్చిదానంద్! జై గురుదేవ్!

# చిగురుపాటి-శ్రీ కృష్ణవేణి గ్లోబల్ టాలెంట్ స్కూల్స్

• విజయవాడ • హైదరాబాద్

**No. 1 in School Education**

## గత 30 సంవత్సరాలుగా - రాష్ట్రములో స్కూలు విద్యావ్యవస్థలో

ఉత్తమ ఫలితాలతోపాటు, ఉత్తమ బోధన, వ్యక్తిగత శ్రద్ధ, క్రమ శిక్షణ, మానవతా విలువలకు అత్యంత ప్రాధాన్యత ఇస్తూ

## ఎందరికో మార్గదర్శకం - అందరికీ ఆదర్శం

## 28 వేల మంది → S.S.C. విద్యార్థులకు ఉత్తమ ఫలితాలు

శ్రీ కృష్ణవేణి విద్యా సంస్థలలో (Schools, Colleges & Coaching Centres ద్వారా)

- ✔ 30 సంవత్సరాలుగా
- ✔ 'లక్ష' మంది శిక్షణ
- ✔ 'వేలాది' మంది మెడిసిన్ ఇంజనీరింగ్ సీట్లు
- ✔ 600 మంది పైగా స్టేట్ ర్యాంకులు (10 లోపు)
- ✔ 28 SSC బ్యాచ్‌లలో 28 వేల మంది SSC విద్యార్థుల ఉత్తమ ఫలితాలు
- ✔ రాష్ట్రంలో ప్రప్రథమ టాలెంట్ స్కూల్ మరియు గ్లోబల్ టాలెంట్ స్కూల్ నిర్వాహకులు

### ✔ SSC-2013 ఫలితాలు

2013 లో ఉత్తీర్ణులైన వారు → 1,251 మంది
2012 లో ఉత్తీర్ణులైన వారు → 1,677 మంది

**SSC-2013 లో GPA గ్రేడులు**

- 10 కి 9.8 GPA→ 62 మంది
- 10 కి 9.7 GPA→ 64 మంది
- 10 కి 9.5 GPA→ 91 మంది
- 10 కి 9.3 GPA→ 70 మంది
- 10 కి 9.2 GPA→ 66 మంది
- 10 కి 9.0 పైన →415 మంది

**2013 & 2012 SSC Batches**

- Maths A1 గ్రేడ్లు → 1546 మంది
- Sciences A1 గ్రేడ్లు → 973 మంది
- Social Studies A1 గ్రేడ్లు → 954 మంది

### ✔ 2011 నాటికి SSC ఫలితాలు (ఉత్తీర్ణులైన వారు → 25,081 మంది)

- 8,576 మందికి → 500 పైన టోటల్ మార్కులు
- 12,476 మందికి → మాథ్స్ లో 90 పైన మార్కులు
- 7,135 మందికి → సైన్స్ లో 90 పైన మార్కులు

✔ 1,485 మందికి → మాథ్స్ లో 100 కు 100 మార్కులు

### ✔ SSC-2013 లో GPA 10 కి 10 సాధించినవారు


V. Lohitha (No.1312116252)


K. Teja (No.1312111821)


V. Samagna (No.1337107614)

## విజయవాడలో → గ్లోబల్ టాలెంట్ స్కూల్

28 సంవత్సరాల రెసిడెన్షియల్ స్కూల్ అనుభవముతో & 21 సంవత్సరాల టాలెంట్ స్కూల్ అనుభవముతో గ్లోబల్ టాలెంట్ స్కూల్ నిర్వహించబడుచున్నది.

**రెసిడెన్షియల్ అడ్మిషన్లకు**

విజయవాడ, పోరంకిలోని శ్రీ కృష్ణవేణి రెసిడెన్షియల్ టాలెంట్ స్కూల్‌లో III నుండి X వరకు అడ్మిషన్లు జరుగుచున్నవి (బాలురకు, బాలికలకు వేర్వేరు హాస్టలు సౌకర్యము కలదు)
LKG నుండి X వరకు డే-స్కాలర్స్‌కు కూడా అడ్మిషన్లు జరుగుచున్నవి

✆ 0866-2588192, 99514 72666

**డే-స్కాలర్స్ అడ్మిషన్లకు**

విజయవాడ, పటమటలంక మరియు భవానీపురంలోని శ్రీ కృష్ణవేణి గ్లోబల్ టాలెంట్ స్కూల్‌లో LKG నుండి X వరకు అడ్మిషన్లు.

✆ 73868 39674, 73861 24187

హైదరాబాద్, దిల్‌సుఖ్‌నగర్ మరియు కుకట్‌పల్లిలోని టాలెంట్ స్కూల్‌లో LKG నుండి X వరకు అడ్మిషన్లు.

✆ 81218 09474, 87128 97329

*Office Address :* Chigurupati - Sri Krishnaveni Academy, Poranki, Vijayawada.

## SCHOOL EDUCATION

**28 years in Residential School Education (Estd. in 1985),**
**20 years in Talent School Education (Estd. in 1992) & 1 year in Global Talent School Education (Estd. in 2011-12)**

**Moulding Career for 28,000 SSC students**

భాగంగా, కొమర్రాజు బతికేవున్న సంగతి ఆమెకు తెలియజేశారు శాస్త్రి, కౌసల్యమ్మలు. తెలియజేయడమే కాదు, ఆమె అతన్ని చూసే అవకాశం కూడా కలిగించారు. దాంతో ఏ ప్రయోజనం కోరి కొమర్రాజు మేనమామలతన్ని ఇన్నాళ్ళూ జన్మించిన ప్రదేశానికీ, మాతృమూర్తి ఒడికీ దూరం చేశారో, ఆ ప్రయోజనం నెరవేరకుండా పోయింది.

అనేక సంవత్సరాల తర్వాత, మొదటిసారిగా కుమారుణ్ణి దగ్గరకు తీసుకున్న బంగారమ్మలో మాతృప్రేమ పొంగింది. ఆమె పొగిలి పొగిలి ఏడ్చింది. 'ఇక చావైనా, బతుకైనా వీడితోనే. వీణ్ణి వదిలి తను బతికే బతుకు నిరర్థకం' అని నిశ్చయించుకుంది.

మాతృమూర్తి మమతానురాగాన్ని చూసి కొమర్రాజు అలియాస్ వినోద్‌కుమార్ పరవశించిపోయాడు. ఈ తల్లికి దూరంగా ఇన్నాళ్లూ తను బతికిన బతుకూ ఒక బతుకేనా? ఇటువంటి మహత్తర మాతృప్రేమ నుంచి తనను వేరుపరచిన ఆ క్రూరమైన పరిస్థితులేంటి? ఇన్నాళ్లూ తను అజ్ఞాతంలో ఎందుకు బతకవలసి వచ్చింది? అనే ప్రశ్నలు జవాబులు అన్వేషించమని అతన్ని తొందరపెట్టాయి.

తరచి తరచి తనను వినోద్‌కుమార్ అడుగుతున్న ప్రశ్నలకు సమాధానం చెప్పక తప్పలేదు శాస్త్రికి. జరిగిన కథనంతా ఒక వీరగాథలా వివరించి చెప్పాడు. ఈ కథ విన్న వినోద్‌కుమార్ గుండె వీరావేశంతో పొంగింది. తన జన్మభూమిని చూడాలన్న కోరిక అతన్ని నిలవనీయడం లేదు. జన్మభూమిపై తండ్రి చూపిన భక్తీ, అతని శౌర్యం, త్యాగతత్పరతా అతని గుండెను ఉప్పొంగింపజేశాయి. తన వెనుక నడిచిన కథ విని అతను ఆశ్చర్యంతో తలమునకలయినాడు. 'ఎటువంటి వంశంలో జన్మించాడు తను!' అనుకున్నప్పుడంతా ఛాతి పొంగింది. తల్లిని ఇన్నాళ్ల తర్వాత పొందిన అతను ఇంకెప్పటికీ ఆ మాతృమూర్తిని ఎడబాసి ఉండకూడదనే నిశ్చయానికొచ్చాడు.

★ ★ ★

కొమర్రాజు ఉరఫ్ వినోద్‌కుమార్ పల్లెకు తిరిగొచ్చేసరికి అక్కడి పరిస్థితులెలా ఉన్నాయంటే....

గుమ్మడిదిబ్బ గ్రామంవాళ్లని మట్టుబెట్టే ప్రయత్నంగా వీరంపల్లె వాసులు సమరయ్యను, అతని ఇద్దరు కుమారులను అతని రక్తసంబంధీకులను మట్టుబెట్టారు.

తమ 'అన్న'ను చంపేసి, గ్రామాన్ని కాడుగావించిన వాణ్ణి వీర్రాజు అనుచరులు ఊరకే వదుల్తారా?

'అన్న' వంశాంకురం కొమర్రాజు కోసం వాళ్లంతా వీరంపల్లెలో ఎదురుతెన్నులు చూస్తున్నారు.

కొమర్రాజు రాకతో వీర్రాజు అనుయాయులంతా ఆనందసాగరంలో మునిగితేలారు. అనేక సంబరాలు జరుపుకున్నారు.

వీర్రాజు ఇంట్లో గడపలలికి ముగ్గులు తీర్చారు. అంత వరకూ బంగారమ్మ ఆ విశాలమైన ఇంట్లో దీపాలన్నీ వెలిగించేది కాదు. తను, తన తోటివారు మామూలుగా తిరిగే నాలుగైదుగదుల్లో తప్ప మరెక్కడా దీపాలు వెలిగించేవారు కాదు. ఇప్పుడు అన్ని గదుల్లోనూ దీపాలు వెలిగాయి.

వీర్రాజుకు ప్రాణ స్నేహితులైన అంజయ్య, లాలాఖాన్‌లను కుటుంబాలతో సహా ఎప్పుడో మట్టుబెట్టాడు సమరయ్య.

అంజయ్య భార్య, లాలాఖాన్ భార్య అప్పటికి గర్భవతులు. విధవరాండ్రైన వీరిద్దరూ బంగారమ్మకు తోడుగా ఉండేవారు. ప్రస్తుతం వారి కుమారులు కూడా పెరిగి పెద్దవాళ్లయినారు. వాళ్లిద్దరూ వయసులో వినోద్‌కన్నా చిన్నవాళ్లు. లాలాఖాన్




భార్యకి విధవరాలైన తర్వాత మరో వ్యక్తి బాషాతో నిఖా జరిపించారు వాళ్ల వాళ్లు. ఆవిడకు మళ్లీ ముగ్గురు కొడుకులు, ఇద్దరు కూతుళ్లూను. వీర్రాజు లేకున్నా వాళ్లంతా వీర్రాజు మనుషులుగానే చలామణి అవుతున్నారు.

వీళ్లతోబాటూ పొలాలు చూసుకునే వాళ్లూ, చాకలోళ్లు, మంగలోళ్లు అంతా వీర్రాజు ఇంటికి మామూలుగానే రాకపోకలు సాగించేవాళ్లు. వీళ్లతోబాటు ప్రస్తుతం రహస్య జీవితం గడిపే కొందరు అంతరంగికులూ ఉన్నారు వీర్రాజు కుటుంబానికి. కాబట్టి మందీమార్బలం బాగానే ఉంది వీరంపల్లె వీర్రాజు భార్య బంగారమ్మకు.

వినోద్‌కుమార్ గ్రామానికొచ్చి తల్లితో ఉంటున్నాడు. తల్లి చేసిన వంట తినడం, ఆమెతో కలిసి పొలాలకి వెళ్లడం, డాబా మీద, ఆరుబయట కుర్చీల్లో తనూ, తల్లీ కూచొని ఉండగా, ఆమె చెప్పే తన తండ్రి వీరగాథలు, మేనమామల విశేషాలూ వినడం మొదలైనవన్నీ అతనికి చాలా సంతోషం కలిగించేవి.

అనేకమంది అతన్ని రోజూ చూట్టానికొచ్చేవాళ్లు. కొందరు సమరయ్య చేసిన దాడిలో బంధువులను, ఆశ్రితులను, ఆత్మీయులను పోగొట్టుకున్నవాళ్లు. మరికొందరు ఫ్యాక్షన్ కక్షల్లో అసువులు బాసినవాళ్ల తాలూకూ విధవరాళ్లు, అలాగే దాడి సమయంలో పక్క గ్రామాలకో, దూర ప్రాంతాలకో వెళ్ళిపోయినవాళ్లు అందులో ఉన్నారు.

వాళ్లంతా వీర్రాజు గొప్పదనాన్ని రకరకాలుగా వర్ణించి చెప్పేవాళ్లు. సమరయ్య దుర్మార్గాలను కళ్లకు కట్టినట్టు వివరిస్తూ, అతను తమ గ్రామాన్ని నాశనం చేసినట్టే, తామూ గుమ్మడిదిబ్బను నాశనం చేయాలనే ఉద్బోధ కూడా చేసేవాళ్లు. మరికొందరు యువకులు చాలా ఆవేశంగా, ప్రతీకారం తీర్చుకొని తీరాలని వాదించేవాళ్లు. వాళ్ల మాటలకు వినోద్‌కుమార్ మనసులో కూడా ప్రతీకారవాంఛాబీజాలు పడ్డాయి.

కానీ ప్రతీకారం ఎవరిమీద తీర్చుకోవాలి? సమరయ్యను, అతని కుటుంబంలో మగవారినీ వీరంపల్లెవాళ్లు ఎప్పుడో మట్టుపెట్టారు. ఇక ఎవరిని చంపి ప్రతీకారం తీర్చుకుంటారు?

కొమర్రాజు హృదయంలో మొలకెత్తిన ప్రతీకారబీజం మహావృక్షంగా శాఖోపశాఖలై అతని దేహమంతా వ్యాపించింది. అతనిలోని ప్రతి అణువు ప్రతీకారం కోసం తహతహలాడసాగింది. 'ఏదో చేయాలి, కాని అదేమిటి?'. ఆ సమయంలో అతనికి మిఠాయిలా తీయగా ఉన్న ఒక వార్త తెలియవచ్చింది. వార్త ఏమిటంటే సమరయ్యకు రహస్యంగా మరో భార్య ఉందట! ఆమెకు ఇద్దరు కొడుకులట! వాళ్లంతా హైద్రాబాదులో ఉన్నారట. సమరయ్య వాళ్ల పేరుమీద చాలా ఆస్తిపాస్తులు చేకూర్చిపెట్టాడట.

ఈ వార్త తెలియగానే కొమర్రాజు ఆ రెండో భార్యనూ, ఆమె కుమారులను గురించి తెలుసుకోమని కొంతమందిని పురమాయించాడు.

సమరయ్య రెండో కుటుంబపు వివరాలను కనిపెట్టడం కోసం నియమించిన గూఢచారులలో ముఖ్యుడు అంజయ్య కొడుకు శేషగిరి. అతన్నంతా 'శేషూ' అని పిలుస్తారు.

ఆవేళ శేషూ చాలా విలువైన సమాచారాన్నే చేరవేశాడు కొమర్రాజుకు. అదేమిటంటే, సమరయ్య రెండో కుటుంబం హైద్రాబాద్‌లోని సరూర్‌నగర్‌లో ఉంటోంది. వాళ్ల ఇల్లు అందరిళ్లకూ దూరంగా విసిరేసినట్టుండే ఒక చిన్నపాటి బంగళా. ఆవిడ పేరు ఆదిలక్ష్మి. ఆమె గుమ్మడిదిబ్బ వాస్తవ్యురాలే. ఆ రోజుల్లో ఎవరి

తోనో లేచిపోయిందనుకునేవాళ్లు. ఆమె తల్లిదండ్రులు, ఇతర బంధువులు ఒక ఏడుపేడ్చి ఊరకుండిపోయారు. అయితే వాళ్లూహించిందంతా అబద్ధం.

ఆమె చిన్నప్పట్నించీ సమరయ్యను ప్రేమించింది. కాని సమరయ్యకామె ప్రేమను నివేదించేసరికి చాలా ఆలస్యమైంది. అప్పటికే సమరయ్యకు వివాహం జరిగిపోయింది. పిల్లలు కూడా పుట్టారు. మనోహరమైన ఆదిలక్ష్మి రూపాన్ని, ఆమె దివ్య ప్రేమను కాదనలేని సమరయ్య ఆమెను హైద్రాబాద్ రమ్మని కబురంపాడు.

అంతకుముందే హైద్రాబాద్ వెళ్లివున్న సమరయ్య, రెండు రోజుల తర్వాత ఆదిలక్ష్మిని నాంపల్లి స్టేషన్లో కలుసుకున్నాడు. ఆదిలక్ష్మి ఒక్కతే హైద్రాబాద్ రాలేదు. తన స్నేహితురాలు సుందరమణి, ఆమె భర్త రాజరత్నంతో కలిసొచ్చింది. వాళ్లిద్దరూ హైద్రాబాద్‌లోనే మలక్‌పేటలో కాపురం ఉండేవాళ్లు. ప్రస్తుతం జరిగిన సమరయ్య రెండో పెళ్లికి సాక్షులు వీళ్లే. అనేక పరిస్థితుల దృష్ట్యా ఆదిలక్ష్మిని తను రెండో పెళ్లి చేసుకోవలసి వచ్చిందనీ, ఆమె గుమ్మడిదిబ్బ వాస్తవ్యులైన భాగ్యమ్మ, చంద్రయ్యల ద్వితీయ పుత్రిక అనీ ఒక పేపరుపై రాసి సంతకం పెట్టాడు సమరయ్య. అలా చేయమని ఆదిలక్ష్మి అడగకపోయినా, అట్లా రాసివ్వడం అన్నివిధాలా శ్రేయస్కరమనిపించింది సమరయ్యకు.

"రెండో పెళ్లివాణ్ణి ఏంచూసి చేసుకున్నావు!" అని సమరయ్య అడిగిన ప్రశ్నకు "నేను అతన్ని పెళ్లికాకముందే ప్రేమించాను. అతనే తొందరపడి పెళ్లిచేసుకుని పిల్లల్ని కూడా కన్నాడు" అని గడుసుగా సమాధానం చెప్పింది ఆదిలక్ష్మి.

ఆదిలక్ష్మి పేరిట, పిల్లల పేరిటా అధిక మొత్తాలను సమరయ్య ఫిక్స్‌డ్ డిపాజిట్లు చేశాడు. ఇది కూడా ఒక ముందుజాగ్రత్త చర్యగా భావించాడు. పిల్లలు పుట్టినప్పుడు కూడా హాస్పిటల్ రికార్డుల్లో తండ్రిగా తన పేరు నమోదు చేశాడు.

ఈ విషయం రాజరత్నం దంపతులకు తప్ప, అతని అనుయాయులకుగానీ, అతని ఊరివారికి గానీ తెలియదు. తెలియకుండా ఉండడానికి అన్ని జాగ్రత్తలు తీసుకున్నాడు సమరయ్య.

అనేక పనుల మీద హైద్రాబాద్ వెళ్లే అవసరం ఉండేది గనుక, అతనిమీద ఎవ్వరికీ అనుమానం కలగలేదు. పైగా ఊళ్లో ఉన్నంతసేపు వీరంపల్లె వ్యవహారాలే కదా!

అతి దురదృష్టకరమైన విషయం, అతన్ని వీరంపల్లె వాసులు చంపేసిన తర్వాత ఒక నెల్లాళ్లకుగానీ ఆ వార్త ఆదిలక్ష్మికి తెలియకపోవడం.

ఒకసారి సుందరమణి తన పుట్టింటివాళ్లను చూడడానికి గుమ్మడిదిబ్బకు వెళ్లింది. అప్పటికే సమరయ్య చనిపోయి ఇరవై రోజులు దాటింది. విషయం తెలిసి నివ్వెరపోయింది సుందరమణి. 'ఈ విషయం తన స్నేహితురాలికి చెప్పడం ఎలా?' అని కుమిలిపోయింది. ఆమె సరూర్‌నగరొచ్చి, కాసంత బొట్టుతో తనకు ఎదురుగా వచ్చిన ఆదిలక్ష్మిని కావలించుకుని భోరుమంది. విషయం విన్న ఆదిలక్ష్మి మొదలు నరికిన తరువులా స్పృహతప్పి పడిపోయింది.

**కొత్తగాలి...**

**నీరు మెత్తనంటే...**
**కోసింది కొండల్ని**
**తోసింది బండల్ని**
**చంపింది భక్తుల్ని**

– వెల్మల రాంరెడ్డి,
కరీంనగర్ జిల్లా

సాయంత్రం స్కూలు నుంచి వచ్చిన పిల్లలిద్దరూ, కుంకుమ అద్ది పూలదండ వేసి ఉన్న తండ్రి ఫొటో చూసి చేష్టలుడిగి నిలబడిపోయారు. శోకవిహ్వాలయి పడి ఉన్న తల్లిని చూసి వాళ్లకు నోట మాట రాలేదు.

ఆదిలక్ష్మి కొడుకులలో పెద్దవాడి పేరు ఆనంద్. చిన్నవాడు ఆదిత్య. పెద్దవాడు ఎనిమిదో క్లాసు, చిన్నవాడు ఐదు.

ఆనాటి నుంచీ వాళ్లకు రాజరత్నం దంపతులే ఆప్తులు, బంధువులు, మిత్రులు.

అంజయ్య కొడుకు శేషగిరికి సుందరమణి భర్త రాజరత్నంతో బీరకాయ పీచు చుట్టరికం ఒకటి అఘోరించింది. ఏవేవో వ్యవహారాలమీద, హైద్రాబాదు వచ్చే శేషగిరికి, రాజరత్నం సాయం కావలసి రావడంతో ఆ చుట్టరికాన్ని తవ్వుకోక తప్ప లేదు.

కొన్నాళ్లకి వాళ్లిద్దరూ ఆప్తమిత్రులయినారు. గ్రామ రాజకీయాలకు దూరంగా ఉండమని రాజరత్నం అతనికి హితవు చెప్పేవాడు. "నువ్వెంత పిచ్చోడివి రాజరత్నమన్నా? ఉన్నవాళ్లందర్నీ పోగొట్టుకున్న నేను వాటి జోలికిపోతానా" అన్నాడు శేష చాలా బుద్ధిమంతుడిలాగా.

కాబట్టి రాజరత్నం అతన్ని పూర్తిగా నమ్మాడు. అయినా అతనితో "దేవుని తోడు, అమ్మతోడు, నీతోడు" అని అనేక ప్రమాణాలు చేయించుకున్నాక, ఆదిలక్ష్మిని గురించి చెప్పాడు రాజరత్నం. ఆ చెప్పేటప్పుడు, ఈ విషయం తను అతనికి చెప్పినట్టు తన భార్య సుందరమణికి తెలియకూడదని ఒట్టు పెట్టించుకున్నాడు. రాజరత్నం అంతటితో ఆగలేదు. ఒకరోజు తన వెంట శేషూను ఆదిలక్ష్మి ఇంటికి తీసుకెళ్లాడు. అక్కడ శేషూని తన షాపులో పని చేసే అబ్బాయిగా పరిచయం చేశాడు. అక్కడ పూలదండ వేసివున్న సమరయ్య నిలువెత్తు ఫొటో చూశాడు శేషు.

ఈ విషయం అతను కొమర్రాజుకు చెప్తున్నప్పుడు, తల్లి బంగారమ్మ అటుగా వచ్చి శేషూని వారించింది. అతణ్ణి పక్కకి తీసుకెళ్లి "ఏంరా నాయనా! మా మానాన మమ్మల్ని బతకనివ్వరా మీరు? ఆమె ఇద్దరు కసుగాయలను కన్నతల్లి. వాళ్లనీ పొట్టన బెట్టుకుంటేగానీ మీ రక్తదాహం తీరదా? ఇటువంటి విషయాలు బాబుకెప్పుడూ చెప్పొద్దు. అట్టా చెప్పేటట్టయితే నీకు నా ఇంట్లో స్థానం లేదు" అంటూ చీవాట్లు పెట్టింది.

అంతవరకు శేషు సగం కథ మాత్రం కొమర్రాజుకు చెప్పి ఉన్నాడు.

శేషు తనకేదో చెప్తూండడం, తల్లి అతన్ని వారించి పక్కకి తీసుకుపోవడం కొమర్రాజులో అనేక ఆలోచనలు రేపింది. కొమర్రాజు శేషూని చెరువుగట్టున కలుసుకున్నాడు. ఇద్దరూ మర్రిచెట్టు నీడలో ఆసీనులైనాక, మిగతా కథంతా అతి విపులంగా చెప్పాడు శేషు. అంతా విన్న కొమర్రాజు ఆలోచనలో పడ్డాడు.

ఆనంద్, ఆదిత్యలను చంపాలంటే అతనికి మనసు రాలేదు. పైగా హత్యాపాతకాలకీ, అతనికీ చాలా దూరం. ఆ నోటా ఈ నోటా విషయం విన్న అతని సహచరు

**కొత్తగాలి...** 

**అనాసక్తి రోగాన్ని**
**పారదోలి**
**అనురక్తినిచ్చేది**
**కళాస్వాదన!**

– కృష్ణ మాదవరపు,
కాకినాడ

లకు మాత్రం నిద్రపట్టలేదు.

"అన్నా! బాగుంది. నువ్వు మంచోడివి. అమ్మ మంచిది. మనమందరం మంచోళ్లమే. కాని అన్నా.. ఆ పిల్ల నాయాళ్లిద్దరూ శానా మంచోళ్లనీ నువ్వెట్టా అనుకుంటాండావు? మనం గమ్మునున్నా వాళ్లే మన మిందికి రారని నమ్మకమేంటి? " అని రకరకాలుగా కొమర్రాజులో వీరరసాన్ని, ప్రతీకారజ్వాలను రేకెత్తించారు. తన వెనుక జరుగుతున్న ఈ వ్యవహారాలేవీ బంగారమ్మకు తెలియదు.

★ ★ ★

స్కూలు నుంచి తిరిగొస్తున్న పెద్ద కొడుకు ఆనంద్‌ను ఎవరో రౌడీలు మట్టుబెట్టారన్న వార్త విని నిలువునా కూలబడిపోయింది ఆదిలక్ష్మి.

ఎన్.సి.సి. క్యాంపుకు వెళ్లిన తన చిన్న కొడుకు ఆదిత్యను మొదట రక్షించుకోదలచి, వెనువెంటనే ఒక టాక్సీలో సుందరమణి తోడురాగా క్యాంపు వేసిన ప్రదేశానికి వెళ్లింది. అప్పటికే ఆదిత్య కోసం గాలింపులు మొదలుపెట్టారు కొమర్రాజు మనుషులు. ఎవరికీ అనుమానం రాకుండా ఆదిలక్ష్మివాళ్లు బురఖాలు ధరించారు.

ఆదిత్యను తీసుకుని అమృతసర్ వెళ్లే రైలెక్కారు. అక్కడ ఆదిలక్ష్మి స్నేహితులున్నారు.

కొమర్రాజు పంపిన ఇరవైమంది మనుషులు హైద్రాబాదులో పదిరోజులు మకాం వేసినా ఆ ఇద్దరిలో ఒకర్ని మాత్రం చంపగలగడం అతడ్ని హతాశుణ్ణి చేసింది. ఆదిత్య కోసం అన్వేషణ మొదలైంది.

తన వెనక కొడుకు ఒక గ్రూపు కట్టడం, వాళ్లతో మంతనాలాడటం బంగారమ్మ దృష్టిని దాటిపోలేదు. 'హైద్రాబాదులో నడిరోడ్డు మీద, స్కూలు నుంచి ఇంటికొస్తున్న ఒక ముక్కుపచ్చలారని విద్యార్థిని ఎవరో దుండగులు క్రూరంగా హత్య చేశారు' అని పేపర్లో చదివి వినిపించాడు ఆమె వద్ద పనిచేసే ఒకబ్బాయి. ఆమె మనసు కీడు శంకించింది. ఆ వార్తని ఆ అబ్బాయితో మరీ మరీ చదివి వినిపించుకుంది. ప్రయత్నం మీద విషయం తెలుసుకుంది.

ఆరోజు చేతిలో విషం సీసా పట్టుకుని కొమర్రాజు గదికి వెళ్లి, అతనికెదురుగా నిలుచుంది. ఆమె జుట్టు విరబోసుకుని ఉంది. వేసుకున్న బట్టలు నలిగిపోయాయి. కళ్లు అరుణవర్ణానికి తిరిగి, అశ్రుధారలు కురిపిస్తున్నాయి. తల్లిని ఆవిధంగా చూసి నివ్వెరపోయాడు కొమర్రాజు. ఆమె చేతిలో ఉన్న సీసాపై 'పాయిజన్' అని ఎర్రటి అక్షరాలు రాసి ఉండడం చూసి, అతను ఆ సీసా లాక్కున్నాడు.

## కొత్తగాలి...



స్వార్థపరుల చేరికతో
రాజకీయమంతా కలుషితం
మేధావులారా! మౌనం వీడండి
ప్రజాస్వామ్యాన్ని కాపాడండి

– గుర్రం శ్రీనివాస్,
చెరుకుపల్లి, గుంటూరు జిల్లా

"అమ్మా! ఏం జరిగిందమ్మా! ఎందుకట్లా ఉన్నావు? " అన్నాడు కంగారుగా, వణుకుతున్న గొంతుతో.

ఆమె ఏమీ మాట్లాడలేదు. అతను మళ్లీ మళ్లీ అదే ప్రశ్న అడగడంతో ఆమె గొంతు విప్పక తప్పలేదు.

"ఏందా? అంతా సర్వనాశనం అయిపోయిందిరా. ఏదైతే జరగ్గూడదని కోరుకున్నానో, నిన్ను ఈ ఊరికి దూరంగా ఎందుకైతే పెంచినానో, అదే జరగతావుందిరా. నీది మీ నాయన రక్తమేరా. పెళ్లయిన ఆరేళ్లకే నన్ను ముండ మోయించినాడు.

'ఆ గొడవలు మనకొద్దయ్యా.. మనమా నాన మనం బతకదాం' అని చెవిలో ఇల్లు గట్టుకొని పోరినాను. నామాటిన్నాడా? ఊరిమద్దెన ఆ యాపమానుకు శవమై ఏల్లాడతావుంటే నా పాపిస్టి కళ్లతో చూసి నాను. ఇంకా ఈ పాపిస్టి కళ్లతో యేమేం సూడాలని నా ముఖాన రాసిపెట్టివుందో? అదంతా నేను చూళ్లేనురా. ఇంగోసారి పిచ్చాసుపత్రిపాలు కాలేను" అంటూ సమీపంలో ఉన్న కత్తితో మణికట్టు దగ్గర ఒక లోతైన గాటు పెట్టుకుంది.

ఆ గాయం నుంచి ధారగా రక్తం కారుతోంది. అది ఆమె చీరను, కట్టు గట్ట వచ్చిన కొడుకు బట్టలనూ, ఆ గదినీ తడిపేస్తూ వుంది. అతని కేకలకు అయిదారు మంది ఆ గదిలోకి వచ్చారు. అప్పటికే బంగారమ్మ కళ్లు తిరిగి పడిపోయింది.

ఆమెకు స్పృహ వచ్చేసరికి మంచంమీద పడుకొని ఉంది. దుస్తులు మార్చేసి వున్నాయి. చేతికి కట్టు ఉంది.

ఆమె కొడుకు అభ్యర్థనపై తన మనసులో మాట బయట పెట్టింది. మొదట నిరాకరించినా, సమరయ్య కొడుకు మరణానికి తనే కారణమని ఒప్పుకోక తప్పింది కాదతనికి. అంతేకాదు, రెండోవాడి కోసం తన మనుషులు వెదుకుతున్న విషయం కూడా చెప్పక తప్పిందికాదు.

అంతా విన్న బంగారమ్మ మరింత హతాశురాలైపోయింది. తను ప్రాణాలతో మిగలాలంటే ఈ మారణకాండ ఇకనైనా ఆగాలనీ, వారిజోలికి పోకుండా ఉండడంలోనే కొమర్రాజు భవిష్యత్తూ, అతని క్షేమమూ, ఆ వూరి సంక్షేమమూ ఉన్నాయన్న నిజాన్ని చెప్పి, అతన్ని అందుకు ఒప్పించింది.

ఈ ప్రపంచంలో తనకెవరైనా ఉన్నారంటే తన తల్లే. ఆమె తర్వాతే తనకెవరైనా. తల్లిని ఇంతగా నొప్పించే పనులు తనెందుకు చేయాలి? ఆరిన చితిని మళ్లీ రాజేయడం ఎందుకు?

"అమ్మా! నాన్నతోడు చెబుతున్నాను. నేనింక ఇటువంటి పనులకు దూరంగా ఉంటాను" అని మాటిచ్చాడు కొమర్రాజు తన తల్లికి.

దాంతో బంగారమ్మ మనసు కుదుటపడ్డది. ఆమె కొమర్రాజుకు పెళ్లిచేయ నిశ్చయించి, సంబంధాలు వెదకసాగింది.




**త**ల్లి బంగారమ్మకు మాటిచ్చిన ప్రకారం కొమర్రాజు ఇక ప్రతీకారాల జోలికి పోలేదు. అతను ఆదిత్య ఆచూకీ కనుగొనడంలో ఏమాత్రం ఆసక్తి చూపకపోవడం అనుచరులను నిరుత్సాహపరచింది. కాని చేసేదేమీలేక మిన్నకుండిపోయారు.

బంగారమ్మ కూడా కుమారుడు ఎవరితో మాట్లాడుతున్నాడు? అతని వ్యవహారాలేంటి? అనే విషయాలమీద గట్టి నిఘా వేసి ఉంచింది. శేషగిరిలాంటివాళ్లు అతన్ని కలుసుకోకుండా కట్టడి చేసింది.

అదే సంవత్సరం 'మంగమ్మ' అనే పదహారేళ్ల కలిగినవారి అమ్మాయితో కొమర్రాజుకి వివాహం జరిపించింది బంగారమ్మ.

సంసారి అయ్యాక కొమర్రాజు ఇంతకుముందు వ్యవహారాలను పూర్తిగా మర్చిపోయాడు. అతనికిప్పుడు భార్యతోడిదే లోకంగా ఉంది. అసలు కొమర్రాజు

లాంటి చరిత్ర, అటువంటి కుటుంబ వ్యవహారాలు గలిగిన వ్యక్తులకు పిల్లనివ్వడానికి ఏతండ్రీ ముందుకు రాడు. కాని పిల్ల తండ్రి బంగారమ్మకు అన్నవరుస బంధువు. అతను కట్టకిందిపల్లెకు చాలా దూరంలోవున్న ఒక పల్లెలో ఉంటున్నాడు. పైగా ఇటువంటి హత్యారాజకీయాలకు దూరంగా మసలే వ్యక్తి.

★ ★ ★

ఆదిత్య ప్రస్తుతం ఆదిత్యసింగ్ అనే నామధేయంతో పంజాబీల ఇంట పెరుగుతున్నాడు. ఆ వూరి పేరు మాలేగావ్. అతను స్కూలుకు పోతూ పంజాబీ మీడియంలోనే చదువుకొంటున్నాడు. తన తండ్రి, తన అన్న మరణాల సమయానికి అతను బాగా ఊహ తెలిసినవాడు కావడంతో, జరిగిన ఏ సంఘటననూ అతను మర్చిపోలేదు. తను తన తల్లికి ఎందుకు దూరంగా ఉంటున్నాడో అతనికి బాగా తెలుసు. అతని ప్రాణాలను రక్షింపగోరే వాళ్లు కావడంవల్ల తల్లిగాని, రాజరత్నం కుటుంబంవాళ్లుకాని అతన్ని సమీపించడానికి సాహసించలేదు.

పూర్తిగా పంజాబీ యువకుడిలా ఉన్న ఆదిత్యసింగ్‌ను ఆ గడ్డం, ఆ పగడీలతో చూసి ఆంధ్రా అబ్బాయంటే ఎవరూ నమ్మరు. అతను డిగ్రీ పూర్తి చేసుకుని, తెలుగు గడ్డపై అడుగు పెట్టాడు.

ఒక పుస్తకాల కంపెనీవాళ్లు ముద్రిస్తున్న జి. కె., చరిత్ర, భూగోళం, విజ్ఞానశాస్త్రం లాంటి పుస్తకాలను అమ్మే ఏజంటుగా పని చేస్తూ, అతను హైద్రాబాదులో తిరుగుతున్నాడు. అతనికి తన తల్లిని చూడాలని చాలా ఆరాటంగా ఉంది.

ఒకనాడతను ఒక సెట్ పుస్తకాలతో సరూర్‌నగర్లో ఉన్న తమ ఇంటికెళ్లాడు.

అతను వాకిలి బయట నుంచి "మాజీ, మాజీ! ఓ అమ్మా" అని పిలవగానే, నిద్ర పోతున్న ఆదిలక్ష్మి తటాలున మేలుకుంది.

"ఓ... అమ్మా! ఎంత తీయని పిలుపది! ఎన్ని జన్మల్లోనో పుణ్యం చేసుకునివుంటే తప్ప, తనలాంటి పాపిష్టివాళ్లకి ఆ అదృష్టం ఎక్కడిది?" అని తలపోస్తూ వెలుపలికొచ్చి, ఆ పంజాబీ అబ్బాయిని చూసింది.

చిక్కి శల్యమైవున్న తల్లిని చూడగానే ఆదిత్య హృదయం నీరుగారిపోయింది. పచ్చని ఆ పసిమిఛాయ ఏమైంది? ఎప్పుడూ పట్టుచీరలో కనిపించే తన తల్లి అలా సాదా చీర కట్టుకొని పేదరాలిలాగ ఎందుకుంది?' అని మనసులోనే కుమిలిపోయాడు. అతని ప్రశ్నలకు సమాధానాలు అతని వద్దే వున్నాయ్.

"మాజీ! యే సబ్ అచ్చే అచ్చే కితాబె హై. ఒక సెట్ తీసుకోండి. మీ పిల్లలకు చాలా చాలా ఉపయోగపడ్తాయి" అన్నాడె లాగో గొంతు పెగల్చుకుని.

పిల్లల మాటెత్తగానే ఆమె తన దుఃఖాన్ని ఆపుకోలేకపోయింది. 'ఓ... అమ్మా' అన్న అతని పిలుపే ఆమెలో మాతృత్వపు మమకారాన్ని మేల్కొలిపింది. నీటిచెలమలో ఊరినట్టు కళ్లలో నీళ్లూరాయి. అది అతను చూడలేక "అమ్మా! నేనమ్మా.. నీ ఆదిత్యను! ఏడవకమ్మా!" అంటూ ఆమె కాళ్లపై పడ్డాడు.

అతని కళ్లవెంబడి కూడా ధారగా నీరు కారుతోంది. అపూర్వమైన ఆ తల్లీబిడ్డల కలయికతో ప్రకృతే పులకించింది.

అతనికి కడుపునిండా భోజనం పెట్టాక, ఆమె ఇలా చెప్పింది.

"నాయనా! నేను చాలా దురదృష్టవంతురాలిని. కాకుంటే భర్తను పోగొట్టుకొని, అందరికీ దూరంగా గుట్టుగా కాలం గడిపే నన్ను, చివరికి నా పిల్లలకు కూడా దూరం చేసి విధి చిన్నచూపు చూస్తుందా?

నాయనా! నువ్వు నాదగ్గరకొచ్చి నన్ను కలవడం ఎంతమాత్రం నీకు శ్రేయస్కరం కాదు. అందుచేతే నేను కాని, సుందరమణికాని నిన్ను కలవలేకపోయాం. నా మాటవిను.. దయచేసి నన్ను కలవడానికి ప్రయత్నించకు. అందులోనే నీ క్షేమం అంతా వుంది"

ఆ మాటలు విన్న ఆదిత్య కన్నీళ్లు కారుస్తూ అక్కడి నుండి నిష్క్రమించాడు. తను తండ్రిని పోగొట్టుకోవడం, అన్నను ఎడబాయడం, తల్లికి దూరంగా ఎక్కడో పెరగడం, చివరికి వయసు మళ్లిన ఆమెకు ఆసరాగా ఉండలేకపోవడం అతన్ని అమితంగా ఖేద పరిచాయి. దీనికంతకు కారకులెవరు? వారిని ఊరకే వదలకూడదని నిశ్చయించుకున్నాడు.

★ ★ ★

మంగమ్మకు ఏడోనెల జరుగుతూవుంది. పుట్టినింటివారు ఆమెకు శ్రీమంతం జరపాలని నిశ్చయించి బంగారమ్మకు కబురు చేశారు. బంగారమ్మ, కొమర్రాజు, మరికొందరు బంధువులు ఆ శ్రీమంతానికి తరలి వెళ్లారు.

మంగమ్మ ఒకత్తే కూతురు కావడంతో ఆ కార్యం ఘనంగా జరిపించారు ఆమె తల్లిదండ్రులు. అది ముగిసిన తర్వాత వీరంపల్లె వాసులంతా ఎద్దుల బండ్లలో తిరిగి తమ గ్రామానికి ప్రయాణమైనారు.

వీరంపల్లె ఇంకా పది కిలోమీటర్ల దూరం ఉండగానే వారిమీద సాయుధులైన కొందరు వ్యక్తులు దాడి జరిపారు. ప్రతి బండిని వెతికి కొమర్రాజును ఒక బండిలో నుంచి వెలుపలికి ఈడ్చారు. కొమర్రాజు రూపం తమ దగ్గరున్న ఫొటోతో సరిపోతుందో లేదో సరిజూసుకున్నారు. అది సరిగ్గా సరిపోవడంతో గండ్ర గొడ్డళ్లు, వేటకొడవళ్లూ ఉపయోగించి కొమర్రాజు దేహాన్ని ముక్కలు ముక్కలుగా నరికారు. ఇంకెవరికీ ఏ అపకారమూ చేయకుండా ఆ కిరాయి హంతకులంతా తాము వచ్చిన జీపులోనే నిష్క్రమించారు హడావిడిగా.

తన బిడ్డ తన కళ్లముందే అతి క్రూరంగా అసువులు బాయడంతో నిశ్చేష్టురాలైంది బంగారమ్మ. తాను తీసుకున్న జాగ్రత్తలన్నీ ఏమైనాయి? ఎందుకిలా జరిగింది? అన్న ప్రశ్నలు కూడా మొలకెత్తనీక, ఆమె మెదడు మొద్దుబారిపోయింది. పిచ్చిపిచ్చిగా మాట్లాడుతున్న ఆమెను మళ్లీ మెంటల్ హాస్పిటల్లో చేర్చవలసి వచ్చింది.

'ఈ హత్యాకాండకు కారణభూతుడు సమరయ్య, ఆదిలక్ష్మిల రెండో సంతానం' అని కొమర్రాజు అనుచరులు ఊహించారు. కాని అది నిజంకాదు.

"అమ్మా! ఆవేళ వాణ్ని కనుక్కోడానికి మేం చేసిన ప్రయత్నాలన్నీ చేతులారా నాశనం చేస్తివి. ఇప్పుడు నువ్వు కొడుకుని పోగొట్టుకున్నంక ఎంత తెలివి తక్కువ పని చేసినావో తెలిసొచ్చిందా? ఇప్పుడు మేం దిక్కులేని వాళ్లమయినాము. మనూరు దిక్కులేనిదయింది" అని అనుచరగణం రకరకాలుగా మాట్లాడినా, ఆమె మెదడులో ఏదీ దూరలేదు.

ఆగమేఘాలమీద ఈ వార్త మంగమ్మ తల్లిదండ్రులకు చేరింది. ఇప్పుడు వాళ్ల సమస్యంతా 'తమ బిడ్డను, ఆమెకు పుట్టబోయే సంతానాన్ని ఎలా రక్షించాలి?' అనే. వాళ్లు మంగమ్మను చాలా దూరంలో ఉన్న ఒక వూరికి తరలించారు. అక్కడే ఒక లేడీ డాక్టరు పర్యవేక్షణలో మంగమ్మ కాన్పు జరిగింది. అదృష్టమో, దురదృష్టమో కాని ఆమె కవల పిల్లలకు జన్మనిచ్చింది. అందులో ఒక శిశువు ఆడ, మరొక శిశువు మగ. ఈ విషయం మంగమ్మ తల్లిదండ్రులకు, కాన్పు చేసిన నర్సుకు, డాక్టరుకు తప్ప మరెవ్వరికీ తెలియదు.

మగ శిశువును ఏం చేశారో ఏమోకాని, మంగమ్మ ఆడశిశువుతో తన గ్రామాన్ని చేరింది.

ఒక్కోసారి పరిస్థితులు మనిషిని నిలువ నియ్యకుండా తరుముతాయి. వర్తమానం మీద తప్ప మనిషికి ఇంకే విషయంపైనా ధ్యాస ఉండదు. ప్రస్తుతం మంగమ్మ పరిస్థితి కూడా అదే. పరిస్థితులు ఆమెను తరిమికొట్టాయి. ప్రస్తుతం తన బిడ్డల క్షేమం తప్ప ఆమెకింక ఏ ధ్యాసా లేదు.

తనవద్ద పెరుగుతోన్న తన కుమార్తె వీరమ్మను కత్తిసాము, గరడీ మొదలైన విద్యల్లో ప్రవీణురాలిగా చేయాలని ఆశించింది. అదేవిధంగా వీరమ్మను పెంచి పెద్ద చేయసాగింది మంగమ్మ.

వీరమ్మకు విద్యగరిపే వ్యక్తి పేరు 'బోయిన దండనాయకుడు'. అతని ముత్తాత ఒక రాజు వద్ద దండనాయకుడిగా పని చేయడంతో అతని తరువాత వారిని, వారి అసలు పేరుకు పక్కన దండనాయకుడనే పేరు తగిలించి పిలిచేవాళ్లు.

అతను వీరమ్మతో "అమ్మాయి? నీవు నేర్చుకునే కర్రసాము, కత్తిసాము, గరడీ లాంటి విద్యలకు పరికిణి, వోణీ ప్రతిబంధకం. అందుచేత నువ్వు నీ వేషం మార్చుకోవాలి" అని చెప్పాడు. అప్పట్నుంచీ వీరమ్మ అతనివద్దకు వెళ్లేటప్పుడు పురుషులు ధరించే ఉడుపులు ధరించి వెళ్లసాగింది.

అట్లా మగదుస్తులతో విద్యలు నేరుస్తున్న వీరమ్మను చూసి తల్లి మంగమ్మ తన పుత్రుని గుర్తుచేసుకొని కుమిలిపోసాగింది.

మతి చలించడంతో ఈ విషయాలేవీ బంగారమ్మకు తెలిసే అవకాశమే లేకుండా పోయింది.

నిజానికిప్పుడు మంగమ్మ కొడుకెక్కడున్నాడో, వాడి పేరేమిటో, వాణ్ణి పెంచేవారి ఊరు, పేరు తదితర వివరాలు, ఆమె అమ్మానాన్నలకు కూడా తెలియదు.

ఆవేళ కాన్పు చేసిన డాక్టరమ్మ "అమ్మా! మరొకరి సాయం లేకుండా ఒక చంటిబిడ్డను సాకడం కష్టం. అట్లాంటిది ఈ కవల పిల్లలను సాకడం చాలా కష్టమైన పని. నా మాట వింటానంటే ఒక సలహా"

## చిన్నప్పట్నుంచే అలవాటు!



**ఎ. పుష్పాంజలి**

పుట్టింది నెల్లూరులో. జంతుశాస్త్రంలో ఎమ్మెస్సీ చేశాను. నాకు చిన్ననాటి నుంచే కవితలు, కథలు రాసే అలవాటు ఉండేది. మొదటికథ 1985లో ప్రచురితమయింది. రేడియో వ్యాసాలు, నాటకాలు, ప్రఖ్యాత రచయితల రచనలపై పరిశీలనలు వెలువరించాను. ఇప్పటి వరకూ దాదాపు రెండువందల కథలు రాశాను. వాతావరణ కాలుష్యం, జనాభాపై రాసిన తొలినవల 'మనిషిని వెతుక్కో ఓ మనిషి' ఇటీవలే ప్రచురితమైంది. కళాశాల అధ్యాపకురాలిగా ముప్పై యేళ్ల సుదీర్ఘ జీవితాన్ని గడిపాను. ప్రస్తుతం విశ్రాంత జీవితాన్ని మదనపల్లెలో గడుపుతూ రచనలు చేస్తున్నాను. చదవడం, రాయడం, పాత సినిమాలు చూడటం, పాత పాటలు వినడం నా వ్యాపకాలు.

చిరునామా:
ఎ. పుష్పాంజలి,
7/85, రవీంద్రనగర్,
మదనపల్లె-517325,
చిత్తూరు (జిల్లా)

అన్నది.

"చెప్పండమ్మా" అన్నది మంగమ్మతల్లి పోలమ్మ.

"అదో.. ఆ బెడ్ మీద అట్లా శవంలా పడి వున్న ఆ స్త్రీని చూశారా? ఆమె పేరు చెంగమణి. నిన్న కాన్పయింది. ఆరోసారి బిడ్డను పోగొట్టుకుంది. కుటుంబమూ, బంధువులూ, అందరూ శోకసముద్రంలో మునిగిపోయున్నారు. మీరేమీ అనుకో నంటే, ఈ బిడ్డల్లో ఒకరిని ఆ తల్లి ఒడిలో వేసి, పుణ్యం కట్టుకోండి" అంది.

కవలల్లో ఒకరు 'మగ' కావడంతో 'వాణ్ణెలా రక్షించాలా' అని మంగమ్మ తల్లి దండ్రులు ఆలోచనలో పడివున్నారు. 'వీణ్ణి తాము సాకడం స్వయంగా తమ మెడలకు ఉరి బిగించుకున్నట్టే. కాబట్టి ఆడ శిశు వును తాముంచుకొని మగశిశువును వారి కిస్తే సరిపోతుంది'. అంతవరకూ వాడి భవిష్యత్తు ప్రశ్నార్థకంగా ఉన్నవాళ్లకు డాక్ట రమ్మ సలహా గట్టున పడవేసినట్లైంది. అందువల్ల వాళ్లు ఇంకే సందేహం పెట్టుకో కుండా, మంగమ్మ అనుమతి కూడా అవ సరం లేదనుకుని ఆ కవలల్లో మగశిశు వును చెంగమణికిచ్చివేశారు. వారలా మగ శిశువునివ్వడం డాక్టరుకు ఆశ్చర్యం కలిగిం చింది.

తన తల్లిదండ్రులిట్లా చేయడం మంగ మ్మకు కష్టమనిపించినా బిడ్డ యోగక్షే మాల దృష్ట్యా ఆ బిడ్డ తన వద్ద పెరిగే కన్నా ఎవరి దగ్గరో, ఎక్కడో పెరగడం చాలా మంచిదనిపించింది. అంచేత ఆమె మరి మాట్లాడలేకపోయింది.

'ఇక తనకు మగ బిడ్డయినా, ఆడబిడ్డ యినా ఇదే' అనుకుని ఆడ శిశువును అక్కున చేర్చుకుని వచ్చేసింది మంగమ్మ.

ఆమె వీరంపల్లెకు రాకుండా, కొన్ని సంవత్సరాలు తను పుట్టినూళ్లోనే ఉండిపో యింది. ఏ సమయం ఎట్లా వుంటుందో ననుకుని పిల్లను అన్ని యుద్ధ విద్యల్లోనూ ప్రవీణురాలిని చేయాలని ఆశించింది.

ఆ పిల్లకు తాతపేరు కలిసొచ్చేటట్టు 'వీరమ్మ' అని పెట్టారు. వీరమ్మలోనే తన మగబిడ్డను కూడా చూసుకోదలచి, ఆమె కు మగ పిల్లవాని దుస్తులు ధరింపజేసి, పెంచుకోసాగింది మంగమ్మ.

దినదినాభివృద్ధిచెందుతూ పెరుగుతున్న వీరమ్మను చూసి 'తన మగ బిడ్డ ఎక్కడు న్నాడో? ఎట్లాగున్నాడో? తన వంశాన్ని నిలబెట్టేవాడు ఖర్మకాలి పరాయింట పెరు గుతున్నాడు! వాడెప్పటికైనా వస్తాడు' అని రకరకాల ఆలోచనలతో కుమిలిపోసాగింది మంగమ్మ.

★ ★ ★

ప్రస్తుతం మంగమ్మ తన తల్లిదండ్రుల వద్ద లేదు. వీరమ్మ విద్యాభ్యాసం ముగియ గానే ఆమె కూతురిని తీసుకొని అత్తవా రిల్లు చేరింది.

పాడుపడిన ఆ ఇంటిని బాగు చేసుకుని, నివాసయోగ్యంగా చేయడానికి దాదాపు రెండు నెలలు పట్టిందామెకు. ఆశ్రితు లంతా వచ్చి చేరారు. ఎవరూ వ్యవ సాయం చేయకపోవడంతో తమ పొలాలు బీడులైనాయి. తోటలు దొడ్లయినాయి. ఇన్నాళ్లూ అవి ఇతరుల హస్తగతం కానీయ కుండా సంరక్షించినవారు ఒకప్పుడు కొమ

## కొత్తగాలి...

**భూగర్భ నిక్షేపాల్ని**
**ఆక్షేపణ లేకుండా**
**దోచుకున్నారు పెద్దలు!**
**ఆగర్భ శ్రీమంతులయ్యారు పిల్లలు!!**

– *అంబటి వెంకటశివారెడ్డి,*
యర్రగుంట్ల

్రాజు వద్ద ఉన్న బాషా, అతని కొడుకులే! బాషా భార్య కూడా ఇల్లూవాకిలి చిమ్మి శుభ్రం చేసేది.

మంగమ్మ రాగానే శేషగిరి, అతని భార్య, ఇంకా చాలామంది పిలువకనే వచ్చి ఇల్లూ వాకిళ్లు శుభ్రం చేశారు. ఇన్నాళ్లూ పాడు బడ్డ ఆ ఇంటిని చూసి కంటతడి పెట్టని వాళ్లు లేరు. ఇప్పుడు మంగమ్మ, వీరమ్మల రాకతో తాము పోగొట్టుకున్న పెన్నిధి దొరికినట్టు భావించసాగారు వీరంపల్లె వాసులు.

ఇంట్లో మగవాడుండి చేసే ఇంటి పెత్తనానికీ ఆడవాళ్లు చేసే పెత్తనానికీ చాలా తేడా వుంటుంది. ఆ విధంగా మంగమ్మ కూడా తన స్థానం నిలదొక్కుకోడానికి చాలా కష్టపడవలసి వచ్చింది. ఆమె భూముల్లో కొన్నిటిని సాగు చేసుకుంటున్న కొందరు రైతులు వాటిని తిరిగి ఆమెకు ఇవ్వడానికి ఇష్టపడలేదు. బాషా సాయంతో వాటికి సంబంధించిన పత్రాలను వెదికి పట్టి గ్రామపెద్దలతో పంచాయితీ పెట్టించి, మళ్లీ తమ భూములు స్వాధీనం చేసుకుంది మంగమ్మ. అంతే కాదు బీడైన పొలాలు దున్నించి, సాగు చేయించసాగింది. వీరమ్మ కూడా తన సొంతగుర్రం మీదెక్కి మగాడిలా పొలాలకు వెళ్తూ, దొడ్డిగా మారిన తోటలను బాగుచేయించుకుంటూ వుంటే, వీరంపల్లె గ్రామస్థులందరికీ కన్నుల పండువగా ఉంది.

ప్రస్తుతం మంగమ్మను తమ గ్రామానికి పెద్దదిక్కుగా వీరంపల్లె వాస్తవ్యులంతా భావిస్తున్నారు. అంతేకాకుండా, మంగమ్మ ఆశ్రితులను 'అయ్యోపాపం' అనేది. చుట్టుపక్కల గ్రామాల్లో కూడా ఏవైనా తగాదాలు వస్తే మంగమ్మ లోగిలికే వచ్చి పంచాయితీ చేయించుకుని వెళ్లేవాళ్లు. ఇటువంటి పంచాయితీలు ఉచితంగా చేయడమే కాకుండా, తన డబ్బులు ఖర్చు చేసైనా సరే, వాళ్ల కష్టాలను తీర్చడానికి వెనుకంజ వేసేదికాదు మంగమ్మ. దాంతో చుట్టుపక్కల గ్రామాల్లోనూ, వీరంపల్లెలోనూ మంగమ్మ ప్రాబల్యం పెరిగింది.

వీరమ్మను అందరూ వీర్రాజంటుండే వాళ్లు. 'అమ్మో మంగమ్మతల్లీ! మీ మామ వీర్రాజు శౌర్యం ఉందమ్మా నీ బిడ్డలో' అని పొగుడుతూ ఉంటే ఆమె పొంగిపోయేది. అంతేకాదు, ఆ సమయంలో ఆమెకు తన కుమారుడు గుర్తు వచ్చేవాడు. 'వీరమ్మ ఆడపిల్లై ఉండి మామగారికింత మంచి పేరు తెస్తే, ఇక తన కొడుకు తనింట వుంటే ఎటువంటి పేరుప్రతిష్ఠలు సంపాదించేవాడో!' అనుకుని కుమిలిపోయేది. ఒక్కోసారి తనకంటి నీరు ఆపుకోవడం కోసం ఆమె లోపలి గదిలోకి వెళ్లవలసి వచ్చేది.

వీరమ్మకు తన వయసు స్నేహితురాండ్రు ఓ పదిమంది దాకా ఉన్నారు. వీళ్లంతా వీరమ్మతోనే కలిసి తింటూ, తిరుగుతూ ఉండేవాళ్లు. వాళ్లలో పుల్లమ్మ చాలా ముఖ్యురాలు.

పుల్లమ్మకు తల్లిదండ్రులు లేరు. తండ్రి గుమ్మడిదిబ్బ కక్షల్లో మరణించాడు. తల్లి కాలం తీరిపోయింది. తాత కోదండయ్య సంరక్షణలో ఆమె పెరుగుతూ ఉంది. వీర్రాజు కాలంలో నునూగు మీసాలతో ఉన్న ఆయనను కోదండం అని పిలిచేవారు. వీర్రాజుతో కలిసిమెలిసి తిరుగుతూ అతనికి ఆత్మీయుడిగా ఉండేవాడాయన. గుమ్మడి దిబ్బ కక్షల్లో ఇతను బలికాకపోవడానికి కారణం అనేక సంవత్సరాలు వీరంపల్లెకు దూరంగా ఉండడమే. ఇతను తన కొడుకు గరుడయ్యను, భార్య సుబ్బమ్మను వీరంపల్లెలోనే వదిలి బతుకుతెరువు కోసం సర్కారు జిల్లాలకు వెళ్లాడు. ఏ భూమీ లేని కోదండయ్య,

నలుగురైదుగురు కమ్మనాయుళ్ల ఇళ్లల్లో పాలేరుగా పనిచేసి, కొంత డబ్బు సంపాదించుకుని వీరంపల్లె తిరిగొచ్చాడు. అతను వస్తూ వస్తూ గరుడయ్యను తీసికెళ్లి తన స్థానంలో పెట్టివచ్చాడు. కొంతకాలానికి గరుడయ్య కూడా కాస్త డబ్బు సంపాదించుకుని తిరిగొచ్చాడు. ఇద్దరూ కలిసి వీరంపల్లెలో కాస్త భూమి కొన్నారు. గరుడయ్యకు పెళ్లయ్యేసరికి సుబ్బమ్మ మంచంపట్టింది. గరుడయ్య పొలం సమీపాన కాస్త భూమిలో ఒక చిన్నఇల్లు కట్టుకున్నాడు. అక్కడే వాళ్లంతా నివసిస్తూ వుండేవారు. నిజానికి ఆ భూమిని వీర్రాజే కోదండయ్యకు దానం చేశాడు. గరుడయ్య భార్య చంద్రమ్మ అత్తమామలను బాగా చూసుకునేది. ఒకనాడు గరుడయ్య కొందరు యువకులతో కలిసి, గుమ్మడిదిబ్బ మీదికి దాడికి వెళ్లాడు. ఆ వెళ్లిన గరుడయ్య మరి తిరిగిరాలేదు. అప్పటికి పుల్లమ్మ నెలల పసికందు.

సుబ్బమ్మ, చంద్రమ్మ, గరుడయ్యల మరణం తర్వాత, కోదండయ్యే పుల్లమ్మకు తల్లీతండ్రీ అయి సాకాడు. తాత శిక్షణలో పుల్లమ్మ పొలం పనులు నేర్చుకుంది. తాతకు వయసు మళ్లాక పుల్లమ్మే పొలం పనులు చూసుకుంటుండేది. ఆ విధంగా గ్రామస్థుల మగరాయుడనే హేళనకు గురైంది పుల్లమ్మ.

అయితే వీరమ్మ తనలాగా పొలం పనులు చేయడమే గాక, గుర్రపు స్వారీ కూడా చేస్తూండటం, ఆమెకు వీరమ్మ పట్ల ఒక ఆరాధనా భావాన్ని మొలకెత్తించింది. ఒకరోజు అటుగా వెళ్తున్న వీరమ్మతో మాటలు కలిపింది. దాహంగొని ఉన్న వీరమ్మకు చల్లటి టెంకాయ నీరు, స్వయంగా కొట్టి ఇచ్చింది.

ఆ విధంగా ఇద్దరూ స్నేహితులైనారు. అప్పటికే కోదండయ్య చాలా వృద్ధుడై మంచం పట్టి ఉన్నాడు. అతను ఇంటిలోపల పడుకొనే కాలం గడిపేవాడు. అందువల్ల వీరమ్మ రాకపోకల గురించి అతనికంతగా తెలియదు.

అయితే ఒకనాడు వీరమ్మ పుల్లమ్మను "ఏమ్మా! ఇంట్లో ఎవరెవరున్నారు? " అరి అడిగింది. దానికి పుల్లమ్మ "ఎవరున్నారు? మాయమ్మ, నాయినా ఎప్పుడో పోయిన్రు. ఇప్పుడు మాతాతొక్కడే ఉండాడు, ఆయినా బొత్తిగా నిల్చిపోయుండాడు" అంది.

"అయితే పా.. మీ తాతని సూడాల" అంటూ ఇంట్లోకి ప్రవేశించింది వీరమ్మ.

"తాతా! ఇగో, వీర్రాజయ్య మనవరాలు వీరమ్మ.. నిన్ను సూట్టానికొచ్చింది" అంటూ తాతను లేపింది.

వీర్రాజు పేరు వినగానే కోదండయ్యకు రోమాలు నిక్కబొడుచుకున్నాయ్, తారక మంత్రం విన్నచందాన.

అతని దేహంలో ఎక్కడలేని శక్తి పెల్లుబికింది. వీరమ్మపై ప్రేమతో అతని గుండె ఉప్పొంగింది. పుల్లమ్మ సాయంతో లేచి కూచుని, వీరమ్మను పక్కనే కూర్చోపెట్టుకుని, ఆప్యాయంగా సంభాషించాడు. అది మొదలుకుని వీరమ్మకు ఆ ఇంటితో అనుబంధం పెరిగింది. వీరమ్మ చదువుకొని వున్నా, ఆ పల్లెవాళ్లతో వాళ్లభాషే మాట్లాడేది.

వీరమ్మ స్నేహితురాళ్లు మాటల మధ్యలో ఆమె తాత వీర్రాజు గురించీ, తండ్రి కొమర్రాజు గురించీ, గుమ్మడిదిబ్బకూ వీరంపల్లెకూ మధ్య జరిగిన దాడులు, రెండు గ్రామాల మధ్య పెరిగిన కక్షల గురించి ప్రస్తావించేవారు. నిజానికి వీరమ్మకు ఈ పాత విషయాలేవీ అంతగా తెలియదు.

ఒకనాడు మంగమ్మపూరి నుంచి ఒక మనిషి హడావిడిగా వచ్చి మంగమ్మతో

"అమ్మా! నాయిన పరిస్తితి ఏం బాగాలేదు. ఇయ్యాలా, రేపా అన్నట్టున్నాడు. నిన్ను సూడాలని శానా ఇదవుతూ ఉండాడు" అంటూ కన్నీరు పెట్టుకున్నాడు.

ఆ వార్త వినగానే మంగమ్మ బండి కట్టించుకుని వీరమ్మను వెంటబెట్టుకుని, పుట్టిల్లు చేరింది.

మంగమ్మవూరి నుంచి వచ్చిన వ్యక్తి తెచ్చిన వార్తలో అతిశయోక్తి ఏమీలేదు. తండ్రిని సమీపంలో ఉన్న టౌన్లో పేరెన్నికగన్న ఆసుపత్రిలో చేర్చి వున్నారు ఊరిపెద్దలు. మంగమ్మ తల్లి, మిగిలినవారంతా అక్కడే ఉన్నారు.

ఆయన వయసు ఎనభై సంవత్సరాలుండవచ్చు. దేహదారుఢ్యం అతడ్ని ఇన్నాళ్లు బతికించింది. ఆయన మంగమ్మను దగ్గరకి తీసుకుని, కంటతడి పెట్టాడు. మనుమరాలు వీరమ్మను చూడగానే, పోతున్న ప్రాణాన్ని కాసేపు బిగబట్టుకోగలిగాడు. అక్కడున్న అందరినీ బయటికి పొమ్మని, వీరమ్మను మంచంమీద తన పక్కగా కూచోబెట్టుకున్నాడు.

"అమ్మే ఈరమ్మా! ఇన్నాళ్లూ నీకు ఈ ఇసయం సెప్పలేకపోతి. ఇంక సచ్చేరోజు దగ్గరకొచ్చినాది. ఇప్పుడు సెప్తావుండా. జాగర్తగా ఇను. నీకొక అన్న వుండాడు. వాడు నీకన్నా రెండు నిముషాలు ముందు పుట్టిండు. మీరిద్దరూ కవలపిల్లలు. వాడు అచ్చు నీలాగే వుంటాడు. ఇప్పుడేడుండడో ఏమో, ఈ ఇసయం మీయమ్మకీ, అవ్వకీ తప్ప ఇంకెవ్వరికీ తెలియదు. జాగరత్త. ఇది నీ మనసులోనే పెట్టుకో. ఎవ్వరితో కూడా అనబాక. పెమాదం. ఈ ఇసయం నేన్నీకు సెప్పినానని ఎవ్వరితో అనబాక" అని చెప్పి ప్రాణాలు వదిలాడు.

అంతా గొల్లుమన్నారు. వీరమ్మ మాత్రం ఒకమూల స్థాణువులా నిలబడిపోయింది.



కర్మకాండలు ముగిశాక ఓ నలభై రోజులకు మంగమ్మ, వీరమ్మ, వాళ్లతో వెళ్లినవాళ్లూ తిరిగివచ్చారు. వస్తూవస్తూ ఎవరూ దిక్కులేని తల్లి పోలమ్మను కూడా వీరంపల్లెకు తీసుకొచ్చింది మంగమ్మ.

తండ్రి తన మరణానికి ముందు వీరమ్మను పిలుచుకుని ఏదో రహస్యం మాట్లాడడం మంగమ్మలో అనుమానం రేకెత్తించింది. "దాంతో మాట్లాడడానికి, అదీ రహస్యంగా, నాయినకి ఏముంటయ్? సెప్తే నా కొడుకు సంగతే సెప్పిండాల" అనుకుంది.

ఈ విషయం గురించి వీరమ్మను కదిపితే జవాబేలేదు. "తాత ఏందో భూముల గురించి చెప్పుండాడమ్మ. నాకేమీ అర్థం కాలా" అని ఆ పిల్ల తెలివిగా తప్పించుకుంది. తల్లి పోలమ్మనడిగితే తనకేమీ తెలియదంది. దాంతో చేసేదేమీ లేక మంగమ్మ వూరకుంది.

తండ్రి మరణంతో మంగమ్మకు ఆస్తి బాగానే కలిసి వచ్చింది. ఆమె అప్పుడప్పుడూ తన సొంతవూరికి వెళ్లి వ్యవహారాలు చూసుకోవాల్సిన పరిస్థితి ఏర్పడ్డది. ప్రతిసారి ఆమె బాషా, శేషగిరి లాంటి వాళ్లతో తన గ్రామం వెళ్లి వ్యవహారాలు చక్కబెట్టుకొచ్చేది. ఒక్కోసారి వీరమ్మ కూడా తల్లితో వెళ్లేది.

తల్లి లేనప్పుడామె తన అమ్మమ్మ పోలమ్మతో ఎక్కువ సమయం గడిపేది. స్నేహితురాలు పుల్లమ్మకు కూడా తాతా చెప్పిన రహస్యం చెప్పి, ఎవరికీ చెప్పవద్దని మాట తీసుకుంది.

మంగమ్మ ఊళ్లో లేనప్పుడు ఒకనాడు రాత్రి భోంచేశాక అమ్మమ్మ పోలమ్మ కాళ్లొత్తుతూ కూచుంది వీరమ్మ. అలా కాళ్లొత్తించుకోవడం ఆవిడకు చాలా బావుంది. ఆమెకు వీరమ్మమీద ప్రేమాభిమానాలు పెల్లుబికాయి.

"ఈ ముసలి పేనానికి ఇంత సేవ

జేస్తుండావు బిడ్డా.. నిన్ను దేవుడు సల్లగా సూడాలి. ఆడ యాభై ఎకరాలు, ఈడ నూరెకరాల పొలం మస్తి. అంతకూ నువ్వే వారసురాలివి. వోడే వుంటే..." అని కంట తడిపెట్టుకుని, ముక్కుచీది మళ్లీ మొదలు పెట్టింది.

"యాడుండడో యాందో! ఎన్ని యతలు బడతా పెరుగుతున్నాడో! వోడు యాడున్న సరే. వోడికి అదే మంచిది. వోడు బద్రంగా ఉండాల. సుకంగా బతకాల. పేనాలతో ఉండాల" అంటూ పిచ్చిదానిలా వదిరింది వయసు మళ్లిన పోలమ్మ.

"ఎవురమ్మమ్మా! ఎవుర్ని గురించి అంటున్నావు?" అంటూ ఆరాలు తీసింది వీరమ్మ.

"యాందోలే తల్లీ, ముసిలిముండని నా మాటలు పట్టించుకోబాక. యే దేవుడు యేం శాపాలు పెట్టిండో, వంశం వంశమే నాశనమైంది. అయినా వోడు బాగుండాలి, వోడింక ఎప్పుడూ ఈడికి రాకూడదు" అని పలవరిస్తూ నిద్రలోకి జారుకుంది.

పోలమ్మ మాటలు విన్న వీరమ్మ మనసులో అనుమానాలతో కూడిన అనేక ఆలోచనలు మొలకెత్తాయి. 'తన తాత మరణిస్తూ చెప్పిన మాటలు నిజమేనన్న మాట! తనకొక అన్న ఉన్నాడన్న విషయం నిజమేనన్నమాట! అమ్మమ్మ మాటలు దీన్ని ధ్రువపరుస్తున్నాయ్. నిజం తెలియాలంటే తన తల్లి మంగమ్మ ద్వారానే తెలియాలి' అనుకుంది. అదే విషయం పుల్లమ్మతో చెప్పింది.

పుల్లమ్మ కాస్త ఆలోచించి "నీ ఉద్దేశం నిజమే ఈరమ్మా. ఈతూరి పోలేరమ్మ తిర్నాల్లలో మీ యమ్మను పోలేరమ్మ తల్లి ముందు పెమానికం సేసి, నిజం సెప్పమంటే పోలా?" అని ఒక అద్భుతమైన ఉచిత సలహా పారేసింది.

దానికితోడు కోదండయ్యను వీరమ్మ కలిసినప్పుడంతా అతను ఆమెను పక్కన కూచోబెట్టుకుని వీర్రాజు, కొమర్రాజుల వీర గాథను ఒక పురాణ కథలాగా వర్ణించి చెప్పేవాడు. 'తన మనసులో ఊహలకు ఒక నిర్దిష్టమైన రూపం ఏర్పరస్తున్నాయి తాత మాటలు' అనుకుంది వీరమ్మ. కాని ఎవరు చరిత్ర చెప్పినా, కథ మంగమ్మ కానుపుకు పుట్టింటికి పోవడం, బంగారమ్మ కొమర్రాజులు తిరిగి వస్తుండగా, సమరయ్య కొడుకు ఆదిత్య అనేవాడు, కిరాయి గూండాలను పంపి కొమర్రాజును నరికించడం వరకూ వచ్చి ఆగిపోయేది.

ఆ తర్వాత కథను మరికాస్త పొడిగిస్తూ వచ్చిన వ్యక్తి పోలమ్మొక్కతే. కాని అందరికీ తెలియని నిజం కొమర్రాజు హత్యకూ, ఆదిత్యకూ ఎలాటి సంబంధం లేదు అని. అది గుమ్మడి దిబ్బవాళ్ల వ్యూహం ప్రకారం జరిగిన హత్య.




**స**మరయ్యకు గుమ్మడిదిబ్బలో వారసులు లేకపోవడంతో అతని ఆస్తిపాస్తులు అల్లుళ్లు అంటే, సమరయ్య అన్నదమ్ముల కూతుళ్ల భర్తలు తామే హక్కుదారులమంటూ యథేచ్ఛగా అనుభవిస్తున్నారు.

సుందరమణి ద్వారా గుమ్మడిదిబ్బ విషయాలు ఆదిలక్ష్మికి తెలుస్తూనే వున్నాయి. తనభర్త తరపు వారసురాలు తనే అనే

విషయం ఆమెకర్థమైంది.

ఆమె రాజరత్నం దంపతులను వెంట తీసుకుని, గుమ్మడిదిబ్బకు వచ్చింది. వాళ్ల సాయంతోనే పెద్ద పంచాయితీ పెట్టించింది. ఆ పంచాయితీకి చుట్టుపక్కల గ్రామాల్లో పెద్ద మనుషులుగా పేరుగాంచిన వాళ్లని కూడా పిలిచారు.

ఊరంతా గుప్పుమంది. ఆదిలక్ష్మి కొడుకు ఆనంద్ హత్యతో సహా వివరాలు అందరికీ తెలిసిపోయాయి.

సమరయ్యతో తన పెళ్లి ఫొటోలు, పిల్లలతో కలిసి దిగిన ఫొటోలు, తాము రాజరత్నం దంపతులతో కలిసి తీయించుకున్న ఫొటోలు, తన వద్దనున్న బ్యాంకు బుక్కులు, తమ పేర భర్త రాసిన ఆస్తి పత్రాలు, తనను వివాహమాడేటప్పుడు తన భర్త రాసిన పత్రాలు అన్నీ పంచాయితీ పెద్దలముందు బైటపెట్టింది ఆదిలక్ష్మి.

ఇప్పుడు ఆదిలక్ష్మికి సపోర్టుగా ఆ ఊళ్లో చాలామంది తయారయినారు. పెద్దలంతా కలిసి సమరయ్య ఆస్తికి హక్కుదారు ఆదిలక్ష్మేనని నిర్ణయించారు.

అప్పుడు సమరయ్య పెద్దల్లుడు లేచాడు. "అత్తా! మామ ఆస్తులకు నువ్వే హక్కుదారువని ఒప్పుకుంటున్నాము. కాని నీ వారసులు ఎవరత్తా? నీకొడుకులిద్దర్నీ కొమ్మ్రరాజు మనుషులు చంపినారని అంతా అనుకుంటున్నారు. పేపరుకు కూడా వేశారు. నీకు వారసులు లేనపుడు ఆస్తి నీదెట్లా అవుతుంది? నీ తర్వాతైనా నీకూతుళ్లదే కదా?" అన్నాడు. అతను అదే గ్రామంలో ఉపాధ్యాయుడిగా పనిచేస్తున్నాడు. పేరు గంగాధరం.

అతని మాటలు విన్న ఆదిలక్ష్మి కోపంతో ఊగిపోయింది.

"ఎవరయ్యా పెద్దమనిషీ నీకు చెప్పింది? ఇద్దరు కుమారుల్నీ కొమ్మ్రరాజు మనుషులు చంపినట్టు ఏ పేపర్లో చదివావు నువ్వు? బాగా చదువుకున్న మనిషిలాగున్నావు. పేపరు చదవడం నేర్చుకో ముందు" అంటూ తన దగ్గరున్న ఒక పేపరు కట్టింగుతీసి పంచాయితి పెద్దల ముందుంచింది.

ఆ పేపర్లో "సరూర్‌నగర్ వాస్తవ్యురాలు, శ్రీమతి ఆదిలక్ష్మిగారి పెద్దకుమారుడు పన్నెండు సంవత్సరాల ఆనంద్ అను సెంట్ జోసెఫ్ కాన్వెంట్ విద్యార్థిని నడిరోడ్డు మీద కొందరు దుండగులు తెగనరికారు. హత్యవెనక పాతకక్షలే కారణాలుగా కనిపిస్తున్నాయ్" అని స్పష్టంగా రాసి ఉంది.

అది చదివిన పంచాయితి పెద్దలకు, ఇతర గ్రామస్తులకు ఆమె చెప్తున్నది నిజమని అర్థమైంది.

"మరైతే ఆ రెండో కొడుకు బతికి ఉన్నట్టయితే అతనెందుకు రాలేదు?" అని ఆ ఉపాధ్యాయుడైన పెద్దమనిషి గంగాధరం ప్రశ్నించాడు.

అందుకు ఆదిలక్ష్మి దృఢంగా సమాధానం చెప్పింది. "అయ్యా! సమరయ్య వంశస్థుల్లో మగ పురుషుడు బతికి మన లేదు. నా మొదటి కుమారుణ్ణి కొమ్మ్రరాజు కత్తి బలి తీసుకుంది. ఇప్పుడు రెండోవాణ్ణి ఇక్కడికి తీసుకురావాలంటే మీరంతా వానికి ముందే గోరీకట్టి పెట్టండి" అంది.

అందరికీ ఆమె మాటల్లో నిజం కనిపించింది. అనేక చర్చల మీదట సమరయ్య ఆస్తి మొత్తాన్ని ఆదిలక్ష్మి హస్తగతం చేశారు. అప్పట్నుంచి ఆమె గుమ్మడిదిబ్బలోనే ఉంటూ, నమ్మకమైనవాళ్ల సాయంతో వ్యవహారాలు నిర్వహించసాగింది.

అయితే దురాశాపరుడైన గంగాధరం ఆదిలక్ష్మిని వదల్లేదు. అతని ఉద్దేశం ప్రకారం ఆ రెండోవాడు కూడా మరణిస్తే ఆస్తిమొత్తం తమ తోడల్లుళ్లు పంచుకోవచ్చు! అందుచేత అతను పాఠశాలకు కూడా

# త్రీడీ థియేటర్!

చతుర ప్రపంచం

కాలిఫోర్నియా రాష్ట్రంలోని ఒక ఊర్లో 'లిబర్టీ సైన్స్ సెంటర్' ఉంది. అందులో మూడువందల సీట్లుగల జోసెఫ్ డి విలియమ్స్ అనే డోమెక్స్ సైన్స్ థియేటర్ ఉంది. ఎనభైఎనిమిది అడుగుల డోమ్ ఉన్న ఇది అమెరికాలోనే అత్యంత పెద్ద ఐమాక్స్ థియేటర్. దీని పరిమాణంలోగల థియేటర్లు దక్షిణకొరియా, ఫ్రాన్స్, స్పెయిన్, కెనడాలోని వేంకోవర్‌లలో మాత్రమే ఉన్నాయి.




ఇలాంటి ప్రత్యేకమైన సినిమా థియేటర్‌లో ప్రేక్షకులు కూర్చునే భాగం వదిలేస్తే మిగిలినదంతా తెరే. సీలింగ్, కుడి ఎడమలు కూడా తెరే! ఇందులో త్రీడైమన్షన్‌లో ప్రదర్శించే సినిమా చూడడానికి ప్రత్యేకంగా కళ్ళజోడు అవసరం లేకుండానే ఆ ఎఫెక్ట్‌తో కనిపిస్తుంది! కారణం రంధ్రాలు గల అల్యూమినియం తెర.

ఈ థియేటర్‌లలో ప్రేక్షకుడి కంటిచూపు వెళ్లేంత మేర స్క్రీన్‌మీద ప్రొజెక్టర్ బొమ్మని ప్రసరిస్తుంది.

1993లో కోటి డాలర్ల ఖర్చుతో అమెరికాలో ఆరంభమైన ఈ సైన్స్ థియేటర్‌లో వివిధ పరిమాణాల్లోని 550 అల్యూమినియం పేనల్స్‌ని బిగించి స్క్రీన్‌ని తయారు చేసారు. తెర మొత్తం వైశాల్యం పదివేల చదరపు అడుగుల పైనే. ప్రొజెక్టర్ బరువు వెయ్యి కిలోలు. నిమిషానికి ఇరవైనాలుగు ఫ్రేముల చొప్పున ఓ పెద్దకారంత ప్రొజెక్టర్ సినిమాని ప్రసారం చేస్తుంది. పది హేనువేల వాట్ల మ్యూజిక్ సిస్టమ్ ఈ థియేటర్‌లో అమర్చారు. ఇందువల్ల ప్రతి చిన్న శబ్దం అత్యంత స్పష్టంగా వినిపిస్తుంది. ఓడలోంచి సముద్రం కనబడే దృశ్యం చూస్తుంటే, ప్రేక్షకులకి తాము ఆ ఓడలో ప్రయాణం చేస్తున్న అనుభూతి కలుగుతుంది. సాధారణంగా గంటలోపే ఐమేక్స్ సినిమాల నిడివి ఉంటుంది. అవన్నీ దాదాపు ప్రకృతి దృశ్యాలతో కూడినవే కావటం విశేషం.

వెళ్లడం మానేసి, కావల్సినంత తీరిక దొరకబుచ్చుకుని, అడపాదడపా 'అత్తా! అత్తా!' అంటూ ఆదిలక్ష్మి ఇంటికి రాకపోకలు సాగించేవాడు. అతని భార్య నాగలక్ష్మి సమరయ్య తమ్ముడికూతురు. ఆమె కూడా వీలైనప్పుడంతా పండో ఫలమో ఏదో ఒకటి పట్టుకొస్తూ 'పెద్దమ్మా పెద్దమ్మా' అంటూ ఆదిలక్ష్మిని చూడరాసాగింది.

"అమ్మే! నాగా! ఆ రెండోకొడుకు విషయం ఎలాగైనా తెలుసుకో. అది మనకు చాలా ముఖ్యం" అని గంగాధరం నాగలక్ష్మికి హితబోధ చేసివున్నాడు.

నాగలక్ష్మి తన భర్తలా ఆశబోతు కాదు. పెదనాన్న, పెద్దమ్మలపై ఆమెకు ప్రేమాభిమానాలున్నాయి.

"అమ్మే! మామకి వారసుడు ఉండాడన్న విషయానికి మనందరం సంతోషపడాల. అయితే అత్త వాడి ప్రాణాలను రక్షింపగోరి, వాడి విషయం దాచిపెడతావుంది. నువ్వు నీ తెలివంతా ఉపయోగించి, ఎలాగైనా ఆ పిల్లోడి విషయం తెలుసుకో. మనమే వాణ్ణి తీసుకొచ్చి వాడికి అండగా నిలబడదాం. వాడి ఆస్తి వాడికే దక్కేటట్టు చూద్దాం. మామ మనకు చేసిన మేలుకు మనం ఈ మాత్రమైనా చెయ్యకపోతే ఎట్లా? " అనేవాడతను.

భర్తమాటలు నిజమేనని నమ్మింది నాగలక్ష్మి. ఆమెకైతే రక్తసంబంధం కాబట్టి సమరయ్య యెడల ప్రేమాభిమానాలు న్నాయి. ప్రస్తుతం ఆదిలక్ష్మి అంటే కూడా ఆమెకు ప్రేమే. ఆమె గంగాధరంలాగా దుర్మార్గురాలు కాదు.

"అత్తా! నీరెండో కొడుకుని పిలిపిచ్చుకో. వాడికి మేమంతా ఉండాం. నీకేం భయం లేదు" అనో,

"అత్తా! వాడెప్పుడొస్తాడు! అసలువాడు ప్రాణాలతో ఉండాడా? వాడింతవరకూ వీరంపల్లె కత్తికి బలిగాకుండా ఉంటాడా? అని ఉళ్లో శానామంది గుసగుసలాడతా ఉండారు" అనో,

"అత్తా! ఇట్లా ఎంతకాలం ఒంటి బతుకు బతకతావు. బిడ్డ దగ్గరలేంది ఆస్తి ఎంత వుండీ ఏం ప్రయోజనం? ఇప్పటికి వాడికి పెళ్లీడు వచ్చిండాది కదా? మరి పెళ్లెప్పుడు జేస్తవు? మనవళ్లనీ, మనవరాళ్లనీ నువ్వె త్తుకుంటే సూడాలనుందత్తా" అంటూ రక రకాలుగా రహస్యం రాబట్టడానికి మార్గాలు వెతుక్కుంది.

అనేకసార్లు ఇటువంటి హితబోధలు నాగలక్ష్మి నోటివెంట విన్నాక ఆదిలక్ష్మి కూడా కాస్త బలహీన పడ్డదనే చెప్పొచ్చు. అదీకాక ఆమెకిప్పుడు బంధువు, ఆత్మీయు రాలు, సహచరురాలు నాగలక్ష్మి అయి కూచుంది. ఎక్కడికైనా రావాలి, పోవాలి అంటే నాగలక్ష్మి ఆమెవెంట ఉండాల్సిందే. నిజానికిప్పుడు సుందరమణికి కూడా అంత విలువలేదనే చెప్పాలి.

అటువంటి బలహీన క్షణాలలో ఒక రోజు "నాగలక్ష్మీ! వాణ్ణి ఇక్కడికి రావద్దని నేనే కట్టడి చేసి ఉన్నాను. వాడు ఎక్కడో పంజాబు దేశంలో పెరిగాడు. చూట్టాని క్కూడా వాడు పంజాబోడిలాగా ఉంటాడు" అన్నది.

ఈ మాటలు నాగలక్ష్మితో చెప్పాక ఆమెకు తన పొరపాటు అర్థమైంది.

ఏం చేస్తోంది తాను! యే ఉద్దేశంతోనైతే బిడ్డకు దూరమై బతుకుతావుందో, ఆ ఉద్దే శాన్ని చేతులారా వమ్ము చేస్తోంది. 'ఇకమీ దట జాగ్రత్తగా ఉండాలి' అనుకుంది.

ఆ విషయం ఆమె సుందరమణితో చెప్పింది. సుందరమణి ఆమెను మెత్తగా చీవాట్లు పెట్టింది.

ఐతే జరగవలసిన ప్రమాదం జరిగిపో యింది. విషయం తెలియగానే గంగాధరం ఊరకే లేడు. వీరంపల్లెలో తనకు బాగా తెలిసిన పెద్దమనిషికి విషయం చేరవే శాడు. అంతేకాదు, తన మనుషుల ద్వారా తనే స్వయంగా అన్వేషణ మొదలుపె ట్టాడు.

★ ★ ★

అవి నూనెగింజల ఉత్పత్తిపై ముమ్మ రంగా పరిశోధనలు జరుపుతున్న రోజులు. దేశంలో అనేకచోట్ల నూనెగింజలు సేక రించి, వాటి పోషక పదార్థాలకు విలువ కట్టి, అధిక పోషకాంశాలు గల గింజలను ఉత్పత్తి చేయడానికి మెరుగైన మార్గాలను సూచించే కేంద్రాలు వెలిశాయి. వాటిలో కలకత్తాలో ఉన్న 'ది నేషనల్ ఫుడ్ గ్రెయి న్ కంపెనీ' పేరెన్నికగన్నది

ఈ కంపెనీవాళ్లు తమ సంస్థలో అనేక మంది యువకులకు శిక్షణ ఇచ్చి, దేశవ్యా ప్తంగా వాళ్లను నూనెగింజల ఉత్పత్తులున్న ప్రదేశాలకు పంపసాగారు. ఈ యువకుల జీతభత్యాలు కూడా చాలా ఆకర్షణీయంగా ఉండడంతో అనేకమంది యువకులు 'ది నేషనల్ ఫుడ్ గ్రెయిన్ కంపెనీ'లో ఉద్యో గాల కోసం ఎగబడ్డారు.

శిక్షణ పొందిన వారిలో కొందరు వివిధ రాష్ట్రాలలో పర్యటించి, ఆయా రాష్ట్రాలలో ఏయే ప్రదేశాల్లో నూనెగింజల ఉత్పత్తి జరుగుతుందో కనుగొని, ఆ గింజలను సేకరిస్తారు. సేకరించిన గింజలపై రకర

కాల ప్రయోగాలు జరుగుతాయి. ఆ తర్వాత గింజలను వర్గీకరిస్తారు. ఈ వర్గీకరణ ఆ గింజలనుండి లభించే నూనె ఉత్పత్తిని బట్టీ, ఆ నూనెలో పోషక పదార్థాల విలువలను బట్టి ఉంటుంది.

ఈ పరిశోధనలకు సంబంధించి నూరుమంది పరిశోధకులు ఆ కంపెనీ నుంచి ఆంధ్రదేశమంతటా పర్యటించసాగారు.

అందులో భాగంగా వీరంపల్లెకు కూడా ఇద్దరు యువకులు వచ్చారు. వీరంపల్లె చుట్టుపక్కల ప్రాంతాల్లో మొక్కజొన్న, పత్తి, వేరుశెనగల్లాంటి పంటలు ఎక్కువగా పండిస్తారు. ఎందుకంటే ఆ ప్రాంతమంతా మెట్ట పైరులు పండేదే. అక్కడక్కడా బోరుబావుల సాయంతో వ్యవసాయం చేసి ఈ పంటలు పండిస్తారు. అక్కడ పంటలు పండేకాలం ఆరు నెలలైతే పొలాలు బీడు పెట్టే కాలం కూడా దాదాపు అంతే ఉంటుంది. ఆ ప్రాంతంలో నేల అంత సారవంతమైంది కాకున్నా పత్తి గింజలనుంచి ఉత్పత్తి అయ్యే నూనె శాతం ఎక్కువగా ఉంటుంది. దాంతో రైతులు ఎక్కువకాలం తమ భూముల్ని బీడు పెట్టకుండా సాగును, రాబడిని మెరుగుపరిచే విధానాలను పెంచడానికి కలకత్తా కంపెనీ ఇద్దరు యువకులను ఆ ప్రాంతానికి పంపింది. వాళ్ళిద్దరూ అక్కడి మట్టిని, గింజలను సేకరించి వాటిని కంపెనీకి పంపి రైతులకు కావలసిన సలహాలివ్వసాగారు. గింజలకు వాళ్ళిచ్చే ధర కూడా సరసంగానే ఉండేది.

వీరంపల్లెలో ఖాళీగా ఉన్న ఇల్లొకటి అద్దెకు తీసుకుని దాన్ని నివాసయోగ్యంగా మార్చుకున్నారు. తమకు వంటతోబాటూ మిగతా పనులు చేసి పెట్టడానికి ఒక మనిషిని కుదుర్చుకున్నారు.

ఆది, రవి అనే ఆ యువకులు మధ్యాహ్నం భోజనం డబ్బాల్లో పెట్టుకుని ఒక వాహనంలో బయల్దేరేవాళ్లు. వాళ్లు తమవెంట తాగడానికి నీళ్ల కూడా సీసాల్లో తీసుకెళ్లేవాళ్లు.

నడవలేని చోటికి వాహనంలో వెళ్లేవాళ్లు. ఒక్కోసారి వాహనం వెళ్లలేని చోట నడక తప్పనిసరి అయ్యేది.

వాళ్లు వీరంపల్లె చుట్టుపక్కల ప్రాంతాల్లో తిరుగుతూ అక్కడి మట్టిని, గింజలను సేకరిస్తూ వాటినిబట్టి అక్కడి రైతులకు తగిన సలహాలిస్తూ పర్యటిస్తున్నారు. గింజల్లో పోషక విలువల శాతం పెంచాలంటే ఎలాంటి ఎరువులు వాడాలో రైతులకు నేర్పిస్తున్నారు. వాళ్ల ఉత్పత్తులు తమ కంపెనీకే అమ్మడానికి ఒడంబడికలు చేసుకుంటున్నారు.

## కొత్తగాలి...

**గంగను తలపై బంధించాడు**
**కేదారనాథుడు ఆనాడు**
**ఆయన భక్తుల్ని ముంచెత్తి**
**పగ తీర్చుకుందా తల్లి ఈనాడు**

– తటవర్తి రామకృష్ణ,
తాళ్లగడ్డ

ఒకరోజు వాళ్లు పుల్లమ్మ ఇంటి చుట్టుపక్కల పర్యటిస్తూ మట్టిని సేకరిస్తున్నారు.

అది మార్చి నెల. రాగల రోజుల్లో నా ప్రతాపం ఇలా ఉంటుందని చెప్పడానికన్నట్టు ఎండ చండప్రచండంగా కాస్తుండడంతో యువకుల వద్దవుండే నీళ్లు ఉదయమే ఖాళీ అయినాయి. మధ్యాహ్నం భోజనం వేళకు, వాళ్లదగ్గర చుక్కనీళ్లు కూడా లేవు. ఆ ప్రాంతాల్లో ఎక్కడా నీటి వసతున్న జాడలేదు.

దూరంగా వాళ్ళకో ఇల్లు కనిపించింది. యువకుల్లో ఒకతను "నేవెళ్ళి నీళ్ల

## జాన్సన్ చతురోక్తులు



డా. సామ్యూల్ జాన్సన్ ఆంగ్ల భాషకు నిఘంటువు తయారు చేసిన మేధావి. షేక్స్పియర్ నాటకాలను దిద్ది, మళ్లీ వాటిని ప్రచురింపజేశాడు. అంతే కాదు, ఆంగ్ల సాహిత్యంలో అగ్రగణ్యుడైన ప్రప్రథమ విమర్శకుడిగా వినుతికెక్కాడు. వివిధ సందర్భాలలో ఆయన నుడివిన చతురోక్తులు కొన్ని...

### ముందుమాట!

తన పుస్తకానికి ముందుమాట రాసివ్వమని ఒక వర్ధమాన యువ రచయిత జాన్సన్‌కు



రాత ప్రతులను పంపించాడు. కొద్ది రోజులయ్యాక తన రచనకు ముందు మాట రాసివ్వడం గురించి ఆ యువ రచయిత జాన్సనుకు మళ్లీ ఒకసారి గుర్తు చేశాడు.

దానికి జాన్సన్, 'నీ రచన చాలా బాగాను, సృజనాత్మకంగాను ఉంది. అయితే దాంతో వచ్చిన చిక్కల్లా బాగా ఉన్న భాగమేదీ సృజనాత్మకంగా లేదు. అలాగే సృజనాత్మకంగా రాసిందంతా ఏమాత్రం బాగా లేదు' అని బదులిచ్చారాయన.

దాంతో కంగుతిన్న ఆ యువరచయిత ఇంకాస్సేపు ఉంటే తన బండారం బయట పడుతుందని పలాయనం చిత్తగించాడు.

తెస్తాను. నువ్విక్కడే కూచో" అని రవితో చెప్పి, నీళ్ళ డబ్బాతో నడుస్తుండగా గుర్రం మీద వేగంగా వెళుతున్న ఓ యువతి అతన్ని దాటుకుంటూ వెళ్లింది. ఆమె అదే ఇంటివేపుకు వెళ్తావుందని అర్థమైంది.

'వెనుకబడిన ఈ ప్రాంతాల్లో గుర్రపు స్వారీ చేసే యువతులుండడం ఎంత ఆశ్చర్యం!' అనుకుంటూ అతను ఆ ఇంటిని సమీపించాడు.

ఇందాక తను చూసిన యువతి తాలూకు గుర్రం ఇంటిముందే కట్టివేసివుంది. దాని ముందు కాస్త పచ్చి గడ్డి వేసి ఉంది. అది తాగడానికి ఒక సుమారైన తొట్టెలో నీళ్ళు కూడా ఉన్నాయి. అది చూశాక అతనికి అక్కడ నీళ్ళు దొరకవచ్చనిపించింది. అతను ఆశగా "ఎవరండీ లోపల? " అంటూ తలుపు తట్టాడు.

లోపల్నించి "ఎవరూ? " అన్న స్త్రీ కంఠం వినిపించింది.

"కాస్త దాహం కావాలండీ" అంటూ అతను సమాధానం చెప్పాడు.

కాసేపటికి తలుపులు తీసుకొని పద్దెనిమిదేళ్ళ యువతి బయటికొచ్చింది. ఆమె చేతిలో ముంత, అందులో నీళ్లు ఉన్నాయి.

"దాహం కావాలండీ! చుట్టుపక్కల ఎక్కడా నీళ్లు దొరకలేదు" అంటూ అతను తన దగ్గరున్న నీళ్ళబుడ్డిని చాచాడు.

"దానికేముంది? ఇదుగో తెచ్చాను, తీసుకోండి" అంటూ ఆమె తనవద్ద ఉన్న ముంతలోని నీళ్లు అందులో పోసింది జాగ్రత్తగా. బాగా దాహంగొనివున్న అతను కాసిన్ని నీళ్ళు వెంటనే తాగి "చాలా తీయగా ఉన్నాయండి. ఈ నీళ్లు మీ కెక్కడివి? దగ్గర్లో ఏదైనా బావి ఉందా? లేదా చెరువేదైనా...? " అని అంటుండగానే ఆమె అందుకొని "అబ్బెబ్బే! అలాంటివేవీ ఇక్కడ లేవండీ. ఇది నీటి వనరులులేని ప్రాంతం. మా తాతలకాలంనాటి బావి ఇంటి వెనక ఉంది. వేసవిలో దాన్లో కూడా నీళ్ళు ఉండవు. అవును మీరీ ప్రాంతపు వాళ్ళలా లేరు.. ఎక్కడివారు? " అంది.

ఆ వచ్చినామె పుల్లమ్మ. వీరమ్మ సహా

యంతో ఈ మధ్యే చదువునేర్చుకుని పుస్తకాలు చదవడం అలవాటు చేసుకున్నందు వల్ల ఆమెభాష కొంత సంస్కారానికి లోనైంది.

"మేం కలకత్తా కంపెనీ నుంచి వచ్చామండీ! అదుగో.. ఆ దూరంగా గంగరావి చెట్టుకింద కూచున్నతను, నేనూ ఇద్దరం ఈ ప్రాంతాల్లో కలిసి పనిచేస్తున్నాం" అన్నాడతను.

"ఓహో! ఏం పని చేస్తున్నారు? "

"మేం నూనె గింజల మీద పరిశోధనలు చేసే వాళ్ళం. మా కంపెనీ కలకత్తాలో ఉంది. ప్రస్తుతం వీరంపల్లెలోనే ఉంటూ ఈ చుట్టుపక్కల ప్రాంతాల్లో తిరుగుతున్నాం" అని అతను అంటుండగా, లోపల్నించి మరొక యువతి వెలుపలికొచ్చి-

"ఏమే పుల్లమ్మా? ఏంది ఇంతసేపు? ఎవురొచ్చారు? " అంది.

పుల్లమ్మ జవాబు చెప్పేలోగా అతనే తను వచ్చిన పని ఆమెకు వివరించాడు.

వెంటనే పుల్లమ్మ "ఈమె వీరమ్మ! మంగమ్మగారమ్మాయి. ఈ ప్రాంతాల్లో మంగమ్మగారిని ఎరుగని వాళ్లుండరు" అంది.

అతను "అవునవును. మేమూ ఆమెను గురించి విన్నాం. కొన్ని విషయాల్లో ఆమె సాయం కూడా మాకు కావాల్సి ఉంది. ఐతే ఆమె ఊళ్ళో లేరని అంటున్నారు" అన్నాడు.

అతను వీరమ్మను నఖశిఖపర్యంతమూ గమనించసాగాడు. ఆమె వేసుకున్న దుస్తులు విచిత్రంగా ఉన్నాయతనికి. అతను తనను పరీక్షగా చూస్తుండడం వీరమ్మ దృష్టిని దాటిపోలేదు.

"మా అమ్మ పనిమీద మా తాతగారి ఊరెళ్ళి ఉన్నారు. రెండు మూడు రోజుల్లో వస్తారు. మీరు వచ్చిన పని అయిపోయింది గా. ఇక మీరు వెళ్ల వచ్చుననుకుంటా" అన్నది కాస్త కటువుగా.

ఆమెను విచిత్రంగా చూసింది పుల్లమ్మ. వీరమ్మ ఎవరితోనైనా కఠినంగా మాట్లాడడం ఇంత వరకూ ఆమె చూడలేదు.

అతను నవ్వుతూ "వెళతామండీ! మీతో మాట్లాడుతుంటే కడుపునిండుతూనే ఉంది. ఐనా భోంచేయాలి గదా. అవతల రవి నా కోసం కాచుకుని ఉంటాడు" అంటూ వెనక్కి తిరిగాడు.

"ఏంది వీరూ? ఎవరో ప్రయాణికుణ్ణి అట్లా కసురుకున్నావు? " అంది పుల్లమ్మ. ఆమె మాటల్లో నిష్ఠూరం ధ్వనించింది.

"అతన్ని కసురుకుంటే నీకెందుకమ్మా నొప్పి? అట్లా మింగేసేటట్టు చూస్తావుంటే కసురుకోవద్దా? " అన్నది వీరమ్మ.

తనతో కటువుగా మాట్లాడిన ఆ యువతి రూపం ఆ యువకుడి మనసులో ముద్రించుకుపోయింది. విలక్షణమైన ఆమె వస్త్రధారణ అతనికి విచిత్రంగా అనిపించసాగింది. 'ఈ మారుమూల ప్రాంతాల పల్లెల్లో కూడా ఇటువంటి అందగత్తెలుంటారా? చామనఛాయగా ఉన్నా ఆమెలో ఎంత ఆకర్షణ!" అనుకున్నాడు.

వీరమ్మ అతనితో అలా ప్రవర్తించడం పుల్లమ్మకు ఇంచుక కినుక కలుగజేసింది. 'వీరమ్మ కలిగినవాళ్లపిల్ల అందుకే ఆ పొగరు' అని మనసులో అనుకుంది.

అప్పటికలా అనిపించినా వీరమ్మకు అతను మాటిమాటికీ గుర్తురాసాగాడు. 'చూట్టానికి అతను హుందాగా, అందంగా ఉన్నాడు. ఏ వూరో, ఏ కులమో ఏమో? అయినా వాటన్నింటితో నాకేమి పని? ' అనుకుంది.

రెండు మూడుసార్లు పుల్లమ్మ అతని ప్రస్తావన తెచ్చినా, ఆమె ఆ విషయం మాట్లాడడం తనకిష్టం లేనట్టే సంభాషణ తుంచేసేది.

ఆ తర్వాత చాలా రోజుల వరకు ఆ

యువకునికి ఆమె తారసపడలేదు. అతను కావాలని ప్రతిరోజూ మధ్యాహ్నం నీళ్ళ కోసం పుల్లమ్మ ఇంటికి వెళుతుండేవాడు. తన స్నేహితుడు, ఆదే ప్రాంతంలో తిరగ డానికి ఆసక్తి చూపడం తమవద్ద తాగడా నికి నీరున్నా "అలా వెళ్లొస్తానోయ్" అని చెప్పి వెళ్తుండడం రవిలో అనుమానాలు రేకెత్తించాయి. అది మొదలు అతను స్నేహితుణ్ణి అవకాశం దొరికినపుడంతా ఆటపట్టించడం మొదలుపెట్టాడు.

మూడ్రోజుల తర్వాత మంగమ్మ వీరంపల్లె తిరిగొచ్చింది. ఈసారి పుట్టి నింటి వారి పొలాల రాబడి నుంచి వచ్చిన ఆదాయం కొన్ని వేల రూపాయలు తీసు కొచ్చి సమీప గ్రామీణ బ్యాంకులో జమచే సింది. ఈ పనులన్నింటికి ఆమె ఎవరైనా ఇద్దరు నమ్మకమైన మనుషుల్ని తోడుతీసు కొనే వెళుతూంటుంది.

'ఎప్పటికైనా వాడు తనకి కనిపిస్తాడా? తనదెంత పాపపు బతుకు! కన్నబిడ్డకి దూరమై బతుకుతా ఉంది. ఇది ఏ దేవుడి శాపమో? కొంతలో కొంత నయంగా తన కూతురైనా తన దగ్గరుంది. కాని ఈ మాదిరి ఎంతకాలం నడుస్తుంది. అది ఆడ పిల్ల. ఒకయ్య ఇంటికి పోవాల్సిందే కదా. పిల్లకి పెళ్ళిచేసి, అల్లుణ్ణి ఇంటికే తెచ్చు కుంటే సరిపోద్ది' అని ఆలోచనలు చేస్తుం డేది.

పుల్లమ్మకు మాత్రం నీళ్లకోసం వచ్చిన ఆ యువకుని రూపం మనసులో ముద్రించు కుపోయింది. ఆమె అంతవరకు తన జీవి తంలో, అట్లా ప్యాంటు, షర్టూ వేసుకుని అందంగా ఉండే యువకుడ్ని చూడలేదు. ఆ తర్వాత రెండు మూడు సార్లు అతన్తో మాట్లాడింది. ఒకసారి పేరడిగింది. అతను తన పేరు 'ఆది' అని చెప్పాడు. అప్పటినుంచీ ఆమె అతన్ని 'ఆది, ఆది' అని తలచుకోసాగింది. ఈ విషయం ఆమె వీరమ్మతో అన్నది. 'ఆది! అదేం పేరు? తలాతోకా లేకుండా. ఆదినారాయణో, లేకుంటే ఆదితో మొదలయ్యే ఇంకో పేరో అయివుంటుంది' అనుకుంది వీరమ్మ.

పుల్లమ్మద్వారా అతని పేరు 'ఆది' అని తెలుసుకున్న వీరమ్మ కూడా అదే పేరు గుర్తు చేసుకోసాగింది. ఐనా పైకిమాత్రం "అతగాడి పేరు ఏదైతే మనకెందుకు? అతని పేరడిగే అవసరం నీకేమొచ్చింది?" అని మెత్తగా చీవాట్లు పెట్టింది పుల్ల మ్మను.

అందుకు పుల్లమ్మ ఉడుక్కుంది. 'ఏమీ.. తను పేరడిగితే వీరమ్మకేంది? తను అందుకు ముందుగానే ఆమెనడగాలా? ఇక మీదట దీనికేమీ చెప్పను' అని తీర్మా నించుకుంది.

★ ★ ★

ఒకనాడు మంగమ్మ లోగిల్లో కుర్చీ వేసు క్కూచుని ఎవరో గొల్లవాళ్లకు పంచాయితీ చేస్తూ, తీర్పు చెపుతుండగా ఆది అక్కడికొ చ్చాడు. 'తను కలకత్తా కంపెనీ నుంచి వచ్చాననీ అనుమతిస్తే కాసేపు మాట్లాడ తాను' అని అన్నాడు. మంగమ్మ అతన్ని కాసేపు కూచోవలసిందిగా కోరింది. అతను అక్కడే మరో కుర్చీలో కూచుని మంగమ్మ పంచాయతీ చేస్తున్న విధానం గమనించాడు. అతనికి ఆమె మాటల్లో ఆజ్ఞాపన, ఆకర్షణ రెండూ కనిపించాయి. ఆమె చాకచక్యంగా చెప్పిన ఆ తీర్పు అతన్ని అబ్బురపరచింది. తను వచ్చిన పని కూడా మర్చిపోయి కూర్చుండిపో యాడు.

పంచాయితీ ముగిసింది. మంగమ్మ అతని వంక తిరిగి "బాబూ! మీరెక్కడి వారు? ఏం పనిమీద వచ్చారు?" అంది.

ఆది వినయంగా "అమ్మా! నేను కల కత్తా వాళ్ల ఆయిల్ కంపెనీలో పనిచేస్తు న్నాను. మీకు తెలిసే వుంటుంది. ఈ

ప్రాంతాల్లో పండే గింజలను సేకరించడం, వాటిలో పోషక పదార్థాల విలువలను అంచనా వేయడం మా పని. ఇక్కడ దొరికే పత్తి, వేరుశనక్కాయలూ కాక కొన్ని రకాల శనగలు కూడా మీరు సాగు చేస్తున్నారని గ్రామస్థులంటున్నారు"

"అవును. అది నిజమే" కాస్త గర్వం ధ్వనించగా చెప్పింది మంగమ్మ.

"దయచేసి మీ వద్ద పండే ఆ ప్రత్యేకమైన గింజల నమూనాలు నాకిప్పించండి. వాటికి మీరే ఏకైక సాగుబడిదారు కావడం నా అదృష్టం"

అతని మాటలు విని సంతోషించిన మంగమ్మ అతనికి కాఫీ తెప్పించింది.

ఆది కూచొని ఉండగానే ఎక్కడికో వెళ్లిన వీరమ్మ వచ్చింది. గుర్రాన్ని దాని స్థానంలో కట్టేసి, లోపలికొచ్చి అతన్ని చూసి ఆశ్చర్యపోయింది.

'ఓహో ఇంటిదాకా వచ్చేశాడా? కోటలో పాగా వేసేశాడన్నమాట' అనుకుంటూ, ఖాళీగా వున్న ఒక కుర్చీలో కూచుంది.

"ఏమ్మో? ఇది ఇను. కొన్ని రకాల శనగలూ, పత్తీ మనదగ్గరే దొరుకుతాయని పల్లోల్లంతా ఈ యబ్బాయికి చెప్పంపుండారు తెలుసా? " అన్నది మంగమ్మ.

"చెప్పంపడమేందమ్మా? మనమేగదా వాటిని సాగుచేస్తావుంటాం" అన్నది వీరమ్మ.

"అంతేకాదు వీరమ్మగారూ! మీకు సాగుబడిలో కొన్ని కొత్త పద్ధతులు చెప్పాలి. అధిక సాగుబడి ఎట్లా వస్తుందో మీరు తెలుసుకుంటే మంచిది" అన్నాడు కళ్లల్లో మెరుపులు మెరుస్తుండగా.

"అవన్నీ అమ్మకి చెప్పండి" అంటూ అతని వంక నిర్లక్ష్యంగా ఒక చూపు చూసి లేచింది వీరమ్మ.

అతని పెదవుల మీద ఆనందంతో కూడిన దరహాసం ఒకటి వెల్లివిరిసింది. వాళ్లకింతకుముందే పరిచయం ఉందని మంగమ్మకు తెలియకపోవడంతో పరిచయాలు మొదలుపెట్టింది.

"అమ్మా! నేనిదివరకే అమ్మాయి గార్నొకసారి చూశాను. ఒకటి రెండు మాటలు మాట్లాడాను కూడా. ఆ కాస్త పరిచయంలోనే ఆమె మీ కుమార్తె అన్న విషయం తెలిసింది" అని వినయంగా సమాధానం చెప్పాడు.

బాగా చదువుకున్న వ్యక్తిలా కనిపిస్తున్న అతను అంత వినయంగా తనతో మాట్లాడుతుండడం మంగమ్మకు ముచ్చట గొలిపింది. ఆమె పనివాళ్లను కేకేసి కొన్ని విత్తనాలు తెప్పించి విడివిడిగా పొట్లాలు కట్టించి అతనికిప్పించింది.

## కొత్తగాలి...

**అమెరికాలో టోర్నడో**
**జపాన్‌లో భూకంపం**
**ఇండియాలో అవినీతి**
**సర్వసాధారణం!**

– జి. రమణారావు,
తాడిపత్రి

అవన్నీ తీసుకున్న ఆది "చాలా సంతోషం అమ్మా. మీరు చేసిన సహాయాన్ని నేనెప్పటికీ మరువను. ఎందుకంటే ఈ రకం విత్తనాలు మేమెంత ప్రయత్నించినా ఇంతవరకూ దొరకలేదు. ఈవాళ అవి మీదగ్గర దొరకడం మా అదృష్టం" అంటూ అక్కడే నిలుచుని ఉన్న వీరమ్మవైపొకసారి చూసి, లేచి నిలుచున్నాడు.

మంగమ్మ "అదేంటి బాబూ! అట్టాగంటావు? ఈయేళప్పుడు మా ఇంటికొచ్చిన వాల్లెవ్వరూ భోంచేయకుండా ఎల్లరయ్యా.

మీ స్నేహితుడెవరో ఉన్నాడన్నావుగదా? మన పనివాళ్లతో అతన్ని పిలిపించు. ఇద్దరూ భోంచేసి వెళ్దురుగాని" అన్నది.

అందుకతను లోలోన సంతోషించినా, ఆ వేళ మాత్రం అక్కడ భోంచేయదలచు కోలేదు. ఎందుకంటే రవిని తనప్పుడు పిలి పించలేదు. తనిక్కడికి రావడం రవికి అస్సలు తెలియదు. ఒకవేళ రవి అక్కడికి రావడం సంభవిస్తే, తను దొరికిపోతాడు. వీరమ్మ దర్శనం అయింది చాలు. ఇక తనక్కడ భోంచేస్తే యేం, చెయ్యకపో తేయేం?

ఇవన్నీ ఆలోచించిన అతను "క్షమిం చాలి అమ్మగారూ! నాకొక ముఖ్యమైన పని వుంది. మరొకసారి ఇద్దరం తప్పక వస్తాము" అని చెప్పి బైటికి నడిచాడు.

'ఇతనెవరో, ఏవూరో, ఏ కులమో? పిల్లోడు చిదిమి దీపం పెట్టే మాదిరిగా ఉండాడు. వీరమ్మకు ఇట్లాంటి మొగుడొస్తే ఎంత బాగుంటుంది?' అని ఆలోచించింది మంగమ్మ.

అతనలా భోంచేయకుండా వెళ్లడం వీర మ్మకు కాస్త బాధనిపించింది. మరోపక్క ఉడుకుమోత్తనం ఆ బాధతో పోటీపడ్డది.

'ఆc! అతను భోంచేయకపోతే తన కేంటి? చెయ్యనీ చెయ్యకపోనీ... తనేం లెక్కచెయ్యదు. ఏంటో అంత బెట్టు?' అనుకుంది.

మరోపక్క మనసు 'అయ్యో! అతను భోంచేసుంటే బాగుణ్ణేమో. పాపం. ఎండలో వెళ్లిపోయాడు' అనుకుంటూ అత నిమీద జాలిపడడం మొదలెట్టింది.

అట్లా ధన, రుణాత్మక ఆలోచనల మధ్య నలుగుతున్న ఆమెను చూసి మంగమ్మ "ఏందమ్మో అట్లా నిలబడ్డావు? దిగువ చేని కాడ ఆ పంపు రిపేర్ అయిందా?" అంది.

అప్పుడు గానీ వీరమ్మకు తను వెళ్లిన పనేమైందో అమ్మకు చెప్పాలన్న విషయం గుర్తురాలేదు.

★ ★ ★

ఆ ప్రదేశమంటే వీరమ్మకు చాలా ఇష్టం. చుట్టూ గుబురుగా ఉన్న చెట్లూ, ఒక పక్క నీటిగుంట, ఇవతల ఒక పెద్ద గుట్ట, గుట్టకొక పక్క 'వీర్రాజు పూర్వీకుల' సమాధులు, వీర్రాజు, కొమర్రాజుల సమా ధులు ఉన్నాయి. ఆ కుటుంబపు స్త్రీల సమాధులు కూడా వారి వారి భర్త సమా ధుల పక్కనే ఉన్నాయి.

ఆ గుట్టమీద ఒంటరిగా కూచోడానికల వాటుపడ్డది వీరమ్మ. అక్కడ కూచుంటే, తన తాత, నాన్నల ఆత్మలు తనతో మాట్లాడినట్టుంటుందామెకు. తన తాత వీర్రాజును నడివీధిలో వేపచెట్టుకు ఉరితీ యించాడట ఆ గుమ్మడిదిబ్బ సమరయ్య. ఆ శవం మూడురోజులు ఎవ్వరూ తాకడా నికి వీల్లేదనీ, ఎవరైనా తన మాట మీరితే వాళ్ల గతి కూడా ఇంతేనని, రచ్చబండ మీద నిలబడి ఎలుగెత్తి చాటాడట.

ఇక తన తండ్రి కొమర్రాజు సమరయ్య సంతానాన్ని వెదికించి చంపి, వంశం పరువు నిలబెట్టినాడని వీర్రాజు పేరూ, వీరంపల్లెపేరూ వీరోచితంగా నిలబెట్టినా డనీ అందరూ చెపుతుంటే, తన రోమాలు నిక్కబొడుచుకుంటాయి. అటువంటి వీరుల వంశంలో పుట్టింది తను. కుటుంబ ప్రతిష్ట కోసం, తమ గ్రామం కోసం ప్రాణాలర్పించిన వారికి, తన పెద్ద లకు తను ఏం చేయగలదు? వంశ ప్రతిష్ట నిలబెట్టడంలో తనవంతు బాధ్యత ఏమి?

తన తండ్రి కొమర్రాజు, సమరయ్య సంతానంలో ఒకర్ని మాత్రమే చంపగలిగా డని, తన అవ్వ బంగారమ్మ పట్టుదల వలన రెండోవాణ్ణి వదిలేశాడని, తెలు స్తోంది. ఆడంగులకేం తెలుస్తయి రాజకీ యాలు? అయినా ఆ రెండోవాడెక్కడు





న్నాడు?

తన తండ్రీ తాతల ఆత్మలు ప్రతీకారం కోరుకుంటున్నట్టు, ఆ ప్రతీకారం కోసం తనని దీనంగా అడుగుతున్నట్టు ఆమెకు తోచేది.

ఇలా ఆమె ఆ గుట్టమీద కూచుని తన తాతను, తండ్రిని గుర్తు చేసుకుంటూ, రక రకాల అనుభూతులకు, అవస్థలకు లోనవు తుండేది. 'ఏడీ తన అన్న? ఎక్కడున్నాడు వాడు? తనెవరి కొడుకో, ఎవరికి మన వడో, వాడికి తెలుసా? ఇలా తన పూర్వీ కులు ప్రతీకారాన్ని కోరుకుంటున్నారని వాడికి తోచిందా? వచ్చి ఇలా ఈ గుట్ట మీద కూచుని, ఆ సమాధులు చెప్పే కథలు వింటే కదా? ఆడది తనేం చేయ గలదు? ఏదైనా మొగోడే చెయ్యాలి' అను కుంది. అలాంటి ఆలోచనలు వస్తే ఆమె హృదయం అటువంటి వాటికి వెంటనే ఎదురు తిరిగేది.

'తను మొగోడిలాగా పెరిగింది. మొగోడు నేర్చుకునే వీర విద్యలన్నీ నేర్చు కుంది. తనెందుకు ఏమైనా చెయ్యలేదు?' అని తన్ను తాను ప్రశ్నించుకునేది. అలాంటి ఆలోచనలతో ఊరట కలిగినప్పు డామె హృదయంలో వీరోచితమైన ఊహలు ఉప్పెనలెత్తేవి. ప్రతీకార జ్వాలలు ఎగసిపడేవి. ఎటూ తోచని ఉద్వేగంతో, ఆ రెండు సమాధులను తన కన్నీటితో తడి పేసేది.

ఆమెలో చెలరేగుతున్న ఈ ఆలోచనలు మంగమ్మకేమీ తెలియదు. ఎందుకంటే ఇన్నాళ్లూ తను కూతురికి చెప్పకుండా తనలో దాచుకున్న రహస్యాలు, తన తల్లి దండ్రుల ద్వారా బైట పడినాయని ఆమెకు తెలియదు గనక.

అదే నెలలో సరిగ్గా అమావాస్యనాడు, పోలమ్మ పరమపదించింది. చనిపోయే నాడు ఉదయం, తన కుమార్తె మంగమ్మ తోనూ, మనవరాలు వీరమ్మతోనూ, విడివి డిగా మాట్లాడింది. మంగమ్మకు తన మన వణ్ణి, అంటే మంగమ్మ కొడుకుని ఎలాగైనా వెతికించమని కోరింది.

వీరమ్మతో తన అన్నను వెతకాలనీ, సమరయ్య రెండో కొడుకుని ఎలాగైనా వెతికి తుదముట్టించి, తన తండ్రితాతల చావులకు ప్రతీకారం చేయడానికి శక్తివం చన లేకుండా కృషిచేయాలనీ కోరింది. అంతేకాదు, ఆ ప్రతీకారం చూడకుండానే తను కళ్లు మూయడం వలన, తనకు మన శ్శాంతి లేకుండా పోతున్నదని చింతించింది కూడా.

★ ★ ★

ప్రస్తుతం గుట్టమీద కూచున్న వీరమ్మకు అవ్వమాటలు, తండ్రీతాతల హత్యల వివ రాలు అన్నీ గుర్తొస్తున్నాయి.

ఒకరోజు అలా వీరమ్మ తనలో తనే ఖేదపడుతూ తననెవరో సమీపిస్తున్న విషయం ఆ వ్యక్తి దగ్గరగా వచ్చాక గాని, గుర్తించలేదు. ఆ వచ్చినతను ఆది.

"ఏమిటి వీరమ్మగారూ? చల్లగాలి తింటున్నారా?" అంటూ ఎండుటాకులపై కూర్చున్నాడు ఆది.

వీరమ్మక్కూడా అతన్ని కాస్త ఉడికించా లనిపించింది.

"మరేం తినమంటారు ఆదిగారూ! ఇక్కడ గాలీ, మీరూ తప్ప మరేం లేక పోయె!" అన్నది.

"గడుసువారే సుమా! నన్ను మటుకూ తినకండి. మా అమ్మకు నేనొక్కడే కొడు కును"

"సరిసరి, ఆవాళ భోంచేయమంటే బెట్టుగా వెళ్లిపోయారేంటండీ?"

ఇంకా గడుసుగా 'కతికితే అతకదు' అని అందామనుకున్నాడు. కానీ అంత చనువు మంచిది కాదు, చాలా అసహ్యంగా ఉంటుంది అనిపించి నవ్వుకున్నాడు.

"భోంచేయలేదేమంటే నవ్వుతారేం దండీ?"

"మీలాగా గాలి భోంచేద్దామని"

"ఇక్కడ నేను భోంచేస్తున్నది గాలికాదు. అదుగో చూశారా. అక్కడ... గుట్ట దిగువన... మా తాతగారి... మా నాన్నగారి సమాధులున్నాయి. వాటితో మాట్లాడుతున్నాను"

"ఇటీవల మీ అమ్మమ్మగారు చనిపోయారని విన్నాను"

"అవును. మీరు విన్నది నిజమే. కాకుంటే ఆమెను ఆమె కోరిక ప్రకారం, వాళ్లూరు తీసుకెళ్లి మా తాతయ్య సమాధి పక్కనే సమాధి చేశాము"

"ఓహో! నేను బహుశా రేపు మీ ఇంటికొస్తాననుకుంటున్నాను మీ అమ్మగారిని విచారించడానికి"

అందుకు వీరమ్మ ఏమీ మాట్లాడలేదు.

ఆమె మౌనంగా ఉండడంతో, అతనూ కాసేపు మౌనంగా ఉండిపోయాడు. కాని ఇది మౌనంగా ఉండవలసిన సమయం కాదని, ఇద్దరి మనసులు హెచ్చరిస్తూనే ఉన్నాయి.

"మీరేమీ అనుకోనంటే నాదొక సందేహం వీరమ్మగారూ!"

ఏమిటన్నట్టు చూసింది వీరమ్మ.

"మీరీ గుర్రపుస్వారీ, ఇతర యుద్ధ విద్యలు ఎక్కడ నేర్చుకున్నారు? మీ పల్లెలో ఉన్నవాళ్లలా కాక, మెరుగైన భాష ఎలా మాట్లాడగలుగుతున్నారు? అసలు మీరెంత వరకు చదువుకున్నారు?"

దీర్ఘంగా నిట్టూర్చింది వీరమ్మ

"చాలా ప్రశ్నలే కురిపించారు. మా అమ్మమ్మగారి పల్లెలో, బోయినదండనాయకుల వారి వద్ద నేను విద్యాభ్యాసం చేశాను. బోయిన వారిదీ, వారి భార్యదీ తెనాలి. వారు చాలా మంచి భాష మాట్లాడుతారు. నేను బోయినవారి భార్యను 'చిన్నమ్మా' అని పిలుస్తూ, వారింటనే ఎక్కువ సమయం గడిపేదాన్ని. బోయిన దండనాయకుల వారి కొడుకు అశోకన్నయ్య నాకు బాగా ఇంగ్లీషు నేర్పారు. నాతో ఎన్నో పుస్తకాలు చదివించారు. నేను ఆంగ్లంలో, తెలుగులో ఎన్నో పుస్తకాలు చదివాను. మా ఇంటికి ఇంగ్లీషు, తెలుగు పేపర్లు రెండూ వస్తాయి. వీరంపల్లెలో ఉన్న ప్రాథమిక పాఠశాలకు వెళ్లి నేను పిల్లలకు ఆంగ్ల బోధన చేస్తాను. అంతే కాని, నేనొక్కనాడు బడికి పోయింది లేదు. పరీక్షలు రాసిందీ లేదు. నాకేమీ డిగ్రీలు లేవు" అన్నది వీరమ్మ.

"చాలా మంది పట్టాలు పుచ్చుకున్నవారి కన్నా మీరెంతో నయం. భాష అన్నది పుస్తకపఠనం ద్వారానే బాగా నేర్చుకోగలం. మీరు చేసిన ఈ కృషికి నాకు మిమ్మల్ని మెచ్చుకోవాలనుంది"

"మరి మెచ్చుకోండి. ఇంకా ఆలస్యం ఎందుకు?" కొంటెగా జవాబిచ్చిందామె.

"వద్దులెండి. నా మెచ్చుకునే పద్ధతి వేరుగా ఉంటుంది. మీరు భయపడగలరు!"

"నేనంత తొందరగా భయపడే దాన్ని కాదు. అయినా మీరు మెచ్చుకునే ఆ భయంకరమైన పద్ధతేమిటో కాస్త చెబుదురూ?"

## కొత్తగాలి...

**ఆకలి రుచి ఎరగదు**
**నిద్ర సుఖం ఎరగదు**
**శృంగారం సిగ్గెరగదు**

*– డి. చందూవంశీ,*
కర్నూలు

"సమయం వచ్చినప్పుడు దేన్నయినా మెచ్చుకుని చూపిస్తాలెండి. నేనిక వస్తాను. అవతల మా రవి కాచుకొని ఉంటాడు"

"శుభస్య శీఘ్రం! రవి అంటే అంత భయమా? " అన్నది వెనకనుంచి.

'తను వెళ్లడం ఆమెకి ఇష్టం లేదు కాబోలు!' అనుకుంటూనే వెళ్లాడు ఆదిత్య.

అతని 'రాక'లో ఉన్న ఆనందం అతని పోకతో ఎవరో తుడిచేసినట్లయిందామెకు.

'బాహ్యరూపాలు చాలా మోసకరం అమ్మాయి. అది చూసి బోల్తా పడకూడదు' అన్న బోయినవారి మాటలు గుర్తొచ్చాయామెకు. ఈ ఆదిని చూసినప్పుడంతా ఆ మాటలే గుర్తొస్తాయి వీరమ్మకు.

ఒక్కోసారి వీరమ్మకు 'జీవితం అంటే ఇంతేనా? ' అనిపిస్తుంది. పదీ పన్నెండేళ్ల వరకూ ఆడామగా తేడా లేకుండా పెరుగుతుంది ఆడపిల్ల. తర్వాత మూల కూచోగానే అసలు కథ మొదలవుతుంది. గౌన్ల స్థానంలో పావడా జాకెట్టూ, వాటికి తోడు ఓణీ ఒకటి- ఇలా వస్త్రధారణ మారుతుంది. దాంతోపాటు ఎన్నో ఆంక్షలు! మగపిల్లలతో ఆడరాదు. వాళ్లతో మాట్లాడరాదు. మగవాళ్లెవరైనా ఇంటికొస్తే వెనక గదుల్లో ఉండిపోవాలి. చేసే పనుల్లో కూడా తేడా. అందరూ ప్రతిక్షణమూ 'ఆడపిల్లవు కావటే? ' అని గుర్తుచేస్తూ ఉండడం, ఆపైన ఎవరితోనూ మాట్లాడకూడదు, ఎక్కడా తిరక్కూడదు లాంటి రూల్సు పెట్టడం, ష్! అబ్బా! ఏంటీ జీవితం? ఊపిరాడని జీవితం?

అట్లా తీసుకుంటే తన జీవితం ఎంతో మేలు. బోయిన దండనాయక దంపతులు, వాళ్లబ్బాయి అశోకన్నయ్య తన జీవితాన్ని మార్చేశారు. తన అమ్మలాంటి గొప్పతల్లి కడుపున పుట్టడం తను చేసుకున్న అదృష్టం.

బాల్యం పూర్తి కాకముందే పెళ్లీ పిల్లలు. 'పెళ్లి' అంటే అదొక కొత్త ప్రపంచం. భర్తలు ఎన్నో విధాలుగా ఉంటారు. తన స్నేహితురాళ్ల భర్తలనే తీసుకుంటే, సుహాసిని భర్త తాగొచ్చి కొడతాడు. రమణమ్మ భర్త దాన్ని పుట్టింటికే వెళ్లనీడు. అంకమ్మకు అత్త, ఆడబిడ్డల ఆరళ్లు ఎక్కువ. ఇంకొకడికి భార్యమీద అనుమానం.. ఎవ్వరితోనూ మాట్లాడనియ్యడు. వరసగా ఏటేటా పుట్టుకొచ్చే పిల్లలు! వాళ్ల 'గీ' అనే రొదలు. ఛ! ఛ! ఏం జీవితాలు ఈ ఆడపిల్లలవి?

తన జీవితం అట్లా కాకూడదు. తను ఏదైనా సాధించాలి. పుట్టినందుకు తన జీవితానికేదైనా సార్థకత ఉండాలి. తన జీవిత ధ్యేయం ఏమిటి? తనేం సాధించబోతున్నది? అదేమిటో తనకింతవరకూ తెలియదు. అది తనకు తెలిసేదెలా? ఈ 'ఆది' అనే అబ్బాయిని చూసినప్పుడంతా, తనకేందో అవుతున్నది. కొంపదీసి, తన తన్ని ప్రేమించడం లేదు కదా? తనూ ఒక మామూలు అమ్మాయిలాగా అతన్ని పెళ్లి చేసుకుని, అతనికి పెళ్లాంగా బతుకుతూ, పిల్లల్ని కంటూ, జీవించాలనుకుంటూ ఉన్నదా? తన మొఖం మీద అదే రాసి పెట్టి ఉందా?

ఛీ ఛీ, కాదు. అలా కావడానికి వీల్లేదు.

**కొత్తగాలి...** 

**భావనా సంద్రం మీద**
**'కొత్తగాలులు'...**
**అవినీతి మీద**
**ఉరుములు! మెరుపులు!!**

*– మంద రిత్విక్,*
హైదరాబాద్




రాణి రుద్రమదేవి, ఝాన్సీ మహారాణిలను తను ఆదర్శంగా తీసుకోవాలి. వీర్రాజు తాత తన జీవితాన్ని, ప్రాణాలను వీరం పల్లె గ్రామానికి ధారపోశాడు. పాలెగాళ్ల పరిపాలనను ఎదిరించి నిలిచాడు. తన తండ్రి కొమర్రాజు అదే బాటలో నడిచాడు. తన తండ్రి హత్యకు ప్రతీకారాన్నే తన జీవిత ధ్యేయంగా మలచుకున్నాడు. వీరమరణం పొందాడు. నాన్న బతికుంటే ఆ సమరయ్య రెండో కొడుకుని కూడా వదిలేవాడు కాదు. నాయనమ్మ పోరువల్ల కాని, లేకుంటె అప్పుడే... తన తాత, తండ్రీ ఆ పాలెగాళ్ల దుర్మార్గపు పరిపాలనను అంతమొందించడానికై వాళ్ల వంశ నిర్మూలనకై తమ ప్రాణాలు పణంగా పెట్టారు. చివరికది ఒక వంశపారంపర్యపు కక్షగా మిగిలింది.

'ఆడదైనా తనలో కూడా వీర్రాజుతాత వీర రక్తం ప్రవహిస్తూ ఉంది. తను ఆ దారి విడిచి వేరే మార్గంలో పోయి, మామూలు ఆడబతుకు బతకడానికి వీల్లేదు, వీల్లేదు' అని గట్టిగా అనుకుంది. అటువంటి ఆలోచన ఆమెలో రాగానే ఆది గురించి మనసులో మొగ్గలు తొడుగుతున్న ప్రేమచిగుళ్లు, ఆ ప్రతీకారజ్వాల కింద వసివాడిపోయాయి.

★ ★ ★

'కుర్రోడు ముత్యంలాగా ఉండాడు. ఏయమ్మగన్న బిడ్డో! ఏ ఊరివాడో? కులమేదో? ఈ దఫా వస్తే కనుక్కోవాలి' అనుకుంది మంగమ్మ.

వాళ్ల ఆహ్వానం మేరకు రవితో కలిసి భోజనానికొచ్చాడు ఆది. ఆవాళ పుల్లమ్మ కూడా అక్కడే ఉంది. వీరమ్మ వాళ్లకి కొసరి కొసరి వడ్డించడం చూసి ఆశ్చర్యపోయింది పుల్లమ్మ. 'అమ్మో! ఈ ఈరమ్మ మనసులో ఎంత దాసుకుందీ! పైకి మటుకు కోపం నటిస్తావుంది. కానీ, ఎంత కథ నడుసుద్దో తనూ సూత్తాది. ఆ ఆది పక్కన కూసున్న పిల్లోడు ఎంతబాగుండాడు? ఆది కన్నా అతనే బాగుండాడు. పేరు రవి అట. పొలంలో ఆ గన్నేరు చెట్టుకాడ కూసోని, తనటు పోతావుంటే మిర్రిమిర్రి సూత్తావుంటాడు. అదుగో, కూర కావాలంట. తను వొడ్డిస్తేమేలు' అనుకుంటూ పుల్లమ్మ రవి దగ్గరగా పోయి, అతనికేం కావాలో కనుక్కుని, కొసరి కొసరి వడ్డించసాగింది.

'ఆదిగాడికి ఈ వీరమ్మంటే ఏదో వున్నట్టుంది. చాలాసార్లు ఆమెకోసం వెళ్లడం తను కనిపెట్టాడు. ఆమె స్నేహితురాలు ఎంత బాగుంది? ముగ్ధ మోహన! పేరు పుల్లమ్మట! పేరు బాగా లేకుంటే ఏం? మనిషి విరిసిన కమలంలా వుంది. తనను చూసి అలా కళ్లు వాలుస్తుందెందుకు?' అనుకుంటున్నాడు రవి.

వీరమ్మ ఆదితో చనువుగా మసలడం, చమత్కారాలాడడం మంగమ్మ దృష్టిని దాటిపోలేదు. ఆమె "నాయనలారా! మీ వూళ్లేవి? మిమ్మల్ని కన్నోళ్లెవురు? అడగతావున్నందుకేం అనుకోబాకండి. మీరేం కులస్తులు? మా ఊళ్లో ఈడేరిన ఆడపిల్లలు శానామందుండారు. మిమ్మల్ని ఒకింటివాళ్లుగా చేద్దామని అడిగినా" అన్నది.

అందుకు రవి "అమ్మా! మాది గుంటూరు. బ్రాడీపేటలో ఉంటాం. మేం నాయుళ్లం. మా నాన్న ఆదికేశవుల్నాయుడు. అమ్మ మహాలక్ష్మమ్మ. విజయవాడ అమ్మాయితో నా పెళ్ళి నిశ్చయం చేయాలని చూస్తున్నారు" అన్నాడు.

పుల్లమ్మ తలవాల్చుకుంది. ఆమె ముఖం పాలిపోయింది.

"అమ్మా! మీది, మాది ఒకేకులం. నేను అనాథను. నాకింకా పెళ్లి కాలేదు" అన్నాడు ఆది.

"బాగుబాగు" అన్నది మంగమ్మ. ఆమె

మనసులో అస్పష్టమైన ఊహలకు చిగుళ్లొచ్చి, లతలు సాగి, అందమైన పందిరి తయారైంది. ఇదంతా లోపల్నించి వింటున్నది వీరమ్మ. అతని సమాధానానికి ఆమె మనసెందుకో పులకించింది.

'ఆ మాట చెబుతూ నాకళ్లల్లోకి చూశాడెందుకో! పెళ్లి నిశ్చయం కాలేదన్నప్పుడు తలొంచుకున్నాడు. బుగ్గలు ఎర్రగా అయినాయి. ఆడ పిల్లలాగా ఆ సిగ్గేమిటో అసయ్యంగా' అనుకుంది.




ఆవాళ వీరమ్మకు, ఆదికి పెళ్లి. వీరంపల్లెలో పండుగ వాతావరణం నెలకొంది.

"అబ్బాయికి ఎవరూ లేరంట. ఐతే మన కులమేనట" అని పల్లెలో చాలామంది గుసగుసలుపోయారు.

ఆ పెళ్లికి మంగమ్మ పుట్టినూరు వాళ్లు వూరువూరే తరలి వచ్చారు. బోయిన దండనాయకుడి కుటుంబం వాళ్లు నాలుగు రోజుల ముందే వచ్చి మంగమ్మకు సహాయం చేశారు.

ఇద్దరు బురఖా ధరించిన స్త్రీలు, మరొక ఇద్దరు పురుషులతో కలిసి ఆ పెళ్లికొచ్చారు. పురుషుల వస్త్రధారణ భాషలను బట్టి, స్త్రీల బురఖాలనుబట్టీ, వాళ్లు ముసల్మానులని తెలుస్తూనే వుంది. తమది హైదరాబాదనీ తాము చిన్నప్పట్నించీ ఆది వాళ్లమ్మకు స్నేహితులే కాక, ఆత్మీయులమనీ చెప్పారు వాళ్లు.

వాళ్లు పెళ్లికూతురి చేతులకు ఆరేసి బంగారు గాజులు, మెడలో చంద్రహారం, నడుముకి వడ్డాణం పెట్టారు. "అమ్మాయ్. ఈ నగలు మేం పెట్టామనుకునేవు, ఇవన్నీ మీ అత్తగారు లక్ష్మమ్మవి. మా దగ్గర జాగ్రత్త పెట్టేరు. పెళ్లప్పుడు తన కోడలికి పెట్టాలని కోరేరు. అమ్మాయ్! నీకు తెలియదుగాని, మీ అత్తగారు శానా పెద్ద ఆస్తిగల్లోల్లు. దేవుడనుకూలిస్తే ఆదికి బోలెడంత ఆస్తి రాబోతోంది. ఈ విషయం ఎవరికీ చెప్పకేం? " అన్నారు.

ఆ నగలు చూసి మంగమ్మ చాలా సంతోషపడ్డది. 'తనూహించినట్టు ఆది అనాథైనా బికారి కాదు' అనుకుని గర్వపడ్డది.

వెళుతూ వెళుతూ వాళ్ళు ఒకపెద్ద సూట్‌కేసు ఆదికిచ్చి వెళ్లారు. అందులో ఏముందో ఏమో!

★ ★ ★

ఆవాల్టికి వీరమ్మ పెళ్లై పది రోజులు. వధూవరులిద్దరూ బృందావనంలాంటి ప్రదేశాల్లో ప్రేమయాత్రలు చేశాక తిరుమల, శ్రీశైలంలాంటి పుణ్యక్షేత్రాలు తిరిగి చాలా అలసిపోయి వచ్చారు.

కూతురు అల్లుడూ క్షేమంగా తిరిగొచ్చినందుకు మంగమ్మ సంతోషించింది.

"అత్తగారింట్లో అల్లెం తినకుండానే పోయినావు అల్లుడూ! ఇంక నాల్రోజులు కోడికూరే" అన్నది అల్లుడితో.

ఆవాళ వీరమ్మను కలవడానికెవరో ఒక వ్యక్తి వచ్చాడు. అతను కొన్ని కాగితాలు పట్టుకుని వచ్చాడు. తను వీరమ్మనే కలవాలనీ, ఆ కాగితాలు ఆమెకే ఇవ్వాలనీ అన్నాడు. వీరమ్మ వచ్చినాక ఆ కాగితాలు ఆమెకే ఇచ్చి వెళ్ళిపోయాడు.

"ఏంటే అవీ? " అని ప్రశ్నించిన మంగమ్మకు, "దండనాయకుడు పంపిన కొన్ని

పొలాల తాలూకు కాగితాలు" అని చెప్పింది వీరమ్మ.

★ ★ ★

ఆ విశాలమైన పడక గదిలో ఆది తన భార్య వీరమ్మ కోసం ఎదురు చూస్తు న్నాడు.

ఆ పదిరోజులు తనను క్షణం కూడా ఎడబాయకుండా అనురాగసాగరంలో ముంచెత్తిన వీరమ్మ వీరంపల్లెకు రాగానే, ఈవాళ ఈ ఎడబాటు విధించి దూరం దూరం తిరుగుతూ ఉంది. ఆమె ఎడ బాటు తను భరించలేకుండా ఉన్నాడు.

'తనెంత అదృష్టవంతుడు! మొదటిచూ పులోనే వీరమ్మ పాదాలవద్ద తన హృద యాన్ని పారేసుకున్నాడు. ఆమెనే భార్యగా పొందాలని అనుకున్నాడు. తన కోరిక నెరవేరింది. ఎప్పుడూ పొగరుగా, గడు సుగా మాట్లాడే వీరమ్మలో అంతగొప్ప ప్రేమిక, అద్భుతమైన అనురాగాన్ని చూప గల పడతి ఉంటుందని తను అనుకోనైనా లేదు' అనుకుంటూ చేతిలో ఏదో పత్రిక తిరగేస్తూ కాలం గడుపుతున్నాడు. ఎక్క డేది అలికిడైనా వీరమ్మొచ్చిందని ఉలిక్కిప డుతున్నాడు. ఆమె కాదని తెలిసి హతాశు డవుతున్నాడు. పొద్దుకుంగి, దీపాలు పెట్టే వేళకు, వీరమ్మ పాలగ్లాసుతో ఆ గదిలో అడుగెట్టింది.

మల్లెల వాసన గుబాళించింది. ఆ పరి మళం ఆది గుండెలమీద గులాబిరేకులు విరజిమ్మింది.

"ఇప్పుడా అమ్మగారికి దయకలిగింది? " అన్న ఆది మాటలకు ఆమె ఏమీ సమా ధానం చెప్పలేదు. ఎటువంటి భావమూ లేని ముఖంతో దగ్గరగా వచ్చి పాలగ్లాసు అందించింది.

"ఏమిటి వీరా? అలా వున్నావు? " కాస్త ఆందోళనగా అడిగాడు ఆది.

ఆమె లేని నవ్వు ముఖం మీదికి తెచ్చు కుంటూ "ఏం ఉంది, ఏమీ లేదు" అన్నది.

## లండన్‌ను విడిచిపెడతావా?

లండన్ అంటే జాన్సన్‌కు చాలా ప్రేమ. ఒకసారి అతడిని అభిమానించే ఒక యువతి త్వరలోనే తాను ఆ మహానగరాన్ని విడిచి పెట్టి, సమీపంలోని మరో చిన్న 'ద్వీపం'లో స్థిర నివాసం ఉండబోతున్నట్లు జాన్సన్‌తో చెప్పింది.

ఆ యువతి అతి చిన్నవయసులోనే నూట ఇరవై కేజీలకు పైబడిన భారీ



కాయాన్ని తన సొంతం చేసుకుంది. ఎవరికైనా ఆమెను చూసిన వెంటనే 'ఎంతటి స్థూలకాయురాలో' అనిపించక తప్పదు.

ఆమెను ఒకసారి పైనుంచి కిందకి ఎగాదిగా చూసిన జాన్సన్ 'అలాగే మేడమ్. ఆ ద్వీపంలో మీరు పట్టేటట్లుంటే నిరభ్యంతరంగా లండన్‌ను వదలిపెట్టి అక్కడికే వెళ్లి వుండవచ్చు. ఒకవేళ అందులో మీరు పట్టినా వేరేవాళ్లకేమాత్రం చోటులేకుండా చేస్తారేమో? ఎందుకంటే దాని నిండుగా మీరే ఉంటారు కదా!' అని జవాబిచ్చాడు జాన్సన్ నవ్వుతూ.

ఆ పెద్దాయన తనమీద వేసిన చతురోక్తికి ఆమె కూడా హాయిగా మనసారా నవ్వు కుంది.

అతనా పాలగ్లాసు పక్కన పెట్టి ఆమెను కౌగిట్లో బంధించి, ముద్దులతో ముంచె త్తాడు. రోజంతా అతన్ని వేధించిన విరహ తాపం చల్లారకుండా పదిరెట్లు ఇనుమడిం చింది.

ఆమె అలాగే గంటు పెట్టుకున్న

ముఖంతో "ముందు పాలు తాగి..." అంటుండగా అతను ఆమెను మరి మాట్లా డనివ్వలేదు.

తన విరహతాపం చల్లారాక "ఇప్పుడు చెప్పు దేవీ. పాలు తాగాలా?" అన్నాడు.

నిజానికతను ఒక విధమైన అసంతృ ప్తితో ఉన్నాడు. పడకలో వీరమ్మ ప్రతిచ ర్యలు రెచ్చిపోయే విధంగా ఉండేవి. అలాంటిదివ్వాళ ఆమెలో ఎటువంటి స్పందనలేక, అచేతనంగా ఉండిపోయింది.

ఆమె ఆ పాలగ్లాసు అతనికందించింది. "ఏం జరిగింది వీరా? నువ్వు రోజులా లేవు. ఏమిటోగా ఉన్నావు. దయచేసి ఏం జరిగిందో చెప్పు. ఏమీ దాచకు" అంటూ పాలు తాగసాగాడు.

అతనా పాలగ్లాసు నోటికానించుకోగానే ఆమె కుడిచెయ్యి ఒక్కసారి పైకిలేచి, మళ్ళీ కిందికి వాలింది. అది ఒక అసంకల్పిత చర్యలా జరిగింది. ఆమె తల వాల్చుకుని "అంతా చెబుతాను.. ముందు నా ప్రశ్న లకి జవాబులు చెప్పండి" అంది.

అతను నిర్ఘాంతపోతూ "అలాగే" అన్నాడు.

★ ★ ★

అత్తవారింట గడిపిన మొదటిరోజే అత్త గారు అలంకరించిన శోభనపు గదిలో అల్లుడు అసువులుబాయడం, అక్కడి వారి నందరినీ అచ్చెరువులో పడేసింది.

ఊరివారి విషయం అటుంచి మంగమ్మ కూడా అంతులేని విషాదంలో, ఆశ్చర్యపుశో కంలో మునిగిపోయింది. 'ముత్యంలాంటి పిల్లవాడు, చదువుకున్నవాడు, మీదు మిక్కిలి ఇల్లరికం ఉండిపోవడానికి ఒప్పుకు న్నవాడు, ఈడూ జోడూ బాగకుదిరిందని ఊరూవాడాచే పొగడ్తలందుకున్నవాడు.. పెళ్లయిన పదకొండోరోజే చనిపోవడం ఏమిటి? అంతా తన కర్మకాకుంటే.. జీవి తమంతా ఏడవాలని తనమొఖాన రాసి పెట్టివుంటే..' ఇలా రకరకాలుగా చింతిస్తూ మంచం పట్టింది మంగమ్మ.

మంగమ్మ దూరపు బంధువులు కొందరు, ఆమెకు అన్నల వరసైనవారు, ఆమె సొంత ఊరు నుంచి విచారింపుకు వచ్చారు. వాళ్లంతా కుటుంబాలతో, బండ్లలో తరలిరావడం మంగమ్మను ఆశ్చ ర్యపరచింది. వచ్చిన రెండోనాడు ఆ పెద్ద మనుషులు ముగ్గురూ తీరుబాటుగా మంగమ్మతో సంభాషణ ప్రారంభించారు.

"అమ్మే! మంగా! దినదినానికీ నువ్విట్టా మంచం పట్టిపోతే ఎట్టా? పిల్లనేదొకటి వుందిగదా. ఆ సంగతి మర్చిపోబాక. నువ్వే ఇట్టుంటే ఇంక మొగున్ని పోగొట్టు కున్నది అదెట్టాగుంటది? దయిర్నం తెచ్చుకో. ఏదో ఒకటి ఆలోచన చెయ్యి"

"నీ మేలుగోరి చెప్తా వుండాము. ఓపి నంత ఆస్తి. ఏంజేస్తవు! వారసులు లేకుంటే వారూ వీరూ వొచ్చి మీద బడతా రన్న సాటువు ఇన్లేదా? ఈరమ్మకి ఇరవై ఏల్లుకూడా లేవు. దానికి మారు మనువు చెయ్యాలి. చానా అవుసరము. అప్పుడు నీ యాస్తికి రచ్చన దొరుకుద్ది. పిల్ల జీవితం బాగుపడుతాది.

ఏమీ అనుకోబాక. ఒకమాట సెపతా వుండా ఈరమ్మ పుట్టిన్నాడే మా వోడికి సేసుకుందామని మీ ఒదిన పట్టుబట్టినాది. ఏందో ఇట్టాగయింది. మా వోడు పద కొండో తరగతి పాసైండు. బోల్డంత ఆస్తి! వోడిప్పటికీ ఈరమ్మని సేసుకుంటాననే అంటావుండాడు. ఎనిక్కిపోబాక" అని రక రకాలుగా వీరమ్మకు మళ్లీ పెళ్లిచేయాలనే ఉద్బోధ చేశారు. చెప్పగా చెప్పగా, మంగ మ్మకు వాళ్ల మాటలు నిజమనిపించి, ఆలో చనలో పడ్డది.

"అమ్మే... ఈరమ్మా? మొదటితూరి నీ అభిప్రాయం పకారం మనువు చేసినా ఈతూరి నాయభిప్రాయం ప్రకారం మను

వుజేస్తా" అన్నది.

వీరమ్మ ఏమీ మాట్లాడలేదు.

ఈ విషయం గ్రామంలో గుప్పుమంది. ప్రజలు రకరకాలుగా మాట్లాడడం మొదలుపెట్టారు. "యేందీ? రెండో పెల్లా? మనింటా వంటా ఉందా?"

"పిల్లకి ఇరవై కూడా లేకపాయె. ఇంక దాని బతుకు తెగటారేదెట్టా?"

"పెల్లయ్యి పది దినాలైంది. అదింకా కన్నెరికం కూడా జరిపించుకోని వుండదు. ఆరోజేగదా పిల్లోడు పోయింది"

"నీ తెలివి తెల్లారినట్టే ఉండాది. పద్దినాలూ వాల్లు అన్నివూల్లూ తిరిగొచ్చినారు. తెలుసా?"

"అయితే ఏందంట? పద్దినాలగ్గాను మొత్తం జీవితాన్నే బుగ్గిపాలు చేస్కోవాలా ఆ పిల్ల?" అని రకరకాలుగా మాట్లాడుకున్నారు.

వీరమ్మకు మళ్లీ పెళ్లి నిశ్చయమైంది. ఎవ్వరేం మాట్లాడినా ఆమె నుండి ఉలుకూ పలుకూ లేదు.

పెళ్లికొడుకు, ఇంకా కొందరు బంధువులతో తరలివచ్చాడు. మరునాడు రాత్రి ఏడు గంటలకు మంచి ముహూర్తం ఉన్నదన్నాడు స్వామి.

శుభలేఖలు అచ్చు వేయించలేదు కాని మంగళమేళాలు మాత్రం పెట్టించారు. పెళ్లికొడుకుని తీసుకొనివచ్చి పీటలమీద కూచోబెట్టారు. ఇంకాసేపటికి సర్వాలంకార భూషితమైన పెళ్లికూతురు తరలివచ్చింది.

"కూచోమ్మా" అన్నాడు స్వామి.

ఆమె కూచోలేదు.

"అమ్మాయ్! ఆసీనురాలివికామ్మా" అన్నాడాయన, మళ్లీ కాస్త వ్యంగ్యం ధ్వనించేలా.

ఆమె అప్పటికీ కూచోలేదు.

పెళ్లికొడుకు తలెత్తి ఆమె వంక చూశాడు. స్వామి కూడా అనుమానంగా చూశాడు. అటుగా వచ్చి నిలుచున్న మంగమ్మ జరుగుతున్న ఈ తంతంతా చూస్తూనే ఉంది.

"కూచోవేమే ఈరమ్మా?" అని గదిమింది మంగమ్మ.

"నాకీ పెళ్లి వద్దమ్మా" నింపాదిగా చెప్పింది వీరమ్మ.

"యేందేందీ" అందరూ నిర్ఘాంతపో

## తేడా తెల్సిందా?

కొద్దిమంది ప్రచురణకర్తలు 1746లో జాన్సన్‌ను కలిసి, ఇంగ్లిష్ భాషపై ఒక సమగ్రమైన నిఘంటువును రూపొందించాల్సిందిగా



కోరారు. ఆ మేరకు జాన్సన్ ఆ పని చేసేందుకుగాను 1500 గినియాల(బంగారునాణేల)ను పారితోషికంగా తీసుకునేందుకు అంగీకరిస్తూ ఒప్పందం కుదుర్చుకున్నారు.

'ఫ్రెంచ్‌భాషలో నిఘంటు తయారీకి 40 మంది మేధావులు నలభైఏళ్లపాటు శ్రమించారు. మరి మీరొక్కరే ఎంతకాలంలో ఈ పని పూర్తి చేసిపెడతారు?' అని ప్రచురణకర్తల్లో ఒకరైన విలియం స్ట్రాహాన్ అడిగాడు.

దానికి 'ఇది ఒక బ్రిటిష్‌వాడు ఎంతమంది ఫ్రెంచ్‌వాళ్లతో సమానమనే నిష్పత్తిపైన ఆధారపడుతుంది. నలభైమంది ఫ్రెంచివారు నలభై ఏళ్లపాటు కష్టించి తమభాషలో నిఘంటును సిద్ధం చేశారంటే 1600 ఏళ్లపాటు వారి పని చేశారన్నమాట. నా వరకైతే నేనొక్కడినే మూడేళ్లలో నిఘంటువును తయారు చేయగలను' అని నవ్వుతూ చెప్పారాయన.

ఆ జవాబు విని అవాక్కవడం ప్రచురణకర్తవంతయింది. చెప్పినట్లుగానే జాన్సన్ మూడేళ్లలో ఆ నిఘంటువును తయారు చేసివ్వకపోయినా ఎనిమిదేళ్లకాలంలో పని పూర్తి చేశారు.

## తారుమారు!

రచయితగా పేరు పొందాలని ఎంతగానో శ్రమిస్తున్న జాన్ గే అనే యువకుడు 'బెగ్గర్స్ ఒపెరా' అనే నాటకాన్ని రాశాడు. దాన్ని తీసుకుని లండన్‌లోని థియేటర్ యజమానులందరి వద్దకూ చెప్పులరిగేలా తిరిగాడు. ఎవ్వరూ



ఆ నాటక ప్రదర్శనకు అంగీకరించలేదు.

పట్టువదలని విక్రమార్కుడిలా ఆ రచయిత ప్రయత్నించడంతో చివరికి రిచ్ అనే థియేటర్ యజమాని దాన్ని ప్రదర్శించాడు. దాంతో యువ రచయితకు బాగా డబ్బు, పేరుప్రఖ్యాతులూ వచ్చాయి.

మొత్తం ఈ వ్యవహారంపై తన స్పందన ఏమిటని స్నేహితులు ఒకసారి జాన్సన్‌ను అడిగారు.

దానికాయన 'ఏముందీ.. దీనివల్ల గే కాస్తా రిచ్ అయ్యాడు. మరోవైపు ఈ దెబ్బతో రిచ్ కాస్తా గే అయ్యాడు. వారిద్దరి స్థితులు తారుమారయ్యాయంతే! ' అన్నారు స్నేహితులను నవ్విస్తూ.

యారు.

"అవును. నేను గర్భవతిని" అంది వీరమ్మ.

అంతే ఎవ్వరూ ఏమీ మాట్లాడలేదు.

★ ★ ★

ఆ విధంగా వీరమ్మ తన పెళ్లి తనే కాదనుకుని, కడుపులో బిడ్డని పెంచి పెద్దచేయసాగింది. రెండో పెళ్లినాటికి ఆమెకు కన్నెరికం జరిగిందా లేదా? అన్న గ్రామస్థుల సందేహానికి ఈ విధంగా సమాధానం దొరికింది.

ఖిన్నురాలైన మంగమ్మ వీరమ్మను రకరకాలుగా ఆడిపోసుకుంది. "గర్భవతివైతే ఏం చేటొచ్చిందే, నాకు చెపితే ఏదో ఒకటి చేసి…"

"కడుపు పోగొట్టుండేదాన్నంటావు. కాని నాకా ఉద్దేశం లేదు. ఈ బిడ్డను కని, సాకాలని వుంది" అని దృఢంగా సమాధానం చెప్పింది వీరమ్మ.

అంత కచ్చితంగా కూతురు సమాధానం చెబుతూండడంతో మంగమ్మ మరి మాట్లాడలేకపోయింది.

★ ★ ★

యథాప్రకారం గుర్రమెక్కి తండ్రీ తాత సమాధుల వద్దనున్న ఆ గట్టు మీద కూచుంది వీరమ్మ.

'తాతా! నాన్నా! నా జీవితం ఎట్లా అయ్యిందో చూశారా? ఇంత పాపిష్టి మన వరాలిని, దుర్మార్గురాలు, ద్రోహి అయిన కూతుర్ని కన్నందుకు విచారిస్తున్నారా? ' అని ఆమె మనసులో అనుకొంటుండగానే ఆమె కళ్లు వర్షించడం మొదలై, చుట్టూ వున్న ప్రపంచం మసకబారిపోయింది. ఎలాగో తన్ను తాను సముదాయించుకొని కళ్లు తుడుచుకుంది.

అంత ఉత్తమ పురుషుడు, ప్రేమమూర్తి తనకు భర్తగా దొరకడం తన అదృష్టం కాదా? తను ఆడదైనా ఎవరికీ తీసిపోననే విషయం రుజువు చేసుకోవాలని స్త్రీత్వానికే అవమానం తెచ్చింది. తను చేసిన ఘాతుకపు పని ఎవరైనా చేస్తారా? చేయగలరా? 'నువ్వు చేసిన పనిని నేను మనసార క్షమిస్తున్నాను వీరా' అన్నాడు ఆది. 'తుదిశ్వాస వరకూ నేను నిన్నే ప్రేమిస్తాను' అని కూడా అన్నాడు.

ఆ విషయాలన్నీ గుర్తుకు రాగానే ఆమెలో అణగారివున్న శోకం సముద్రంలా పొంగింది. తను భర్తతో గడిపిన ఆ చివరి రాత్రి మరోసారి కళ్లముందు సినిమా రీలు

లాగా పునరావృతమైంది.

ఆవాళ ఎవరో గుమ్మడిదిబ్బ నుంచి తనను కలవడానికొచ్చారు. తను కొత్త పెళ్లి కూతురనీ, కలవను వీలుకాదనీ చెప్పి పంపినా అతను బోయినవారి మనిషిననీ, కచ్చితంగా కలవాలని పట్టుబట్టాడు. చివరికి తను లోగిలిలోకి వెళ్లక తప్పలేదు.

అతను ఏవో కొన్ని కాగితాలిచ్చి, చిన్న గొంతుతో 'ఎవరికీ చూపకమ్మా' అని చెప్పి వెనుదిరిగి చూడకుండా నిష్క్రమించాడు.

గుమ్మడిదిబ్బ వాసి గంగాధరం అనే ఆయన పంపిన కాగితాలు, ఉత్తరం, రెండుమూడు ఫొటోలు అందులో ఉన్నాయి.

అవి తన తదిలోకి పట్టుకెళ్లి, ఎవరూ చూడకుండా చదివిందా ఉత్తరాన్ని.

"అమ్మాయి వీరమ్మా!

నీవు పెళ్లి చేసుకున్న వ్యక్తి ఎవరో తెలుసా? మీ ఆగర్భశత్రువు సమరయ్యకు, ఆదిలక్ష్మి అనే రెండో భార్య ద్వారా పుట్టిన కొడుకు. ఆదిలక్ష్మికి ఆనంద్, ఆదిత్య అని ఇద్దరు కొడుకులు. ఆనందును మీ నాన్న కొమర్రాజు మట్టుబెట్టాడు. ఈ రెండో కొడుకు కత్తివాత బడకుండా ఆదిలక్ష్మి జాగ్రత్తపడి, వాణ్ణి పంజాబులో అమృత్ సర్ పక్కనే ఒక పల్లెలో నివసించే స్నేహితుల వద్ద పెంచింది. పిల్లలు లేని వాళ్లు ఆదిత్యను 'ఆదిత్య సింగ్' అని పిలుచుకుంటూ చాలా జాగ్రత్తగా పెంచారు. అతను యువకుడైన తర్వాత తల్లిని చూట్టానికొచ్చాడు. తల్లి అతన్ని మరెప్పుడూ రావద్దని కట్టడి చేసింది. అతను కలకత్తాకు చెందిన ఒక ఆయిల్ సీడ్ కంపెనీలో ఉద్యోగం చేస్తూ నిన్ను కలిశాడు. అతనే ఆదిత్య. ఆ తర్వాతి కథ నీకు తెలిసిందే.

మీ తాత వీర్రాజును నడివీధిలో ఉరితీయించిన దుర్మార్గుడు సమరయ్యే. అతని మనుషులు మీ నాన్నను కూడా వదల్లేదు. మీ అమ్మ సీమంతానికెళ్లి తిరిగి వస్తుండగా ఊరి పొలిమేరల్లోనే కిరాయి హంతకులతో, కన్నతల్లి బంగారమ్మ ముందే నరికి చంపించారు సమరయ్య మనుషులు.

వీర్రాజు, కొమర్రాజుల దేహాల్లో ప్రవహించిన వీరరక్తం నీలో లేదా వీరమ్మా? నీలో ప్రతీకార వాంఛ లేదా? సమాధుల్లో ఆక్రోశిస్తున్న మీ తాత, మీ నాన్నలు ప్రతీకారం కోసం ఎదురు చూస్తున్నారు. వెంటనే వారి ఆత్మలు శాంతింపజేయి. నీ స్వార్థం చంపుకో. ప్రేమమైకం నుంచి మేలుకో" అంటూ ఇంకా ఎన్నెన్నో విధాలుగా వీరమ్మలో నిద్రపోతున్న ప్రతీకార జ్వాలలు నాలుకలు చాచేలా ఉందా ఉత్తరం.

అది చదివిన తనలో ఆవేశం కట్టలు తెంచుకుంది. 'అతను ఆది కాదు. సమరయ్య కొడుకు ఆదిత్య. ఎంత మోసం! పేరు, వూరు మార్చి, ఆగర్భశత్రువు కూతుర్నే పెళ్లి చేసుకున్నాడా? తను చూస్తూ ఉండాలా? లేదు. తనలా ఉండటం ఎన్నటికీ జరగదు'

ఎదురుగా అలమారాలో ఉన్న క్రిమిసంహారక మందొకటి ఆమె దృష్టినాకర్షించింది. ఎవ్వరూ చూడకుండా దాన్ని తగినంత మోతాదులో ఒక గ్లాసు పాలల్లో కలుపుకుని గదిలో ప్రవేశించింది.

విరహంతో వేగిపోతున్న ఆదిత్య ఉరఫ్ ఆది కాలుగాలిన పిల్లిలా గదంతా పచార్లు చేస్తున్నాడు. వీరమ్మ లోపలికడుగెట్టగానే పట్టుచీర పరపరమంది. ఆమె జడలో మల్లెల ఘుమఘుమ గదంతా వ్యాపించి, అతని ఎదలో గులాబీలు పూయించింది.

అతను ఆమెను పొదివి పట్టుకుని, మంచంమీద కూచోబెట్టాడు. పాలగ్లాసు పక్కన పెట్టి, ఆమెతో సంభాషణ మొదలు



పెట్టాడు.

"పాలుతాగండి" అందామె.

"చిత్తందేవీ" అంటూ అతను, గటగటా ఆ పాలు తాగేశాడు.

"నేనడగబోయే ప్రశ్నలకు మీరు సమాధానం చెప్పాలి" అంది.

అతను ఆశ్చర్యపోతూ "అడుగు" అన్నాడు.

"నిజం చెప్పండి.. మీరెవరు? "

"ఎవరైతేనేం? ఒక మనిషిని.. నిన్ను మనసారా ప్రేమించిన మనిషిని"

"ఒప్పుకొంటాను. అసలు మీరెవరు? మీ పేరు ఆదిత్యసింగ్ కదూ? "

అతని భ్రుకుటి ముడిపడ్డది.

"చాలా విషయాలు సేకరించావు వీరా. ఇంకా చెపుతా విను. నేను మీ ఆగర్భ శత్రువు, సమరయ్యగారబ్బాయిని. మా అమ్మ పేరు ఆదిలక్ష్మి. ఆవాళ మన పెళ్లి నాడు ఇద్దరు స్త్రీలు బురఖాలు ధరించి వచ్చారుకదా? గుర్తుందా? ఒకరు మా అమ్మ ఆదిలక్ష్మమ్మ. రెండో ఆవిడ ఆమె స్నేహితురాలు. ఆవాళ వాళ్లు నాకిచ్చిన బరువైన ఆ సూట్‌కేస్ నిండా డబ్బుంది. దాని తాళం నీ బట్టల షెల్ఫులోనే ఉంచాను"

"ఎంత మోసం చేశారు నన్ను? "

"వీరా! నేను నిన్ను మనసారా ప్రేమించాను. నేను నీ శత్రుగణంలో వాణ్ణే. నేనెవ్వరినైతేయేం వీరా? నీ పగను, నా ప్రేమను తక్కెడలో తూస్తే నా ప్రేమ బరువు ముందు నీ శత్రుత్వం వీగిపోతుంది. ప్రేమ దేన్నయినా లొంగదీసుకోగలదు. ఏ విజయమైనా సాధించగలదు. ఈ పగలవల్లే తండ్రిని పోగొట్టుకున్నాను.



తల్లికి దూరమైనాను. ఆమెకు ఆసరాగా ఉండవలసిన తరుణంలో దొంగలా దూరంగా బతుకుతున్నాను"

"అందుకు బాధ్యులం మేమేనా? "

"అలా అని నేననడం లేదు వీరా! నీలా, నాలా, ఎందరో, ఎందరెందరో అదృష్ట హీనులున్నారు. గుమ్మడిదిబ్బ, వీరంపల్లె రెండూ అటువంటి అభాగ్యులతో నిండి వున్నాయి. రెండు గ్రామాలవాళ్లూ ఇందుకు బాధ్యులే. మా నాన్న, మీ తాత శత్రుత్వాల మధ్య అందరూ నలిగినవారే. అందుకే వీరా.. మన పెళ్లితో ఈ తరతరాల శత్రుత్వానికి అంతం పలకాలి"

"అట్లా జరుగుతుందా, అది నిజమేనా? "

"ఎందుకు జరగదు వీరా? నిన్ను మా అమ్మ దగ్గరకి తీసుకెళ్లి - చూడమ్మా! నీకు వీరంపల్లె నుంచి కోడల్ని తెచ్చాను. ఈమె ఎవరో కాదు. కొమర్రాజు గారమ్మాయే - అని గర్వంగా చెప్పదలచుకున్నాను"

"దాంతో ఏమవుతుంది ఆదీ? నన్ను అక్కడికక్కడే నరుకుతారు"

"పొరబడినావు వీరా! అలా ఎన్నటికీ జరగదు. ఈ శత్రుత్వాలకీ, వంశపారంపర్య తగాదాలకు, హత్యలకు తెరపడ్తుంది. పడాలి. మన పెళ్లి అందుకు తొలి అంకం" అన్నాడు ఆది విశ్వాసంతో.

"అది నావల్ల కాదు ఆదీ. నేను ఆ సమాధుల గుట్టమీద కూచున్నప్పుడంతా నా తాత, తండ్రుల ఆత్మలు నా ముందు నిలుచుని ప్రతీకారం కోసం ఆక్రోశిస్తున్నాయి. నన్ను ఆదేశిస్తున్నాయి. నన్ను క్షమించు"

ఆదిత్య దీర్ఘంగా నిట్టూర్చాడు.

"అదేంటి వీరా? పరాయిదానిలా మాట్లాడుతున్నావు? పగలు, ప్రతీకారాలకు అంతం పలకాలన్న ఒక ఉత్తమమైన ఆశయం నాలో ఉంది. దానికి నువ్వు చేయూతనివ్వనంటే నా ప్రాణాలు నీ ముందు ఆనందంగా ధారపోస్తాను" అంటూ మాట్లాడలేక ఆగిపోయాడు.

అతనికి విషం ఎక్కుతున్నది. అతని రక్తనాళాల్లో నరనరాల్లో అది చకచకా వ్యాపిస్తూ వుంది. ఇంక ఎవరు చేసేది ఏమీ ఉండదు.

"వీరా... నా రక్తనాళాలు చిట్లుతున్నాయి. ఒంట్లోనుంచి ఎన్నో టన్నుల ఉష్ణం బయలు వెడలుతోంది. ఎప్పుడూ లేని విధంగా మెదడూ శరీరం ఏదో అవుతున్నాయి" అంటూ నవ్వాడతను.

తను శిలాప్రతిమలా కూచుండిపోయింది. కనీసం అప్పుడైనా వైద్యుడి కోసం కబురంపితే ఏమైనా ప్రయోజనం ఉండేదేమో!

"నా పాలలో విష ప్రయోగం జరిగినట్టు తెలిసిపోయింది. ఫరవాలేదు వీరా! కాని మన వంశాలలో ఇదే తుది హత్య కావాలి. అందుకు కృషి చేస్తాననని మాటివ్వు" అంటూ చేయి చాచాడతను.

అప్పటికీ తను శిలా ప్రతిమలానే కూచుండిపోయింది.

"మా అమ్మ ఆదిలక్ష్మమ్మ బతికే ఉంది. ఆమెకు నా వందనాలు" అన్నాడు.

"ఇంకొక్క విషయం చెప్పండి. మా నాన్నను చంపించింది మీరే కదా? "

"ఛ. ఛ. ఆ విషయం నాకు గానీ, మా అమ్మకు గానీ తెలియదు. నేను, ఆమె నిరపరాధులం..." ఇంకేదో చెప్పబోతున్న ఆదిత్య మరి మాట్లాడలేకపోయాడు. నోటిలోంచి రక్తపు చుక్కలు పడసాగినై. తనకు నోటి వెంట మాటరాలేదు.

అతని చెయ్యి వాలిపోయింది. తను ఏ వాగ్దానమూ చేయకుండానే అది వాలిపోయింది.

మంగమ్మ తలుపు బాదుతోంది "వీరా! ఇందాక మర్చిపోయాను. ఈ లడ్డు తీసుకొనిపో" అంటోంది.

తను గది తలుపు తెరిచింది. అప్పటికే ఆది కిందికి వాలిపోయాడు.

పరిస్థితి చూసి బిత్తరపోయిన మంగమ్మ పది మందినీ కేకలేసి పిలిచింది. వైద్యుడొచ్చాడు.

ఆది నిర్జీవ శరీరాన్ని, తననూ మార్చి మార్చి చూశాడు వైద్యుడు.

"ఇతనికి హార్టు ఫెయిలైంది. ఇంక లాభం లేదు. అమ్మాయికి నిరుగుండె పడ్డది. ఆమె తనంతట తాను మాట్లాడేం తవరకు, ఎవరూ ఆమెను మాట్లాడించ ప్రయత్నించొద్దు" అన్నాడు.

బంధువులు శోకండాలు పెడుతూ ఉంటే తను నిశ్చలంగా ఒక మూల నిలబడ్డది.

ఆ తర్వాత వ్యవహారాలన్నీ చకచకా జరిగిపోయాయి.

రెండుమూడు రోజులు తను మానసికంగా ఎటువంటి ఆలోచన లేకుండా, శారీరకంగా ఎటువంటి కదలిక లేకుండా ఉండిపోయింది. ఈ స్థితినే వైద్యుడు 'నిరుగుండె'గా నిర్వచించాడేమో!

తను ఆ నిశ్చల స్థితి నుంచి బయట పడేసరికి తన మనసు సుడిగుండంలో పెనుప్రవాహంలా సుళ్ళు తిరగడం మొదలెట్టింది.

తన తప్పు తనకు చాలా ఆలస్యంగా అర్థం కాసాగింది.

తను ద్రోహి! పాతకి! కనీసపు మానవత్వం నశించిపోయిన రాక్షసి! సాంప్రదాయానికి, వైవాహిక బంధానికి విలువివ్వకపోతేపోయే, ఒక మహాప్రేమను,

అపూర్వ బంధాన్ని నేల రాసేసింది. తన కేది శిక్ష?

'నువ్వేం చేస్తావే? ఆడ దానివి!' అని తనను హేళన చేస్తూ మాట్లాడే తన స్నేహితురాలు పుల్లమ్మకు ఈవాళ గర్వంగా 'చేశాను చూడవే' అని చెప్పదల చుకుంది.

అయితే పుల్లమ్మ ముందుగానే జరిగిన విషయం ఊహించినట్టుంది. అందరూ ఏడుస్తూ వుంటే తన దగ్గరకొచ్చి "ఒసే పాతకీ! ఏం ఘాతుకపు పని చేశావో చెప్పవే" అని ఏడుస్తూ వెళ్లిపోయింది.

ఇక తన కర్తవ్యం, తన భర్త జీవితా శయం నెరవేర్చడమే. అదే తన జీవిత ధ్యేయం. ఈ పగలకు ప్రతీకారాలకు దూరంగా తన బిడ్డను పెంచి పెద్ద చేయాలి. ఈ కడుపులో శిశువు ఆడో, మగో తెలియదు కాని ఈ శిశువు వల్ల రెండు వంశాలు నిలబడాల్సి ఉంది" అను కొంది.

అది మొదలుకొని వీరమ్మ మంచంలో వున్న తన తల్లిని కూడా పట్టించుకోలేదు. తన కడుపులో పెరిగే బిడ్డకోసం మంచి ఆహారం తీసుకొనేది. ప్రతి దినమూ గుర్ర మెక్కి సమాధులున్న గుట్టవద్దకు వెళ్లేది. అక్కడ ఆమె మనసులో రకరకాల ఆలోచ నలు రేగేవి. వాటిలో పశ్చాత్తాపం, తనపై తనకే ద్వేషం, తన బిడ్డను గురించి రకర కాల కలలూ ఉండేవి. అయితే ఆమె ఆది త్యను తలచుకొని శోకించని రోజు మాత్రం లేదు.

పశ్చాత్తాపంకన్నా పాపం చేసినవాడికి కఠిన శిక్ష మరొకటి లేదు. అలా ఆమె హృదయం పశ్చాత్తాపంలో కాలి మసై నుసై, చివరకు అపరంజి లాంటి తాత్విక తగా రూపొందింది.

రోజూ మధ్యాహ్నం తనింటికొచ్చి తన తోను, తాతతోను ఎడతెగకుండా కబుర్లు చెప్పే వీరమ్మ, ఇటీవల ఇక్కడికి రాకుండా గుట్టమీద కూచోడానికి వెళుతుండడం పుల్ల మ్మలో రకరకాల ఆలోచనలకు నాంది వేసింది.

ఒకరోజు ఆమె వీరమ్మకు తెలియకుండా గుట్టచేరి, గంగరావి చెట్టు మొదట్లో ఆమెకు కనబడకుండా కూచొని, ఆమె చర్యలు గమనించసాగింది.

వీరమ్మ పెద్ద శోకదేవతలా వుంది. ఆమె కూచుని ఆలోచిస్తూ, మధ్య మధ్యలో తల కొట్టుకుంటూ ఏడుస్తోంది. అంతలో లేచి నిలుచుని తండ్రి తాత సమాధుల లను సమీపించి వాటికేసి తలబాదు కుంటూ మళ్లీ ఏడుస్తూ వుంది. మధ్య మధ్య ఒక చేత్తో తన పొట్ట తనే తడుము కుంటూ వుంది. ఆ తడమడం చాలా ప్రేమగా, జాగ్రత్తగా చేస్తూ వుంది.

ఇదంతా చూసి పుల్లమ్మ మనసు వికల మైంది. ఆది మరణం వెనుక వీరమ్మ హస్తం కచ్చితంగా వుంటుందని ఆమెకు అనుమానంగా ఉంది. వీరమ్మ చర్యలు చూశాక ఆమెకు ఆ అనుమానం దృఢపడ్డది.

★ ★ ★

ఇప్పుడు మంగమ్మ పరిస్థితి చాలా అధ్వాన్నమైపోయింది. ఆమె మంచాన పడి వుండడం, వీరమ్మ ఇంటి విషయా లేమీ పట్టించుకోకపోవడంతో అటు ఆమె పుట్టినింటా, ఇటు మెట్టినింటా చాలా పొలాలు సాగుకు నోచుకోలేకపోయాయి.

అయినా ఆమెకు వాటి గురించి చింత లేదు. తనేం పాపం చేసిందని ఆ భగవం తుడు ఇన్ని రకాలుగా శిక్షల పాలుజే శాడు? కట్టుకున్న మొగుడు పాయే, వంశో ద్ధారకుడు పురిట్లోనే దూరమైపాయే. ఆడ దైనా మొగోడైనా ఇదే అని పెంచుకున్న ఈరమ్మ జీవితం బుగ్గిపాలాయె. ఇంక తన బతుకెందుకు? ఎవ్వరి కోసంగా తను బతకాల' అనుకుంటూ అదే ధ్యాసలో

ఉండసాగింది.

ఆదిత్య మరణం పట్ల దుమారాలు చెల రేగకపోలేదు. అటు గుమ్మడిదిబ్బలో, ఇటు వీరంపల్లెలో ఈ పుకార్లు వ్యాపిం చాయి.

మానవుడి నాలుక పరమ పాపిష్టిది. అది రకరకాల పదార్థాల వల్ల జబ్బులు తెప్పిస్తుంది. వాగుడు వల్ల తగువులు సృష్టిస్తుంది. అది రహస్యాలు దాచలేదు. పుకార్లు వ్యాపింపజేస్తుంది.

గంగాధరం కూడా తాను చాలా డబ్బులు ఖర్చు చేసి సేకరించిన ఆదిత్య జన్మరహస్యం ఎంతో కాలం తనకొక్కడికే

కొత్తగాలి... 

**మానవత్వం లేని**
**మేధస్సు కంటే**
**మేధస్సు లేని**
**మానవత్వం ఎంతో మేలు!**

– నీలం శివగంగాధర,
వీరపునాయునిపల్లె, కడప జిల్లా

పరిమితం చేసుకోలేకపోయాడు. ఆ రహ స్యాన్ని సేకరించి, అతనికి అందించిన రహస్య గూఢచారులు కూడా దాన్ని తమ ఆత్మీయులకు, అనుయాయులకు అందించి న్యాయం చేసినట్టు ఆనందపడిపోయారు. ఇవన్నీ ఆనోటా ఈనోటా వీరంపల్లెలో కూడా వ్యాపించాయి. అయితే అవి పుకార్లో లేక నిజాలో తెలియని ప్రజలు రకరకాలుగా వ్యాఖ్యలు చేసుకుంటూ, పొద్దు వెళ్లబుచ్చుతున్నారు. ఇవి మంగ మ్మను చేరడానికెన్నో రోజులు పట్టలేదు.

ఆమె ఒక రోజు వీరమ్మను నిలేసింది.

"ఏమే వీరమ్మా! నీ మొగుడి సావుకి కారణం రకరకాలుగా చెప్పుకుంటూ వుండారు. ఊరు వూరంతా గుప్పుమంటూ వుంది. అసలు సంగతి నీకే తెలియా లంట. పుల్లమ్మ గూడా ఇదే మాట అంటా వుంది. నేను నీ తల్లిని ఏంద్లైనా వుంటే నాకు సెప్పు"

వీరమ్మ తల్లి ముందు స్తంభం లాగా నిలబడ్డది. ఉలుకూ పలుకూ లేదు.

"ఏమే మొద్దుముండా. ఉలుకూ పలుకూ లేకుండా మొద్దు లాగా నిలబడ్డావేమే? ఏం జరిగిందో సెప్పి సావు" అని గద్దిం చింది మంగమ్మ.

వీరమ్మ తల్లి వంక నిర్లక్ష్యంగా చూసి "అమ్మా! నువ్వొత్త ఆడదానివి. రోసం, పౌశం లేన్దానివి. నేనేం చెప్తే నీకర్థమవు తుంది? !" అంది.

ఈ మాటలని వీరమ్మ అదే నిర్లక్ష్యంతో నడుచుకుంటూ వెళ్లిపోయింది.

వీరమ్మ మాటలు, ప్రవర్తనా మంగ మ్మలో చాలా అనుమానాలు రేపాయి. వీరమ్మ పట్ల అంతులేని ద్వేషానికి అంకు రార్పణ జరిగిందామె మనసులో.

ఆవాల్టి నుంచీ అమ్మా కూతురు ఎడ మొఖం, పెడమొఖం అయ్యారు!

కొన్నాళ్ల తర్వాత మంగమ్మ అయిన వారినిద్దరిని వెంటబెట్టుకుని ప్రయాణ మైంది. ఎక్కడికో ఎవరికీ, చివరికి కూతు రికీ కూడా చెప్పలేదు.

★ ★ ★

గుట్ట మీద కూచుని శూన్యంలోకి చూస్తున్న వీరమ్మ తననెవరో సమీపిం చడం గమనించనేలేదు. ఆ వచ్చిన వాళ్లు బురఖాలు ధరించి వున్న స్త్రీలు. దగ్గరగా వచ్చాక వాళ్లలో ఒకావిడ "అమ్మాయ్! వీరమ్మా!" అని పిలిచింది.

వీరమ్మ తల తిప్పి వాళ్ల వంక ఆశ్చ ర్యంగా చూసింది. తన పెళ్లినాడు వచ్చి నగలిచ్చి, ఆశీర్వదించిపోయిన తన అత్త గారి స్నేహితురాళ్లలాగే వున్నారు ఆ

ముస్లిం స్త్రీలు.

వారిలో ఒకావిడ "నీతో మాట్లాడాల మ్మాయ్. మేం గుర్తున్నాంగా.. అప్పుడు నీ పెళ్లి రోజు..."

"అవునవును. గుర్తున్నారు. ఏంటిలా వచ్చారు? బాగున్నారా?"

"బాగానే ఉన్నాం అమ్మా! నువ్వెలా వున్నావు?" అని ఆప్యాయంగా పలకరించింది.

ఇటీవల కాలంలో తననంత ఆప్యాయంగా పలకరించిన వాళ్లెవరూ లేరు వీరమ్మకు. ఆమె కంఠంలో ఆప్యాయత ఎడారిలో చిలకరించిన నీళ్లలాగా ఆమె హృదయాన్ని తడిపి, కళ్లల్లో నీళ్లు తెప్పించింది.

"అమ్మాయ్! బాధపడకు. గుమ్మడిదిబ్బకు, వీరంపల్లెకీ చెందిన ఆడకూతుళ్లకు ఏడుపు తప్ప మిగిలిందేమైనా ఉందా?" అంటూ వాళ్లిద్దరిలో కాస్త లావుగా ఉన్నావిడ వీరమ్మను వూరడించింది.

ఆ ఊరడింపుతో వీరమ్మ శోకం కొంతవరకూ ఉపశమించింది.

"అమ్మాయ్! మేం నీతో మాట్లాడడానికి గుమ్మడి దిబ్బ నుంచి వచ్చాం. నీ పెళ్లిలో మేం చెప్పినట్టు మాది హైద్రాబాదూ కాదు, మేం మీ అమ్మ స్నేహితులమూ కాదు"

"ఆ విషయం నాకూ తెలుసు. పెళ్లయిన తర్వాత ఆది చెప్పారు. కాని మీరలా ఎందుకు చేయాల్సి వచ్చింది?"

"కొన్ని పరిస్థితుల దృష్ట్యా అలా చెప్పుకుని బురఖా వేసుకోవాల్సి వచ్చింది. నేను నీ భర్తకు తల్లిని. ఈమె నా స్నేహితురాలు సుందరమణి" అంటూ ఆమె, ఆమె స్నేహితురాలు బురఖాలు తొలగించారు.

నివ్వెరపోయి చూస్తున్నది వీరమ్మ.

"అమ్మాయ్ నా పేరు ఆదిలక్ష్మి. నీ భర్త ఆదికి తల్లిని. ఈ విషయం నీకు నిదానంగా తెలియజేస్తానని ఆదిత్య, అదే నీ భర్త, నా రెండో కొడుకు నాకు చెప్పాడు" అన్నది ఆదిలక్ష్మి.

'అవును' ఎలాగో గొంతు పెగల్చుకుంటూ గొణిగింది వీరమ్మ.

"ఆదిత్య నీకంతా చెప్పే ఉంటాడమ్మాయ్. వాడి మరణం గురించి..." అంటూ కళ్లు తుడుచుకుంది.

వీరమ్మ తలవొంచుకుంది.

ఆమె మళ్లీ మొదలెట్టి "రకరకాల పుకార్లున్నాయ్... అవన్నీ నేను నమ్మలేదనుకో" అంది ఆదిలక్ష్మి.

వీరమ్మ తల, మనసు కూడా అధఃపాతాళానికి కుంగిపోయాయి. 'నేనే.. నేనే!' అని గట్టిగా అరిచి చెప్పాలనిపించింది.

"అమ్మాయ్. ఈ పగలూ, కక్షలూ ఎందరు తల్లుల గర్భశోకానికి కారణమయ్యాయో, ఎందరు ముత్తైదువులను ముండమోయించాయో! ఎందరు పసిపిల్లల పితృశోకానికి, ఎన్ని కుటుంబాలు సర్వనాశనం కావడానికి కారణమయ్యాయో తెలుసా?" ఆదిలక్ష్మి కంఠం ఆవేశంతో కంపించింది.

వీరమ్మ తలెత్తి ఆమె మొఖం చూసింది.

ఆమె ముఖంలో ఆదిత్య పోలికలు కొట్టవచ్చినట్టు కనిపించి ఆమెగుండె గబుక్కుమంది.

'తన మీద ఆమె ఎంత నమ్మకం పెంచుకుంది! అమాయకురాలు!' అనుకుంది.

ఆదిలక్ష్మి ముఖం నిండుగా ఉంది. ముఖం మీద కుంకుమలేకున్నా, కట్టూ తీరు హిందుత్వాన్ని వెళ్లబోస్తున్నాయ్. సుందరమణి మొఖం కాసంత కుంకుమ బొట్టుతో ప్రకాశిస్తోంది. కట్టిన పట్టుచీర అంచు తొడిగిన బురఖాలో నుంచి తొంగి చూస్తున్నది.

"నిన్నిట్లా చూడాలంటే నాకు కడుపు తరుక్కుపోతా వుంది పాపా. మీ పెళ్లికి

ముందు నేను, ఆదిత్యా కలుసుకున్నాం. అతి రహస్యంగా వాడు నాకు నీ వివరాలు చెప్పినప్పుడు నేను వద్దంటే వద్దన్నాను. కాని వాడేమన్నాడో తెలుసా? - అమ్మా! తరతరాల ఈ పగలు అంతరించాలంటే ఇదొక్కటే మార్గం, శత్రుత్వానికి అతీతమైన వంశమొకటి ఉత్పత్తి కావాలి. బహుశా అందుకే దేవుడు నన్నూ, ఆ అమ్మాయిని కలిపాడేమో!- అన్నాడు"

"నా పట్టుదలతో వాడి మనసులో వున్న ఒక ఉత్తమమైన ఆశయాన్ని త్రోసిరాజన లేక ఒప్పుకున్నాను. ఐనా అది తప్ప నాకింక వేరే గత్యంతరం లేదనుకో" అంటూ ఆపింది ఆదిలక్ష్మి.

అందరినీ పోగొట్టుకున్న ఆ తల్లి, అంత నిబ్బరంగా మాట్లాడడం వీరమ్మకు ఆశ్చర్యం కలిగించింది.

"ఎందుచేత? " అన్నది వీరమ్మ.

అప్పుడు సుందరమణి అందుకొని "వద్ద న్నంత మాత్రాన మేము ఆదిత్యను తీసు కొచ్చి పెళ్ళి చేసేదుందా పాపా? లేకుంటే ఆదిలక్ష్మి 'వీడు నాకొడుకు' అని చాటుకొనే వీలుందా? ఈ రెండు పనులతో పోలిస్తే ఆది చెప్పిన మూడో విధానమే ఉభయతా రకమనిపించి, ఒప్పుకోక తప్పలేదు" అంది.

'ఓహో! ఈ పెళ్ళి వెనక ఇంత చర్చ జగి రిందా' అనుకొంది వీరమ్మ.

"అంతేకాదమ్మా! నిన్ను నా ఇంటికి కోడ లిగా తెచ్చుకోవాలని, కక్షల్లో రగిలే ఇరుగ్రా మాల మధ్య సామరస్యం తీసుకురావాలనీ వాడి ఆశయం. అన్నీ మంటగలిసిపోయె" అంటూ కన్నీరుమున్నీరైంది ఆదిలక్ష్మి.

వీరమ్మలో అణగారివున్న దుఃఖం మళ్ళీ పైకుబికింది.

"ఆది ఆశయం చాలా ఉన్నతమైంది. కాని దాన్ని గుర్తించలేని అంధు రాలినయ్యాను నేనే" అన్నది వీరమ్మ ఏడు పుమధ్య.

వీరమ్మ అన్న ఉద్దేశం, ఆదిలక్ష్మి మాటల ఉద్దేశం వేర్వేరు. కాని ఆ ముగ్గు రిలో ఎవరూ ఆ విషయాన్ని గుర్తించలేక పోయారు.

"అదంతా వదిలెయ్యి వీరమ్మా. గతం తవ్వుకుని లాభం లేదు. అన్నింటినీ కప్పె ట్టేసి, బండలా బతకడం నన్ను చూసి నేర్చుకో తల్లీ! జరగబోయే దాన్ని గురించి ఆలోచిద్దాం" అంది ఆదిలక్ష్మి.

"నన్నేం చెయ్యమంటారో చెప్పండి" అన్నది వీరమ్మ మనస్ఫూర్తిగానే.

"అమ్మాయ్. నీకొక అన్న ఉన్నాడన్న విషయం తెలుసా? " అడిగింది ఆదిలక్ష్మి.

"తె...తె...లుసు. ఇటీవలే మా తాత, మా అవ్వ పోలమ్మ చనిపోతూ చెప్పారు" అన్నది వీరమ్మ.

"ఏ కారణాలవల్ల నేను ఆదిత్యను నీవద్ద పెంచలేక దూరంగా పెంచవలసి వచ్చిందో, అదే కారణం వల్ల మీ అమ్మ నీ అన్నను పురిట్లోనే దూరం చేసుకుంది" అంటూ నిట్టూర్చింది ఆదిలక్ష్మి.

"ఇదంతా మీకు...? " అంది వీరమ్మ.

"అమ్మాయ్! మేం ఊరకున్నా మా మనుషులు ఊరకుండరు. వాళ్ల మా ప్రాణాలు రక్షించడానికి అన్ని విషయాలు ఎప్పటికప్పుడు తెలుసుకుంటుంటారు. ఇప్పుడు మీ ఇంట జరుగుతున్న విష యాలు అనేకం నేను చెప్పగలను" అన్నది ఆదిలక్ష్మి.

ఆశ్చర్యంగా చూసింది వీరమ్మ.

"మీ అత్తగారు చెపుతున్నదంతా నిజం అమ్మాయ్. నువ్వు శ్రద్ధగా వినాలి" అన్నది సుందరమణి.

సరేనన్నట్టు తలాడించింది వీరమ్మ.

"ప్రస్తుతం మీ అమ్మ మంగమ్మ తనకి దూరమైన కొడుకును వెదకడానికి వెళ్ళిం దని మాకు తెలిసింది" అన్నది ఆదిలక్ష్మి.

'ఓహో! అమ్మ తనమీద కోపంతో తనకు

చెప్పకుండా వెళ్లింది అందుకా! ఈ విషయం తనక్కూడా తెలియదే. వీళ్లెలా తెలుసుకోలిగారు? ' వీరమ్మ మనసులో మెదిలే ఈ భావాలను ఆదిలక్ష్మి అర్థం చేసుకుని దానికి జవాబు చెప్పింది.

"అమ్మాయ్ వీరమ్మా! చెప్తే నువ్వు ఆశ్చర్యపోతావు. కాని మా మనుషులు మీ ఊళ్లోనే కాదు, మీ ఇంట్లో కూడా ఉంటారు. వాళ్లు మీ సొంతవాళ్లుగానే మసలుతుంటారు. ఈ విషయం మీకు తెలియదు. మా ఇళ్లల్లో కూడా మీ మనుషులుంటే ఆ విషయం మాకూ తెలియదు' ' అన్నది ఆదిలక్ష్మమ్మ.

"లేదు. లేదు. మేమెప్పుడు అలా తెలుసుకోలేదు. నా మాట నమ్మండి. నేను నిజం చెబుతున్నాను. అట్లా ఏదైనా జరుగుతుంటే ఆది ఎవరో మాకు ముందే తెలిసుండేది" అన్నది వీరమ్మ.

"సరే వీరమ్మా! అదంతా ఒదిలేద్దాం. ఏమి జరిగింది అన్నది కాదు ముఖ్యం. ఇక ఏమి జరగబోతోందో అది ముఖ్యం" అన్నది ఆదిలక్ష్మి.

"ఎందుకలా అంటున్నారు అత్తగారు? " అడిగింది వీరమ్మ.

"మీ అమ్మకోరిక ఫలించి, మీ అన్నను గాలించి పట్టుకుని తీసుకురావచ్చు. ఈ గడ్డమీద అడుగు పెట్టినాక, అతన్లో సంపద మీద ఆశ కలగొచ్చు. రక్తంలో అణగారివున్న ప్రతీకారవాంఛ మేలుకోవచ్చు. ఇదే జరిగితే నీ కడుపులో పెరిగే బిడ్డకు చాలా ప్రమాదం"

వీరమ్మ చెయ్యి అప్రయత్నంగా ఆమె గర్భం మీదికి వెళ్ళింది. ఆదిలక్ష్మి మాటల్లో ఉన్న నిజం ఆమె మెదడులో ఆవిష్కృతమైంది.

"అందుకు నేనేం చెయ్యాలి? "

"బిడ్డ కడుపులో ఉన్నపుడు సంరక్షించుకోడం పూర్తిగా నీ బాధ్యత. బిడ్డ పుట్టాక మాకు అప్పగిస్తే మేం వాణ్ణి పూర్తి జాగ్ర

## పందొమ్మిదేళ్ల దీర్ఘనిద్ర



కోమాలోకి వెళ్లినవారు ఇక బతకరని వైద్యులు తరచుగా చెబుతుంటారు. చాలా సందర్భాల్లో అది నిజం అవుతుంటుంది. కాని పోలండ్‌కు చెందిన జాన్ గెజ్ చిస్కీ విషయంలో అలా జరగలేదు. రైల్వే శాఖలో పనిచేసే జాన్ ఒకరోజు రెండు రైలు పెట్టెలను కలుపుతుండగా తలకి పెద్ద



దెబ్బ తగిలింది. అతడ్ని హాస్పిటల్‌కు తరలించారు. పరీక్షల్లో అతనికి బ్రెయిన్ కేన్సర్ ఉందన్న సంగతి కూడా బయటపడింది. అతను కోమాలోకి వెళ్లిపోయాడు. మూడేళ్లు గడిచాక ఇక అతను అట్టేకాలం జీవించడని వైద్యులు చెప్పారు. కాని అతని భార్య గెర్ట్రూ మాత్రం ధైర్యం కోల్పోకుండా నిత్యం అతని దగ్గరకి వెళ్లి మాట్లాడుతూ గడపసాగింది. గొంతులోని నాళాల ద్వారానే అతనికి ఆహారాన్ని అందించారు. అలా పందొమ్మిదేళ్లు కోమాలో ఉన్నాక ఓ రోజు జాన్ అందులోంచి బయటకి వచ్చి అందర్నీ ఆశ్చర్యపరిచాడు. తన కుటుంబ సభ్యులను ఆనందపరిచాడు. ఏప్రిల్ 12, 2007న అతను కోమాలోంచి బయటికి వచ్చాక గుర్తించిన ప్రధాన మార్పు పోలండ్ రష్యన్ కమ్యూనిజం నుంచి బయటికి వచ్చి ప్రజాస్వామ్య రాజ్యంగా మారడం. అతనికి పదకొండు మంది మనవలు, మనవరాళ్లు ఉన్నారు. ఇలా దాదాపు ప్రతి రంగంలోనూ జాన్ గ్రెజ్‌చిస్కీకి ఆశ్చర్యాన్ని కలిగించే మార్పులు దర్శనమిచ్చాయి. పత్రికా విలేఖరులతో అతను ఇలా చెప్పాడు- 'నాకు ఆశ్చర్యాన్ని కలిగించేది.. నేడు అంతా చేతిలో సెల్‌ఫోన్స్‌తో సదా ఫిర్యాదు చేస్తూ, గొణుగుతూ ఉంటారు. కాని ఫిర్యాదు చేయడానికీ, గొణగడానికీ నాకేం లేదు'

# చతుర ప్రవేశిక

## ఆగస్టు చతుర చదివారా?

ఈ ప్రశ్నలకు ఒక్క మాటలో జవాబు రాయగలరేమో చూడండి. ఎక్కువమంది సరైన జవాబులు రాస్తే డ్రాతీసి విజేతలను ఎంపికచేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

1. వీరమ్మ భర్త?
జ.
2. ఆదిలక్ష్మి మొదటి కొడుకు ఎవరు?
జ.
3. పుల్లమ్మ ఎవరిని పెళ్లాడింది?
జ.
4. వీరంపల్లెకు ఏ గ్రామంతో కక్షలున్నాయి?
జ.
5. పరమయోగిపై హత్యాయత్నం చేయించింది?
జ.
6. 'యూలిసీస్' నవలా రచయిత?
జ.
7. 'హనీమూన్' మూల రచయిత?
జ.
8. అమ్ముకుట్టి భర్త పనిచేసే నగరం?
జ.
9. ఆంగ్లభాషా నిఘంటువును రచించింది?
జ.
10. అతిదీర్ఘకాలం కోమాలో ఉన్న వ్యక్తి?
జ.

---

పంపినవారి పేరు: ----------------

------------------వయసు ( )

చిరునామా: ----------------------

----------------------

----------------------

పిన్‌కోడ్: ఫోన్ నెం:

చిరునామా : సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082

చివరి తేదీ 17

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

**విపుల వినోదిని, చతుర ప్రవేశిక ఒకే కవరులో పంపవచ్చు.**

త్తల్లో పెంచగలమని హామీ ఇస్తున్నాను"

వీరమ్మ తలొంచుకుని ఆలోచించింది. తన కర్కశ హృదయం ఆదిని బలిగొంది. ఇప్పుడు ఆదిలక్ష్మమ్మ మనవడు, అంటే సమరయ్య మనవడు తన గర్భంలో పెరుగుతున్నాడని తన ఇంటివారికి తెలిస్తే ఆ బిడ్డకు ప్రమాదం రావచ్చు. మేనమామ కంసుడు, దేవకి సంతానాన్ని బలిగొనలేదా? అదేవిధంగా తన అన్న, తన గర్భంలో పెరిగే శిశువును, శత్రు సంతానమని బలిగొనవచ్చు. ఒకవేళ అమ్మకి ఈ విషయం తెలిసే అన్నను వెదకడానికి వెళ్లిందేమో!

ఒక్క క్షణంలో ఆమె మనసులో వెయ్యి సందేహాలు సుళ్లు తిరిగాయి. ఈ విషయంలో తను అత్తగారి సలహాగైకొని, బిడ్డ ప్రాణాలు కాపాడుకోవాలి. ఆ బిడ్డే తన జీవితానికి ఆశాజ్యోతి. తన ప్రేమఫలం. బిడ్డ సంరక్షణే తను చేసిన ఘోరపాతకానికి పరిహారం.

ఈ ఆలోచన ఆమె మనసులో రాగానే ఆమె వినయంగా "అలాగే అత్తగారూ! మీరెట్లా చెయ్యమంటే అట్లా చేస్తాను. ఏ విషయం మీకు ఉత్తరం లేక మనిషి ద్వారా తెలియజేస్తాను" అని మాటిచ్చింది.

ఆ ఇద్దరు స్త్రీలు చాలా సంతోషించి ఆమెను ఆశీర్వదించారు. అల్లంత దూరంలో వాళ్లు వచ్చిన జీపు ఆగివుంది. సుందరమణి డ్రైవర్ని కేకేసి ఒక సంచి తెప్పించింది. అందులో గర్భవతులు తినదగిన కొన్ని పిండి వంటలున్నాయి. ఆ సంచీని వాళ్లు వీరమ్మకిచ్చి "వెళ్లొస్తాం అమ్మాయ్! దేవుడనుగ్రహిస్తే నిన్ను మళ్లీ ఇక్కడే కలుస్తాం" అని వెళ్లిపోయారు.

జీపు కదిలింది.

వీరమ్మ మనసు పెనుతుపానులో ఇరుక్కుంది. ఇంతవరకు తను ఏ అన్న రాక కోసం ఎదురు చూసిందో ఈవాళ ఆ అన్న వస్తాడని భయపడుతోంది.

అంతవరకూ ఏనాడు దేవుణ్ణి తలచి ఎరుగని వీరమ్మ తన శిశువును కాపాడమని దేవదేవుని వేడుకుంది. తనను క్షమించమని, తన పాపాన్ని కడిగివేయమని సర్వేశ్వరుని ప్రార్థించింది.



వీరమ్మకు చాలా ఆశ్చర్యంగా వుంది. వీరంపల్లెలో జరిగే విషయాలే కాకుండా తన ఇంటి విషయాలు, అదీ తనకు తెలియనివి, తన అత్తకు తెలియడం ఆమెకు చాలా వైపరీత్యంగానూ, అన్యాయంగాను తోచింది. 'ఇంక తాము ఎవ్వరినైనా నమ్మేదెట్లా?' అనుకుంది.

ఆవేళ వీరమ్మ ఇంటికి తిరిగొచ్చి గుర్రాన్ని కట్టేసి, లోపలికి అడుగు పెట్టగానే ఎదురుగా కుర్చీల్లో తన తల్లి, ఆమెతో బాటూ ఒక స్ఫురద్రూపియైన యువకుడు కూచొని ఉన్నాడు. 'ఎవరితను?' అని వీరమ్మ అనుకుంటూ ఉండగానే మంగమ్మ "వీరమ్మా! ఇట్టారా.. ఈయనెవరో గుర్తుపట్టు. చూద్దాం" అంది.

జరిగిందేమిటో ఊహించిన వీరమ్మ మాత్రం ఊరకనే అయోమయంగా చూస్తుండిపోయింది. మళ్లీ మంగమ్మే అందుకొని "ఇతను నీ అన్నే. మీరు పురిట్లోనే వేరైపోయారు. నువ్వెట్లా గుర్తుపడ్తావులే!" అంది.

తల్లి తనతో అట్లా కాస్త ఆప్యాయంగా మాట్లాడి చాన్రోజులైంది.

తన మనసులో చెలరేగే భయాలు, ఆలోచనలూ కనిపించకుండా జాగ్రత్తపడుతూ "అవునా అమ్మా! పోన్లే. ఇప్పటికైనా దేవుడు మనల్ని కరుణించాడు" అంటూ వచ్చి యువకుని చెయ్యి పట్టుకుంది.

"ఎట్టా కనుక్కున్నావమ్మా?" అంది మళ్లీ.

"అయ్యో! ఏమడుగుతావులే తల్లీ. నాకు కానుపైన వూరికి పోయిన. కానుపు చేసిన డాక్టరమ్మ ఏదో జబ్బుచేసి పోయిందంట. ఆ మాటనగానే సతికిలబడ్డా. అయినా ధైర్యం తెచ్చుకొని ఆ నర్సింటి ఇవరాలు తెలుసుకొని, వాళ్లింటికి పోయిన. ఆ నర్సు ముసిల్దైపోయివుంది. అడగ్గా అడగ్గా ఈని ఇవరాలు గుర్తు చేస్కోని చెప్పింది. కష్టపడి ఆ అడ్రసు సంపాదించి వాళ్ల పల్లెకు పోతిమి. అక్కడ మాదవరావు దొరికినాడు. నీయన్న పేరు మాదవరావమ్మా. నేనైతేగన, ఈర్రాజని మీతాత పేరు పెట్టిందును" అన్నది మంగమ్మ.

అతను చూట్టానికి వీరమ్మలాగానే ఉన్నాడు. "చెల్లీ!" అంటూ ఆమె చెయ్యందుకున్నాడు ఆప్యాయంగా.

లోపల్నించి ఇన్నాల్లూ అతన్ని సాకిన తల్లిదండ్రులొచ్చారు.

"అమ్మా! ఇంక మేం వెళ్లొస్తాం. ఇకనుంచి మీరే వీణ్ణి జాగ్రత్తగా చూసుకోవాల. బిడ్డను జాగ్రత్తగా మాకప్పగించాల. ఇన్నాల్లూ వాణ్ణి ప్రాణంగా చూసుకున్నాం. మీవూరి పరిస్థితులు చూస్తే వాడొక పులిబోన్లో వచ్చి పడ్డాడనిపిస్తుంది" అని చాలా జాగ్రత్తలు చెప్పి, హామీలు తీసుకుని మాధవరావును వదల్లేక వదల్లేక వదిలి ఏడుస్తూ వెళ్ళిపోయారు.

అతన్ని సాకిన తల్లిదండ్రులు అంతగా కలిగిన వాళ్లు కాదు. ఇక్కడ అతనికి బోలెడాస్తి ఉందని మంగమ్మ చెప్పిన మాటలకు ఆశపడి, అతన్ని ఆమెతో పంపేందుకు సిద్ధపడ్డారు.

"ఇచిత్తరాల మీద ఇచిత్తరాలు జరగతా వుండాయి. ఈరమ్మకి ఒక తోడబుట్టినో డుండాడంటా. ఇప్పుడీ మంగమ్మ వాణ్ని ఎతికి పట్టుకొచ్చిందంట" అని వీరంపల్లె వాసులు ముక్కుమీద వేలేసుకుని చెప్పుకు న్నారు.

వీరమ్మ భయపడాల్సిన వ్యక్తి కాదు మాధవరావు. ఆ వూరికి దూరంగా పెరిగి, పూర్తిగా తనను సాకిన వారే తల్లిదండ్రు లని, మనస్ఫూర్తిగా నమ్మినవాడతను. ఇక్కడికొచ్చి వీరంపల్లె విశేషాలు వింటుంటే అతనికి భయమేసింది. తల్లి, చెల్లి అంటే కలిగిన ప్రేమాభిమానాల వల్ల అతను తిరి గి పోలేక, వీరంపల్లెలోనే ఉండిపోయాడు.

అతనికీ కొందరు అనుయాయులు పోగ య్యారు. వాళ్లు ఆది మరణం వెనుక వీరమ్మ హస్తం ఉందన్న విషయాన్ని తడి పొడిగా అతని చెవిన వేశారు.

అమాయకంగా కనిపించే వీరమ్మ మొ ఖంలో క్రూరత్వం అతనికి ఏ కోశానా కని పించలేదు. కాని ఆమె కళ్లల్లో ఏదో కాఠిన్యం గోచరించేది. అనుచరుల మాటలు నిజమనిపించేవి. దాంతో అతను వీరమ్మను చూసి భయపడసాగాడు.

తన అన్న చాలా పిరికివాడని, అతన్లో హత్యలు చేసే లేక చేయించే ఆలోచనలు లేవనీ నమ్మింది వీరమ్మ.

అయినా తన జాగ్రత్తలో తనుంది.

చూస్తుండగానే వీరమ్మకు నెలలు నిండ సాగాయి. ఇటు మంగమ్మ, మాధవరావుకు అనువైన పిల్లను వెతకసాగింది.

సీమంతం జరిపించాలని ఆలోచించిన మంగమ్మను వద్దని వారించింది వీరమ్మ. మాధవరావు కూడా చెల్లెల్ని ఎంత బతిమి లాడినా ఆమె ఒప్పుకోలేదు.

కానుపు సమీపిస్తుందనగా తల్లితో వీరమ్మ "అమ్మా! నువ్వు పెద్దదానివైనావు. అన్నకు పెళ్లి చేయాలి. పిల్లను వెతుకుతు న్నావు. నువ్వాపనిలో ఉండు. నేను పుల్లమ్మా వాళ్లను తీసుకొని వెళ్లి, టౌన్లో హాస్పిటల్లో అడ్మిట్ అవుతాను" అని రక రాలుగా నచ్చచెప్పి, ఆమెను ఒప్పించింది. అంచేత మాధవరావు చెల్లెల్ని, ఆమె స్నేహి తురాలు పుల్లమ్మను తీసుకెళ్లి టౌన్లో హాస్పి టల్లో అడ్మిట్ చేసాడు. మంగమ్మ కూడా వారి వెంట వెళ్లి కూతుర్ని జాగ్రత్తగా చూసుకొమ్మని అక్కడి డాక్టరుకు, నర్సులకు చెప్పి, కానుపు సమయానికి తనకు కబురు చేయవలసిందిగా వీరమ్మకు చెప్పి వచ్చే సింది.

వీరమ్మతోబాటూ పుల్లమ్మ ఆసుపత్రి లోని ఆ ప్రత్యేకమైన గదిలో ఉండిపో యింది.

కాన్పుకింకా వారంరోజులుందని డాక్టరు చెప్పడంతో వీరమ్మ తన అత్త ఆదిలక్ష్మికి ఈ విషయం తెలియజేయాలని అను కుంది. అందుకామె ఆదిత్య స్నేహితుడు రవిని ఎంచుకుంది.

పుల్లమ్మ ఇప్పుడు వివాహిత. ఆమె భర్త ఎవరో కాదు, రవియే.

"రవిగారూ! మీరు ఆదికి ఎంతో కావాల్సి నవారు. మా కుటుంబాల వ్యవహారాలు మీకు తెలియనివి కావు. మా అత్తగారినీ మీరు కలుసుండవచ్చని నా అభిప్రాయం"

"అవునవును. చాలాసార్లు కలిశాను"

"ప్రస్తుతం నా కాన్పింక వారం రోజు లుందని ఆమెకు తెలపాలి. ఎందుకు మిమ్మల్ని పంపాల్సివచ్చిందంటే పల్లెల్లో సాధారణంగా చదువుకున్నవాళ్లుండరు. పోస్ట్‌మాస్టర్, పోస్ట్‌మాన్ ఇద్దరూ ఒకరే. సాధారణంగా ఈ పని ఊళ్లో ఉపాధ్యా యుడే చేస్తుంటాడు. ఆయన వచ్చిన ఉత్త రాలన్నీ విప్పి చదివేసి, అందులోని విషయం టూకీగా చెపుతుంటారు. అందు చేత, నాకింకెవరూ నమ్మకమైన వ్యక్తులు దొరక్క, ఈ పని చేసిపెట్టడానికి మిమ్మల్ని





ఎన్నుకున్నాను" అన్నది వీరమ్మ.

"దానికేం భాగ్యమండీ. ఎట్లాగూ నాకు గుమ్మడిదిబ్బలో వేరే పని కూడా ఉంది. మీ పని మూడో కంటికి తెలియకుండా చేసి పెడతాను" అని మాటిచ్చాడు రవి.

పల్లెలో ఆది హత్య వీరమ్మే చేసిందని కొందరు అనుకోవడం అతను విన్నాడు. ఇప్పుడు వీరమ్మ మాటలు వింటోంటే "ఇంత గొప్ప ఇల్లాలి గురించి ఆ పల్లెలో అట్లా అనుకున్నారు. అయినా ఎవరెందుకు ఎప్పుడు పోతారో ఆ భగవంతుడికే తెలియాలి. చిన్న వాళ్లకే హార్ట్ అటాక్ వచ్చి పోతున్నారు" అనుకున్నాడు రవి.

ఈ విషయం పుల్లమ్మకు కూడా తెలియకుండా జాగ్రత్తపడ్డది వీరమ్మ. తన కానుపప్పటికి పుల్లమ్మను కూడా ఉండనియ్యకూడదని నిర్ణయించుకుంది.

★ ★ ★

మాధవరావు పెద్దగా చదువుకున్నవాడు కాదు. హైస్కూలు తర్వాత అతను చదువు మానేసి, తన తండ్రితోబాటు టింబరు డిపోలో ఉండేవాడు. అక్కడ తన తండ్రి, తాతలకు, చిన్నాన్న పెదనాన్నలకు కొయ్య వ్యాపారమే జీవనోపాధి. చుట్టుపక్కల ప్రాంతాల్లో కొయ్య కొనడం, దాన్ని డిపోలో కోయించి అమ్మడం వాళ్ల పని. వాళ్లతోబాటూ మాధవరావు టింబరు డిపోలో ఉంటూ, కొయ్య వ్యాపారంలో మెళకువలు నేర్చుకున్నాడు.

ఇప్పుడు వీరంపల్లెలో పొలాలసాగు, పత్తి, మొక్కజొన్నల అమ్మకం, ఇవన్నీ మాధవరావుకు కొత్తే. ఆయా విషయాల్లో వీరమ్మే అతనికి సలహాలిస్తూ, పనులు నేర్పిస్తూ ఉండేది.

మాధవరావు రాకతో మంగమ్మ ఆరోగ్యం కుదుటపడ్డది. తన అత్త బంగారమ్మ మతి భ్రమించి, ఆ స్థితిలోనే హైద్రాబాదులో మరణించింది. అల్లుడి మరణం తర్వాత తనకూ అటువంటి స్థితి వస్తుందేమోనని మంగమ్మ భయపడుతుండేది. అల్లుడి మరణం కన్నా, ఆ తర్వాత చెలరేగిన పుకార్లే, ఆమెపై ప్రభావం చూపాయి.

వీరమ్మ ఎప్పుడూ మాధవరావుతోనే ఉంటూ, అతన్తో పొలానికి వెళ్తూ ఉండేది. కాని ఏడో నెల దాటగానే ఆమె గుర్రపుస్వారీ చేయడం, తిరగడం మానేసింది. అందుచేత మాధవరావుకు రక్షణగా నలుగురు సాయుధులైన బలశాలురను నియమించింది మంగమ్మ.

గుమ్మడిదిబ్బ, వీరంపల్లెల మధ్య జరిగిన వ్యవహారాలు విని, మాధవరావు నిర్ఘాంతపోయాడు. పల్లెల్లో ఇంత తారస్థాయిలో కక్షలు నడుస్తాయన్నది అతనికి పూర్తిగా కొత్త విషయం.

తను బైటికి అడుగుపెడితే మంగమ్మ "జాగ్రత్త నాయనా" అంటూ గుమ్మంలోనే నిలుచుండేది. వీరమ్మ కూడా "భద్రం అన్నా" అనేది. తనెక్కడికి వెళ్లినా సాయుధులైన అనుచరులు తనతో రావటం అతనికి ఇబ్బందిగా ఉండేది.

అతనికెప్పుడూ, తనని అల్లారుముద్దుగా సాకిన తల్లీ, తండ్రీ జ్ఞాపకం వచ్చి, కళ్లనీళ్లు కార్చేవాడు. అయితే ఇప్పుడతని హోదా చాలా పెరిగింది. ప్రతి విషయాన్ని మంగమ్మ "ఏం చేద్దాం నాయనా?" అని

## కొత్తగాలి...

**అప్పుడు రంగ రంగ అంటూ**
**గుడి చుట్టూ...**
**ఇప్పుడు రింగ రింగ అంటూ**
**కాలేజీ చుట్టూ...**

– చక్కా చెన్న కేశవరావు,
కావలి

సలహా అడుగుతుండేది.

మంగమ్మ, వీరమ్మా చూపే ప్రేమాభి మానాలు తక్కువైనవేమీ కాదు. ఎంతో మంది పనివాళ్లు, 'చిన్నదొరా! చిన్నయ్యా!' అని చుట్టూ చేరుతుండేవాళ్లు.

★ ★ ★

ఆ ఊళ్లో నాయకులుగా పేరు తెచ్చుకున్న ఆరుగురు దృఢకాయులు ఆదిలక్ష్మమ్మను చూడవచ్చారు. పనివాళ్లు అందరికీ కుర్చీలు వేసి కూర్చోబెట్టి మర్యాదలు జరిపారు. తర్వాత ఆదిలక్ష్మమ్మ వచ్చి వాళ్ల వద్ద ఓ కుర్చీలో కూచుంది.

"అక్కా! నీతో ఒక ముఖ్యమైన విషయం మాట్లాడడానికొచ్చాము" అన్నాడొకతను.

"ఏందో చెప్పండన్నా" అన్నదామె.

ఆ ప్రాంతంలో వయసుతో నిమిత్తం లేకుండా ఒకర్నొకరు అన్నా, అక్కా అనుకుంటారు.

"ఏవుందక్కా! వీరంపల్లె వార్తలు వింటున్నావు గదా? "

"వీరంపల్లెలో మనకేం పనన్నా? మన గుమ్మడిదిబ్బ వ్యవహారాలు చూసుకుంటే చాలదూ? "

"అదేందక్కా... అట్టా మాట్లాడతావు? " అన్నాడొకతను ఆశ్చర్యంగా.

"మరింకేం అనమంటావన్నా? బతికినంతకాలం వాళ్లూ, మనం ఒకర్నొకరం నరుక్కుంటూ ఉంటే, ఇంక మన బిడ్డల్ని పెంచి, పెద్దచేసి, వాళ్ల బాగోగులు చూసేదెపుడు? " అన్నదామె.

ఒకతను రోషంగా "ఇన్నాళ్లూ మన భయానికి వాణ్ణి దాచిపెట్టిన మంగమ్మ, ఇప్పుడు ఆ కొమర్రాజు కొడుకుని ఊళ్లోకి తెచ్చి పెట్టుకుందట. ఏ ధైర్నంతో? " అన్నాడు.

ఇంకొకతను అందుకుని "ఏ ధైర్నమేముందిరా? గుమ్మడిదిబ్బలో మీసముండే మొగోడు లేడనే ధైర్నంతోనే" అన్నాడు.

"అన్నా! కాలం మారింది. ఇంకా మనం పాత పగల మధ్య కుళ్లిపోతావుంటే జరగదు. దయచేసి ఇవన్నీ మానేయండి. వాళ్ల మానాన వాళ్లని బతకనీండి. మనం తకు మనం బతుకుదాం. మనవి పగలు తీర్చుకునే వయసులు కావు. కృష్ణా, రామా అనుకుంటూ దైవచింతనలో కాలం వెళ్లదీయాల్సిన రోజులన్నా" అని అనునయంగా, సముదాయిస్తున్నట్లుగా చెప్పింది.

"చాలు చాలమ్మా. నువ్వెట్టయినా పరాయిదానివే. నీలో సమరయ్య రక్తం లేదు. నీ మొగుడి చావుకీ, నీ ఇద్దరు కొడుకుల చావుకీ ప్రతీకారం తీర్చుకోవాలన్న ఆలోచన నీలో లేకపోవడం వింతగా ఉంది!" అన్నాడతను.

"నీ సంగతట్టాబెట్టమ్మా! మా మేనమామను వీరంపల్లె వోళ్లు నరికేసిన్రు"

"మా నాయిన్ను పొట్టనబెట్టుకునిన్రు"

"నా కొడుకు పొలాన పనిచేస్తా, అన్నానికి ఇంటికొస్తావున్నోణ్ని తెగనరికిన్రు" ఒకతను రోషంతో, దుఃఖంతో అన్నాడు.

"ఒకరా? ఇద్దరా? పదిల్లకి కలిపి నలుగురు మొగోల్లయినా లేని పరిస్థితి మన గుమ్మడిదిబ్బది. ఇంక ఊరుకునేదెట్టాగమ్మా? "

"అన్నా! అట్లా మాట్లాడకండి. ఈ హత్యలను ఇంతటితో ఆపకపోతే వంశాలు వంశాలు నాశనమైపోతాయి. ఆలోచించండి. దేవుడనే వాడు అందరికీ న్యాయం చేస్తాడు. ఎవరు చేసిన పాపం వాళ్లకే తీరుస్తాడు. దయచేసి నామాట వినండి" అని ఆదిలక్ష్మమ్మ వాళ్లని అనేకరకాలుగా బతిమిలాడింది. కాని వాళ్ల రక్తం ప్రతీకారంతో ఉడికిపోతున్నది. ఆమె ఏం చెపుతుందో వాళ్లకి కాస్త కూడా బుర్రకెక్కడం లేదు.

చివరికి ఆమె చేసిన హితబోధను బూడిదలో పోసిన పన్నీరు చందాన తృణీక




రించి, కొమర్రాజు వంశాన్ని సమూలా గ్రంగా నిర్మూలించితేనే తప్ప తమకు బతుకు లేదన్నట్టు మాట్లాడి, ఆదిలక్ష్మ మ్మనే నాలుగు విధాలుగా నిందించి, నిష్క్రమించారు.

ఆదిలక్ష్మమ్మ చేష్టలు దక్కి అలాగే కూర్చుండిపోయింది.

కొంతసేపటి తర్వాత ఆమెకు కర్తవ్యం గుర్తుకొచ్చింది. ఆ మాధవరావునెక్కడికైనా పంపించెయ్యమని మంగమ్మకు కబురు చేయాలని నిశ్చయించుకుంది.

★ ★ ★

తన అల్లుడి మరణానికి కూతురే కారణ మని మంగమ్మ నిశ్చయంగా నమ్ముతు న్నది. ఆది సమరయ్య కొడుకనే విషయం కూడా ఒక పుకారులా ఆమె చెవిన సోకింది. 'తన కూతురు ఆడది కాదు. రాకాసి. కట్టుకున్నోణ్ణి, వాడెవుడైనా సరే, మట్టుబెట్టడానికి దాని మనసెట్టా ఒప్పింది? ఈ లెక్కన అది మాధవను బతకనిచ్చేది నిజమేనా? వాడు దానికి అన్నయినా, వాడు పోతే ఆస్తంతా దాన్దే కదా. ఈ రాకాసిముండ ఎంతకైనా తెగిం చేదే...' అని ఆలోచించింది.

'తను మాధవను ఇక్కడికి తీసుకురా వడం పొరపాటు. ఎక్కడో ఉంటే, వాడు సుకంగా ఉంటాడు. అట్టా గుమ్మడి ది బ్బోల్ల వల్ల వానికి అపకారం జరక్కున్నా, ఈ పిల్లవల్ల ఏ అపకారమైనా జరగొచ్చు. అందుకే రేపే వోన్ని ఎట్టైనా పంపించేస్తే మేలు' అని ఆలోచించిన మంగమ్మ మాధ వరావును ఒక సురక్షిత ప్రదేశానికి మరుస టిరోజే పంపెయ్యాలని తీర్మానించుకుంది.

ఆ రాత్రే మాధవరావు బట్టలు సర్ది, అత నికి కావాల్సినంత డబ్బిచ్చి "నాయనా! ఏదో పెమాదం నీకోసం పొంచుంది. అందుకే నువ్వెళ్లిపో" అని చెప్పి, అతన్ని ప్రయాణానికి సిద్ధం చేసింది.

★ ★ ★

ఆవాళ వీరంపల్లె నుంచి మనిషొచ్చి హాస్పిటల్‌లో ఉన్న పుల్లమ్మను, వీరమ్మను కలిశాడు. కోదండయ్యకు నిండా బాగలే దని, గ్రామవైద్యుడు "వయసైపోయింది. ఇంకా లాభం లేదు"అన్నాడని చెప్పాడు.

ఆ వార్త వినగానే కన్నీరుమున్నీరవు తున్న పుల్లమ్మను చూసి "పుల్లమ్మా! నా గురించి నువ్వేమీ దిగులుపడవద్దు. ఇంక ఇద్దరు మనుషుల్ని పంపిస్తానని అమ్మ చెప్పింది. నువ్వు వెళ్లి తాతని చూస్కో" అని ఆ మనిషితోబాటూ పుల్లమ్మని పంపే సింది వీరమ్మ.

కోదండయ్యకు ఆరోగ్యం బాగా లేకపో వడం వీరమ్మకు విచారాన్ని కలిగించింది. రవి గుమ్మడిదిబ్బ నుంచి ఇంకా రాలేదు.

అదేరోజున ఆదిలక్ష్మమ్మ, సుందరమణి వీరమ్మ వద్దకు వచ్చి, ఎవరూ లేనందుకు ఏమీ విచారించవద్దనీ, కానుపు వరకూ తాము ఉంటామని, పుట్టేది ఆడో, మగో తెలుసుకుని అది మగశిశువైతే తాము తీసుకెళ్లి సురక్షిత ప్రాంతంలో దాస్తామని చెప్పారు.

ఆవాళ ఉదయం నాలుగింటికే మాధ వను నిద్రలేపింది మంగమ్మ. అతను హడావిడిగా స్నానంచేసి తయారైనాడు.

"కొత్తబట్టలు వేసుకో నాయనా! చూడా లని ఉంది" అన్నదామె.

అతను కొత్తబట్టలు వేసుకుని తల్లికాళ్లకు మొక్కాడు. "అమ్మా! చెల్లాయిని జాగ్రత్తగా చూసుకో. నేనెన్నినాళ్లకు వస్తానో ఏమో!" అని చెప్పాడు.

అతనివద్ద కలకత్తాకు టిక్కెట్టు ఉంది. కర్నూలు వెళ్లి రైలు పట్టుకోవాలి. అందు వల్లే పొద్దునే ప్రయాణం.

మాధవరావుకు జీపువరకు వచ్చి వీడ్కో లిచ్చింది మంగమ్మ. ఆమె హృదయం బరువుగా ఉంది. మాధవరావుతోపాటు

సాయుధులైన నలుగురు అనుచరులూ జీపెక్కారు.

జీపు కదిలింది.

'వీణ్ణి తీసుకొచ్చి తనెంత పొరపాటు చేసింది! తనకొక కొడుకున్నాడన్న విషయం ప్రపంచానికి తెలిసేలా చేసింది. దేముడా! వీడెక్కడున్నా రచ్చించు' అని మనసులో ప్రార్థించుకుంటూ అలాగే లోగిల్లో కూచుంది.

జీపు రెండుమూడు పల్లెలు దాటి చింత కాయలదిన్నెలో ప్రవేశించింది. అక్కడింకా రోడ్డు వేయలేదు. చింతచెట్లు విస్తారంగా ఉన్నవి. వాటి మధ్యలో చిల్లచెట్ల పొదలు.

సూర్యోదయం కాలేదింకా, మసకమసక చీకట్లను ఛేదించుకుని, కాసేపట్లో వెలుగు రానున్నది.

ముసుగులు ధరించిన పదిహేను మంది దారికడ్డంగా నిలుచున్నారు... మొదట నాటుబాంబులు అటూఇటూ పేల్చారు. మాధవరావు జీపాగిపోయింది.

మాధవరావు జీపులోనుంచి తుపాకులు గురిపెట్టుకుంటూ నలుగురు అనుచరులూ దిగారు. ఆ నలుగుర్నీ మట్టుబెట్టడానికి నాలుగు నిముషాలు కూడా పట్టలేదు అవతలవాళ్లకు.

కొడవళ్లు, గొడ్డళ్లు, పిడిబాకులులాంటి వివిధ ఆయుధాలతో జీపుమీద పడి మాధవరావుని వెలుపలికీడ్చారు వాళ్లు.

"ఈడే.. ఈడే.. ఏసెయ్యండి" అని ఒకడు కేకేశాడు.

మాధవరావు దేహం మీద ఎన్ని కత్తిపోట్లు పడ్డాయో తెలియదు. క్షణంలో నేల మీదపడి గిలగిలా తన్నుకుంటూ ప్రాణాలు వదిలాడు అతను.

దూరంగా ఉండడంవల్ల ఇన్నాళ్లూ తను కాపాడుకొన్న ప్రాణాలను, చింతకాయలదిన్నెకు సంతర్పణ చేస్తూ, ఆత్మను అనంత వాయువుల్లో లీనం చేశాడు.

★ ★ ★

పురిటిమంచం మీద కళ్లు తెరిచిన వీరమ్మకు ఎవ్వరూ కనిపించలేదు.

తను నొప్పులు పడుతూండగా అప్పటి వరకు ఉన్న అత్త, ఆమె స్నేహితురాలు ఏమయ్యారా? అని ఆలోచిస్తుండగా, నర్సు లోపలికొచ్చింది.

"ఏం బిడ్డ?" ఆత్రంగా అడిగింది వీరమ్మ.

"మగబిడ్డమ్మ.. ఇడుగో" పక్కనే ఉయ్యాలలో ఉన్న ముద్దులొలికే శిశువును చూపిస్తూ చెప్పింది.

'ఏమిటీ? మగ బిడ్డా? అయితే తన అత్తగారు తీసుకెళ్లి ఉండాలే. ఏం జరి

## కొత్తగాలి...

**తెలతెల్లని**
**వస్త్రాలు!**
**'బొగ్గుమసి'తో**
**దస్త్రాలు!!**

*– జి.జి.కె. రావు,*
*శ్రీకాకుళం*

గింది? ఈ బిడ్డ ఇక్కడెందుకున్నాడు? అత్తగారూ, ఆమె స్నేహితురాలు సుందరమణీ ఏమయినారు? ఎందుకు వాళ్ల బిడ్డను తీసుకెళ్లలేదు? వాళ్ల మనసులెందుకు మారాయి?' అని ఆలోచిస్తున్న వీరమ్మకు నేనున్నానంటూ పసివాడు ఏడుపు ద్వారా పిలిచాడు.

నర్సు బిడ్డని అందించగా ప్రేమగా గుండెలకద్దుకుంది వీరమ్మ.

మమతానురాగాలు వెల్లువలైపొంగుతూ ఆమె ఆలోచనలను తుడిచి పెట్టేశాయి.

'తనూ, తన బిడ్డా శాశ్వతం' అనుకుంటూ కళ్లు మూసుకుంది వీరమ్మ.




ఆశ్రమ వాతావరణం ప్రశాంతంగా ఉంది. అర్ధరాత్రి వెన్నెల విరగ్గాస్తుండగా అతను వెలుపలికొచ్చాడు. చిన్నగా నడుస్తూ పరమయోగి కూర్చునే అరుగు సమీపించాడు. అతనికక్కడ కూర్చోవాలని పించింది. అయితే స్వామి కూచునే ఆ పవిత్రమైన స్థలంలో తనలాంటి పాపాత్ముడు కూచోకూడదు అనే ఆలోచన అతన్లో వచ్చి, అరుగుకు దిగువనే నేలపై, దానినానుకుని కూచుని ఆలోచనలో మునిగిపోయాడు.

తన తల్లి వీరమ్మ ఏం చేస్తూవుందో! ఎంత ఏడుస్తూవుందో! మంచం పట్టిన తన అమ్మమ్మ మంగమ్మ చావుబతుకుల్లో వుంది. తనను రోజుకొకసారైనా చూడందే ఆమె ప్రాణానికి ఊరట కలగదు.

తన పెళ్లయ్యి మూడు నెలలే అయింది. తన భార్య సుందరమ్మ పుట్టింటికి వెళ్లి వుంది.

తన తల్లి వీరమ్మ తనని వీరంపల్లెకు కొన్నివందల మైళ్ల దూరంలో ఢిల్లీ వద్ద ఒక చిన్న గ్రామంలో పెంచింది. అనేక సంవత్సరాలు తనకు తన తండ్రెవరో తెలియదు. అసలు బతికున్నాడో లేదో అదీ తెలియదు. తమ పోషణకు అమ్మమ్మ డబ్బు పంపించేదని అమ్మ చెబుతుండేది.

తను డిగ్రీ పూర్తిచేసి ఆర్మీలో చేరాడు. అప్పుడు తమ మకాం ఢిల్లీకి మారింది. అమ్మమ్మ మంగమ్మను మొదటిసారి తను చూసిందక్కడే. తనని చూడంగానే కన్నీరు మున్నీరైందామె. చాలా రోజులు తమతోనే ఉండిపోయింది. అమ్మ వినకుండా తనకు కొన్ని విషయాలు చెబుతుండేది. ఆమె వల్లనే తను వీరంపల్లె విషయాలు, గుమ్మడిదిబ్బకు వీరంపల్లెకూ మధ్య గల పగ, జరిగిన హత్యలు అన్నీ తెలుసుకున్నాడు.

తనలాంటి వీరుడు అజ్ఞాతంలో వుండిపోవడం, పిరికివానిలా దాక్కోవడం తనకు నచ్చలేదు.

ఆర్మీనుంచి వాలంటరీ రిటైర్‌మెంట్ తీసుకొని, వీరంపల్లెకు తల్లితో కలిసి వచ్చాడు. తన పూర్వీకులు సంచరించిన తన సొంతవూరు, సొంతగాలి, తమ పాత కాలపులోగిలి, ఆప్యాయంగా చూసుకునే గ్రామస్థులు అంతా.. అన్నీ అతని మనసు చూరగొన్నాయి.

తను ఐజీని కలిసి తమ ఇరుగ్రామాల మధ్యవున్న వైరాన్ని, జరిగిన వంశ పారంపర్యపు హత్యలను గురించి చెప్పాడు. ఐజీ గారు స్పెషల్ ఫోర్సును ఇరు గ్రామాలకూ పంపి, ఇకమీదట ఇలాంటివి జరగ్గూడదని హెచ్చరికలు కూడా ఇచ్చాడు. ఏదైనా గొడవలు జరిగితే ఆడవాళ్లనూ, పిల్లలను మూసివేయడం ఖాయమని రెండు గ్రామాలకూ తాకీదులు వెళ్లాయి. దాంతో గొడవలు చాలావరకూ ఆగాయి. అసలు ఇప్పుడు గొడవలే లేవని చెప్పవచ్చు

ఐనా తన రక్షణ కోసం చుట్టూ మనుషులుండే వాళ్లు.

ఈ తరతరాల శత్రుత్వంలో ఎందరు అసువులు బాసారో! ఎందరు అవయవాలు కోల్పోయారో! ఎందరు స్త్రీలు విధవరాండ్రయినారో.. లెక్కలేదు. పూర్వీకుల వైభవమంతా కాలంతో కదిలి వెళ్లిపోయింది. ఆస్తిపాస్తుల్లో ఎక్కువ భాగం ఆ విధవరాండ్రపోషణకూ, వారి పిల్లలను చదివించడా

నికి, వాళ్ల అభివృద్ధికీ హరించుకుపో యింది.

గుమ్మడిదిబ్బలో సమరయ్య, అతనితో బాటూ అతని అనుయాయులు ఒక్కరూ మిగల్లేదట. చివరికి సమరయ్య రెండో భార్యకున్న ఇద్దరు కొడుకులను కూడా వీరంపల్లె వాసులు పొట్టన బెట్టకున్నారట. ప్రస్తుతం ఆమె ఎవరో పిల్లవాణ్ణి సాకుతోం దట. అతనూ యువకుడైనాడట. దిక్కూ మొక్కూ లేని ఆ ఒంటరి ఆడది ఎవర్నో సాక్కోక ఏం చేస్తుంది? పాపం! కాని అతని పెళ్లీపెటాకులు చూడకుండానే ఆమె కాలం చేసింది.

తన ఇంట్లో తన ముతాత్త వీర్రాజు, తన తాత కొమర్రాజు, తండ్రి ఆది, మేనమామ మాధవరావు అందరూ ఈ శత్రుత్వపు కర్కశ కోరల్లో చిక్కుకుని బలైనవాళ్లే. చివ రికి వాళ్ల వంశంలో చివరివాడు తను శివ శంకర్రాజు మిగిలాడు.

★ ★ ★

ఆవాళ రాత్రి తను ఒక్కడే మేడపై గదిలో పడుకొని ఉన్నాడు. అమ్మా, అమ్మమ్మా విష్ణుదేవి దర్శనానికి యాత్ర వెళ్లారు. తన భార్య సుందరమ్మ యాభై కిలో మీటర్ల దూరంలో ఉన్న పుట్టింటికి వెళ్లింది. అనుచరులు కూడా అందరూ లేరు. ఏవేవో పనులమీద కొందరు వెళితే, ఇద్దరు అమ్మావాళ్లతోనూ, ఒకరు సుందర మ్మతోనూ వెళ్లారు.

ఇవన్నీ గుమ్మడిదిబ్బలో ఆదిలక్ష్మమ్మ సాకిన నరసింహయ్యకు ఎలా తెలిశాయో ఏమో!? తనూహించినట్టు శత్రుత్వాలు విస్మరించబడలేదు. కక్షలు చల్లారలేదు. నరసింహయ్య మనుషులు తమ ఊళ్లో అట్టహాసంగా జరుగుతున్న పోలేరమ్మ జాతరకు వచ్చినవాళ్లలో కలిసిపోయి ఉనట్టున్నారు. అందువల్లే తమవాళ్ళ కళ్లు కప్పగలిగారు.

ఆవాళ అర్ధరాత్రి తనపైకి పదిమంది కరడుగట్టిన నరహంతకులను పంపాడు నరసింహయ్య. తను మంచినిద్రలో ఉండగా తనఫోన్ మోగింది. తన ఇంటికి మూడో ఇంట్లోవున్న దామోదర్ ఫోన్ అది. ఇటీవల ఏర్పడ్డ తన మిత్రవర్గంలో ముఖ్యుడు దామోదర్.

“శివా! వెంటనే పారిపోయి ప్రాణాలు దక్కించుకో! వాళ్లు వచ్చేశారు” అని అత న్న వెంటనే లైను కట్టయింది.

తను కిటికీలోనుంచి చూశాడు. ఇంటి ముందువాళ్లు! వెనుక కూడా వాళ్లే! తన అనుచరులు, రక్షకులు ఏమైనారో తెలి యదు. తనకు దిక్కుతోచక ఇంటి ఎడమ పక్కన ఖాళీజాగాలో గుబురుగా పెరిగిన చిల్లచెట్లల్లో దూకేశాడు. ముళ్లుగుచ్చుకు న్నాయో, ఎముకలే విరిగాయో తెలియదు గాని తను పరుగులంకించుకున్నాడు. తను ఆ చిల్లచెట్లలో దూకుంటాడని తెలియని వాళ్లు తనను వెంబడించి రావడానికి ఒక గంటసేపైనా పట్టింది. అలా పరుగెత్తి, పరుగెత్తి తను సమీపంలోనే ఉన్న దట్ట మైన అడవిలో దూరాడు. కాలిబాటకూడా లేని దట్టమైన చెట్లమధ్య, గుబురుగా ఉన్న పొదల మధ్య తిండీతిప్పలూ, నిద్ర, విశ్రాంతి లేకుండా గడిపాడు. ప్రాణభయం నిద్రను, ఆకలిని దూరంగా తరిమేసింది. వాళ్లు తనని వదల్లేదు. అడవిలో తనకోసం గాలిస్తూ తిరుగుతున్న విషయం, శబ్దాల ద్వారా తను పసిగట్టాడు. తన అనుచరు లకు విషయం తెలిపే అవకాశంలేదు. అనేక మార్లు సొమ్మసిల్లి పడిపోయి గుబురు పొదల మధ్య అలాగే నిద్రపో యాడు. బురదగుంటల్లో నిలిచివున్న ఎర్రటి వర్షపు నీళ్ళు తాగాడు. నడక ఆప కుండా అలా నడిచి నడిచి, ఎంతదూరం సాగాడో తనకి తెలియదు. తను పడు తున్న తిప్పలకు సాక్షి ఆ నల్లమల

కొండలే!

ఒకనాడు ఒక గుబురు పొదలో తలదా చుకుని నిద్రపోతున్న తను హఠాత్తుగా మేలుకున్నాడు. తనని మేలుకొలిపింది సమీపంలో ప్రవహిస్తున్న ఒక నది నుంచి వెలువడే గలగల, ఝులఝుల శబ్దాలే! నీటిలో ఊపిరి బిగపట్టి చాలాసేపుండిపో వడం తన మిలటరీ శిక్షణలో ఒక భాగం. ప్రాణాలకు తెగించి ఆ ఏటిగట్టుకు చేరుకు న్నాడు.

ఏరు అట్టే వెడల్పులేదు. ఆ ఏటిని ఈది, అవతలి ఒడ్డుకు చేరుకోగలిగితే... ఏదో ఒక విధంగా తన ప్రాణాలకు రక్షణ దొరకవచ్చు. ఏటిగట్టుకు చేరి, నీటిలో అడుగుపెట్టాడో లేదో.. 'ధన్'మని తుపాకి పేలడం, ఒక గుండు తన ఎడమ భుజం లోకి దూసుకుపోయింది. వెంటనే తను ఏటిలోకి గెంతాడు.

ఏరు అట్టే లోతు లేదు. తను తేల కుండా, తలపైకి పెట్టి ఈదకుండా, నీటి లోనే మునిగి ఊపిరి బిగపట్టాడు. అదే సమయంలో తన ప్రాణాలను రక్షించడా నికే అన్నట్టు ఒక పశువుల మంద నీటిలో దిగి నీళ్లు తాగి ఒడ్డెక్కుతున్నది. వాటి మరుగున తనూ గట్టెక్కాడు. భుజం భయంకరంగా నొప్పి పెడుతోంది. గాయం రక్తం ఓడుతున్నదని తనకు తెలు స్తూనే ఉంది. గట్టెక్కి తూలుతూ తూలుతూ ఇక్కడ పడిపోయాడు. స్వాములు తన ప్రాణాలు కాపాడారు.

ఆలోచనల్లో గతం పునరావృతం చేసు కుంటున్న శివశంకర్రాజు తన ఎదురుగా నిలుచుని ఉన్న వ్యక్తిని గమనించలేదు. ఈ లోకంలోకి వచ్చిన శంకర్రాజు తన ముందు నిలుచున్న వ్యక్తిని చూసి తడబ డుతూ నిలుచున్నాడు.

ఆ వ్యక్తి పరమయోగి.

"నాయనా! ఈ సమయంలో నిద్రమేలు కుని ఆలోచనల్లో మునిగివున్నావు. ఆ ఆలోచనలేమిటో నేను తెలుసుకోవచ్చా? "

పరమయోగికి ఏం సమాధానం చెప్పాలో శివశంకర్రాజుకి తెలియలేదు.

తలపంకించి "నాయనా! గతాన్ని తలచు కుని బాధపడితే ప్రయోజనం లేదు. ప్రస్తుతం నీ చుట్టూవున్న పరిస్థితులను మార్చడానికి, సమస్యలను ఛేదించడానికి నీవేం చెయ్యగలవో అది చెయ్యి. వెళ్లు.. వెళ్ళి పడుకో! ప్రశాంతంగా నిద్రపో!" అన్నారు పరమయోగి.

ఆయనమాట ప్రకారం తనున్న కుటీ రంలోకొచ్చి పడుకున్నాడు శివశంకర్రాజు.

స్వామి ఆదేశమో, ఆశీర్వాదమోకాని అతనికి చాలా ప్రశాంతంగా నిద్రపట్టి, తెల్ల వారే మెలకువ వచ్చింది.

'తను త్వరగా కోలుకోవాలి. తనను తరి మికొట్టిన ఆ హంతకులెవరో కనుక్కోవాలి. దీని వెనక కథ నడిపిన ఆ నరసింహ య్యను మట్టుబెట్టగలిగితే ఇక తనకే సమస్యా వుండదు' అనుకున్నాడు.

తెల్లవారి శివానందస్వామి తనకోసం జావ తీసుకొచ్చేంతవరకూ అతనదే ఆలోచ నలో ఉన్నాడు.

'తను త్వరగా కోలుకొని... బలం పుంజుకొని... పగ తీర్చుకోవాలి' అనుకున్న ప్పుడంతా అతని ఛాతి ఆవేశంతో పైకి ఉబికేది. దవడల్లోకి వెచ్చటి రక్తం ఎగి సేది. పిడికిళ్లు బిగుసుకునేవి.

ఒకనాడు ఆ స్థితిలో అతన్ని చూసిన సదానందస్వామి 'అన్నా! నీ ముఖం అట్లా వుందేమిటి? గాయాలు బాధ గొలుపుతు న్నాయా? " అని ప్రశ్నించాడు.

"హు... గాయాలకన్నా..." అంటూ అతను అర్ధోక్తిలో ఆగిపోయాడు.

అతని వెనుక ఏదో పెద్ద కథ ఉందని సదానందస్వామి అనుమానం. 'ఏమీలేంది తుపాకీతో ఇతన్ని కాల్చవలసిన అవసరం

ఎవరికొచ్చిందిᐣ' అని మనసులో సందేహించినా కూడా అవన్నీ తవ్వి బైటికి తీసి అతన్ని మరీ బాధ పెట్టడం న్యాయం కాదనుకుని "అన్నా! అయినవారికి దూరంగా ఇలా బాధలు పడడం విచారకరమే. అయినా మనిషి కర్మబద్ధుడు. ఎంత నుదుటిమీద రాస్తే అంత అనుభవించక తప్పదు కదా! నీ అదృష్టం బాగుండి స్వామి చెంత చేరావు. నీకంతా మేలే జరుగుతుంది. ఏమీ బాధపడకు" అన్నాడు.

"బాధపడకుండా ఎలా ఉండగలను స్వామీᐣ" అన్నాడు శివశంకర్రాజు.

"అన్నా! మేమంతా మొదట్లో అట్లా అనుకున్నవాళ్లమే. మేమంతా కూడా భరించలేని బాధలనుభవించి తర్వాత ప్రాపంచిక జీవితాన్ని వీడి, ఇక్కడ చేరిన వాళ్ళమే. కాని జీవితాన్ని, సృష్టిమాయను అర్థం చేసుకున్నాక ఆ బాధలన్నీ మన మెడలో పూలమాలలవలె అనిపిస్తాయి. ఆశ్చర్యంగా లేదా అన్నాᐣ అంతవరకూ అవి మెడకు చుట్టుకున్న సర్పాల్లా బాధిస్తాయి. కాని ఒక్కటి మాత్రం నిజమన్నా! ప్రతి మానవుడూ తను అనుభవించే బాధలకు తనే కారణభూతుడు. అరిషడ్వర్గాలను జయించిన వారికి అంతటా శాంతే" అన్నాడు స్వామి.

పదిరోజుల తర్వాత శంకర్రాజు దేహం మీది చీరికలు చారికల్లా మారాయి. భుజంపై గుండు దూసుకుపోయిన గాయం మాత్రం సలుపుతోందింకా. 'తన శత్రువులు తను మరణించినట్టు భావించి ఉంటారు' అనుకోసాగాడతను.

★ ★ ★

అతను తనున్న పరిసరాలు గమనించసాగాడు. ఆశ్రమంలో స్వామితో, తనతో కలిపి పదహారు మందిమాత్రం ఉన్నారు. పరమయోగి ఎప్పుడూ పెద్దపెద్ద పుస్తకాలు చదువుతూ, ఏదో రాసుకుంటూ ఉంటాడు. లేదంటే యోగముద్రలో కాలం గడుపుతుంటాడు. ఆయన వయసు ముప్ఫైలోపే. ఆయన ఈ ప్రాంతానికొచ్చి ఆరేళ్లయిందట. ఆయన అసలు పేరుకాని, ఊరుకాని ఎవరికీ తెలియదు. ఆయనెవరికీ తన పేరు 'పరమయోగి' అని చెప్పలేదు. అది ప్రజలు పెట్టిన పేరే! శిష్యులు కూడా బాగా చదువుకున్నవారిలా కనిపిస్తుంటారు. పరమయోగి మొఖంపై జ్ఞానం, లోతైన ఆలోచనలతో సమ్మిళితమైన వింత తేజస్సు గమనించాడు శంకర్రాజు. తనతో ఆయన నాలుగైదు సార్లు మాత్రం మాట్లాడాడు. ప్రతిసారి 'ఇప్పుడు వంట్లో తేలిగ్గా ఉందా నాయనాᐣ' అని అడుగుతుంటాడు. తనకన్నా వయసులో ఆయన చిన్నవాడు. అయినా జ్ఞానంలో తనకన్నా చాలా గొప్పవాడు గనక తన హృదయం ఆయన పెద్దరికం ముందు మోకరిల్లుతున్నది.

ఆశ్రమానికి సమీపాన 'కురవపల్లె' అనే గ్రామం ఉంది. మొదట పరమయోగి ఆశ్రమం మధ్యలో ఉన్న చెట్టుకింద ధ్యానం చేసుకుంటూ, పక్కనే ఉన్న ఏటిలో నీళ్లు తాగి జీవించేవాడట. ఆకలైతే అడవిలో తిరిగి కలే పళ్లు, బిక్కి పళ్లు, బంక పళ్లు ఇంకా రేగి, ఈత లాంటి వాటి ఫలాలనూ తినేవాడట. అది గమనించిన కుర

## కొత్తగాలి...

**పైరులకు**
**పురుగు మందులు**
**పొరులకు**
**మత్తుమందులు**

– అంబటి వెంకటశివారెడ్డి,
యర్రగుంట్ల

వపల్లెవాళ్లు ఆయనకు కుటీరం నిర్మించి ఇచ్చారట. ఆయన చిన్ననాటి నుంచీ, వేదాంతం, తాత్వికత లాంటి అంశాలలో తన ఆలోచనలు పండించుకున్నాడు. పరిణతి చెందిన మేధస్సు సంఘ జీవనాన్ని తృణీకరించమంది. అలౌకికతను కౌగలించుకున్న మనసు ఏకాంతాన్ని కోరింది. తత్ఫలితమే ఈ ఆశ్రమ జీవనం.

ఆశ్రమ వాసులంతా ఒళ్లు దాచుకోకుండా పని చేసుకునేవాళ్లే. వాళ్లు ఏట్లో నుంచి నీళ్లు మోస్తారు. ఆశ్రమం వెనుకనున్న తోటను తడుపుతారు. వెనక నున్న అరటితోటకు ఏటినుండి నీరుపారే విధంగా కాలువ తవ్వారు. అరిటాకులు భోజనం తట్టలుగా, అరటిపళ్లు రాత్రి ఆహారంగా ఉపయోగిస్తారు. ఆశ్రమంలో ఆవులు కూడా ఉన్నాయి. పదింట్లో ఆరు ఆవులు పాలిస్తాయి. మధ్యాహ్నాలప్పుడు అడవిలో పచ్చిగడ్డి చెక్కి, వాటికి మేత వేస్తారు. మధ్యాహ్నం బియ్యం, పప్పు, అక్కడ లభించే రకరకాల ఆకుకూరలు, కాయగూరలు అన్నీ కలిపి వండిన సాత్వికాహారాన్ని భుజిస్తారు.

స్వామి రాసే కాగితాలకు, సుబ్రహ్మణ్యస్వామి అనే శిష్యుడు పుస్తక రూపం కల్పిస్తాడు. కర్నూలు వాళ్లు వాటిని అచ్చువేసి, ఆ డబ్బు ఆశ్రమానికి పంపుతారు. ఆశ్రమానికి కావాల్సిన పప్పూ, ఉప్పూ, బియ్యం కొనడానికి ఆ డబ్బులు మినహా మరే ఇతర ఆదాయమూ లేదు. ఆయన మత బోధ చేసిగాని, అద్భుతాలు చేయగలనని గానీ ఎవరినీ నమ్మించడు.

'మనిషి తను ఏది కాదో అలా ఉండడానికే ప్రయత్నిస్తుంటాడని, అందుకని అతను తనలోకి తను తొంగిచూసుకుని మొదట తనేమిటో తెలుసుకోవాలని, దాని తర్వాత అతను తెలుసుకోతగ్గది ఏదీ లేదనీ' ఆయన తాత్వికత యొక్క సారాంశం.

అందరూ శ్రమించాల్సి రావడంతో, అక్కడ సోమరిపోతులకు స్థానం లేకుండా పోయింది. అక్కడ ఒకపూటే తిండి దొరుకుతుంది గనుక వేదాంతుల్లా, స్వాముల్లా నటించే సోమరిపోతులకు స్థానం లేదు. మూలధనం పోగేయలేదు గనక, సర్వసంగ పరిత్యాగుల్లా నటించే ఆశబోతులు అక్కడ మకాం వేయడానికి ఆస్కారం లేదు.

శంకర్రాజు మిలటరీ నుంచి వచ్చిన కొత్తల్లో అతన్లో ప్రతీకారవాంఛ లేదు. పగ లేదు. ఎవరితోనూ శత్రుత్వం లేదు. కాని ఇప్పటి పరిస్థితులు వేరు. తనమీద దాడి తర్వాత ఇక అతను వూరుకోదలచలేదు. 'శాంతిని కోరే దేశాలు కూడా శత్రుదాడిని ఎదుర్కోవాలి కదా!' అనుకునేవాడు శంకర్రాజు.

'తను ఎలాగైనా పుట్టింటికి వెళ్లివున్న తన భార్య సుందరమ్మకు ఫోను చేయాలి. ఆమె ద్వారా ప్రాణభయంతో పారిపోయిన తన అనుచరులను పోగుచేయాలి. మచ్చు కత్తులు, పిడిబాకులు, నాటు బాంబులు, పిస్టళ్లు లాంటి ఆయుధాల సేకరణ విస్తారంగా జరిపించాలి. తనప్పుడే ఆశ్రమం నుంచి వెళ్లకూడదు. వెళితే తన ప్రాణాలకు ముప్పు తప్పదు' అనుకున్న శంకర్రాజు ఆశ్రమ వాసులతో కలిసి పనిచేస్తూ, అవకాశం కోసం ఎదురు చూడసాగాడు.

అతని మనసులో రేగే ఉద్వేగపు ఆలోచనలు అతని కళ్లద్వారా బయల్పడుతుండేవి.

ఒకనాడతను దూరంలో ఉన్న నల్లమల పర్వత శ్రేణి కేసి చూస్తూ, తన భవిష్యత్ ప్రణాళిక గురించి ఆలోచిస్తున్నాడు. అతని కళ్లల్లోంచి వెలువడే ప్రతీకార జ్వాలలు, ఆ కొండలను దగ్ధం చేస్తాయేమో అనిపిస్తున్న వేళ, పరమయోగి వచ్చి అతని దాపున

నిలుచున్నాడు. ఆ విషయం శంకర్రాజు గమనించలేదు. ఆయన్ని చూసి హఠాత్తుగా లేచి నిలుచున్నాడు. అప్పుడు స్వామి "నాయనా భౌతికంగా నీకు ఆరోగ్యం, సమకూరినా, నీ మనోజ్వాలలు మాత్రం ఆరని చితిలా జ్వలిస్తూనే ఉన్నవి. నీ మనసు త్వరలో శాంతిస్తుంది. అప్పటి వరకు నువ్విక్కడ ఉండక తప్పదు. ఎందుకంటే నిన్ను ఒక సంపూర్ణ మానవునిలా తప్ప వేరే విధంగా వెలుపలి ప్రపంచంలోకి పంపలేను" అని చెప్పి, అక్కణ్ణుంచి వెళ్లిపోయాడు.

పరమయోగి మాటలకు నిశ్చేష్టుడయ్యాడు శంకర్రాజు. 'తన స్థితిని ఇంత కచ్చితంగా ఎలా చెప్పగలిగాడీయన? తనకు తర్వాలో మనశ్శాంతి లభిస్తుందట. అంటే ఆ నరసింహయ్య చావు దగ్గర్లోనే ఉందన్నమాట!" అనుకుని విపరీతంగా ఆనందపడిపోయాడు.

ఈ ఆశ్రమానికి దాదాపు యాభై కిలోమీటర్ల దూరంలో 'స్వామీ సచ్చిదానంద' ఆశ్రమం ఉంది. రాయలసీమ వాసులేగాక సర్కారు జిల్లాలవాళ్లు గూడా ఈ బాబాకు శిష్యులే. వాళ్లలో వ్యాపారులు, రాజకీయవేత్తలు, కాంట్రాక్టర్లులాంటి బడాబాబులున్నారు. బాబాకు ముడుపుల సమర్పణ చాలా ఎక్కువగా జరుగుతుంటుంది. ఇప్పటికే స్వామి సచ్చిదానంద బ్యాంకు బ్యాలెన్సు కొన్ని కోట్లుందని ఈ మధ్య పేపర్లు, టీవీలు ఏకాయి. ఆశ్రమాన్ని దర్శించి, స్వామి ఆశీర్వాదం కోరుకునే భక్తులు స్వామికి నెయ్యి నైవేద్యంగా సమర్పించాలి. అందుకే ఆ ఆశ్రమంలో వంటలన్నీ నేతితోనే చేస్తారు. వచ్చిన భక్తులను స్వామి, చెయ్యి వెల్లికిలా తిప్పి, ఆశీర్వదిస్తారు. ఇది ఆయన పద్ధతి.

ప్రజలు ఎల్లకాలం మూర్ఖులుగానే ఉండరు. గొర్రెదాటు వ్యవహారం కలకాలం సాగదు. సచ్చిదానంద స్వామికి ముడుపులు సమర్పించేకంటే, పరమయోగీశ్వరుని దూరం నుంచి దర్శించుకుంటేనే, పనులు విజయవంతమవుతాయన్న నిర్ణయానికి వచ్చేశారు ప్రజలు. సచ్చిదానంద స్వామి ఆశ్రమానికి భక్తుల రాక గణనీయంగా తగ్గింది. కోపించిన స్వామి కార

## వారో లెక్కా నాకు?

డా. జాన్సన్ ఆక్స్‌ఫర్డ్ యూనివర్శిటీ నుంచి నేరుగా చదివి డిగ్రీ పొందలేకపోయారు. అయినా ఆయన సాహిత్యకృషిని గుర్తించిన ఆ విశ్వవిద్యాలయం మాస్టర్ ఆఫ్ ఆర్ట్స్ డిగ్రీని



జాన్సన్‌కు ఇచ్చింది. ఆక్స్‌ఫర్డ్ యూనివర్శిటీ అంటే ఆయనకు వల్లమాలిన అభిమానం ఏర్పడింది.

ఒకరోజు లేడీ పియాజీ ఇంట్లోని ఓ గదిలో కేంబ్రిడ్జి యూనివర్శిటీ నుంచి వచ్చిన ఐదు మందితో జాన్సన్ మాట్లాడుతూ ఆక్స్‌ఫర్డ్ గొప్పతనాన్ని సోదాహరణంగా, విజయవంతంగా వారికి వివరించారు.

ఆక్స్‌ఫర్డ్ ఎలాంటి మేధావులను ఉత్పత్తి చేసిందో తన అనర్గళ ప్రసంగంలో ఉటంకించారాయన.

'గదిలో ఐదుగురే కేంబ్రిడ్జివాళ్లు ఉన్నారు కదా? అంతసేపు వారితో ఏం మాట్లాడారు?' అని లేడీ పియాజీ అడిగింది.

దానికాయన, 'ఔనా? వారు ఐదుగురే ఉన్నారా? నేను ఆ సంగతి గమనించనే లేదు. అయినా తోడేలు ఎక్కడైనా తనవద్దకు గొర్రెలెన్ని వచ్చాయో లెక్కపెట్టుకుంటుందా?' అన్నారు నవ్వుతూ.

ణాలు అన్వేషించగా పరమయోగే కారణంగా కనిపించి, అతనిపై ద్వేషం పెంచుకున్నాడు. పరమయోగి ఆశ్రమంలో చట్ట వ్యతిరేక చర్యలు జరుగుతున్నట్టు ప్రచారాలు చేయించాడు. ఈ ప్రచారాలు ఎవరూ నమ్మకపోవడంతో అతని కక్ష ఇంతింతై మహా వృక్షమైంది. పరమయోగిని దెబ్బతీయడానికి అనువైన అవకాశం కోసం ఎదురుచూడసాగాడు.

శంకర్రాజు ఆ ఆశ్రమంలో మూడు నెలలున్నాడు. మద్యం, మాంసాహారం, వేళకు తగ్గ ఆహారం లేక మనిషి సన్నబడ్డాడు. జుట్టు, గడ్డం బాగా పెరిగి, అతను సహజమైన మారువేషంలోకి మారాడు. ఒకనాడు కురవపల్లెకు వెళుతున్న శివానంద స్వామితో వెళ్లి, అక్కడున్న ఒక పబ్లిక్ బూత్ నుంచి తన భార్యకు ఫోన్ చేశాడు. దానికి డబ్బులు కూడా శివానంద స్వామే ఇచ్చాడు.

అందరూ తన భర్త మరణించాడంటున్నా కూడా అతను బతికున్నాడన్న నమ్మకంతో బొట్టు, గాజులూ తీయని సుందరమ్మ నమ్మకం, ఇప్పుడు అఖండ జ్యోతిలా 'నిజం'గా మారింది. ఆమెకు చెప్పవలసినవన్నీ చెప్పి తను బతికున్న విషయం పొరపాటున కూడా ఎవరికీ చెప్పవద్దని ఫోను పెట్టేశాడు.

సుందరమ్మ మొదట విశాఖపట్టణం ప్రాంతంలో తిరుగుతున్న 'రాఘవులు' అనే శంకర్రాజు ముఖ్య అనుచరుణ్ణి పట్టుకోగలిగింది. 'అన్న' బతికున్నాడన్న వార్త తెలియగానే రాఘవులు పరమానందభరితుడై మిగతా అనుచరులను వెదుకుతూ, ఆయుధాలు సమకూర్చుకోసాగాడు.

కురవపల్లెలో దాదాపు ఇరవైమంది వృద్ధులున్నారు. కొందరు దిక్కులేనివాళ్లు, మరికొందరు బిడ్డలచే తృణీకరించబడ్డ వాళ్లు. వాళ్లు ఆశ్రమానికొచ్చి అడుక్కోవడం గమనించిన పరమయోగి తనను చూడవచ్చిన కురవపల్లె పెద్దలతో ఆ వృద్ధులకు ఒక ఆశ్రయం కల్పించమని కోరాడు. యుద్ధప్రాతిపదికపై అందుకు ప్రయత్నాలు జరిగాయి. ప్రెసిడెంటుగారి పాత ఇల్లొకటి రిపేరు చేయించి 'ఆశ్రమం' అన్నారు. ఊళ్లోవాళ్లు వృద్ధులకు కావాల్సిన వస్తువులన్నీ విరాళాలుగా ఇచ్చారు. కొందరు నెల నెలా ఉప్పు, పప్పు, బియ్యం ఇస్తామని మాట ఇచ్చారు. వృద్ధులకు సేవ చేయడానికి, వంటకు పనివాళ్ళను కుదిర్చారు. అంతా పూర్తయినాక ఆ ఆశ్రమాన్ని లాంఛనప్రాయంగా ప్రారంభించవలసిందిగా పరమయోగిని కోరారు.

వారి కోరిక కాదనలేక పరమయోగి ఆ వాళ ఉదయం పది గంటలకు మిగతా స్వాములతో సహా కురవపల్లి చేరాడు. అక్కడంతా చాలా కోలాహలంగా ఉంది. ప్రెస్ వాళ్లు, టి.వి. వాళ్లు కూడా హాజరౌతున్నారు. యోగి వేదిక సమీపిస్తుండగా ఒకతను జనం మధ్యలో నుంచి పిడిబాకుతో దూసుకువచ్చి స్వామినొక్క పోటు పొడిచాడు. ఆ పోటు గురితప్పి ఆయన పొట్టలో ఒక పక్క గుచ్చుకుంది. క్షణంలో దాడిచేసిన వ్యక్తి మీదికి లంఘించి అతన్ని ఒడిసి పట్టుకున్నాడు శంకర్రాజు. ఇదంతా కెమెరాలు బంధించాయి.

తెలివి తప్పిన స్థితిలో ఉన్న పరమయోగిని ఆశ్రమం లోపలికి చేర్చారు. నిత్యానంద స్వామి గాయానికి కట్టుకట్టి రక్తస్రావం ఆపగలిగాడు. ఆ తర్వాత చికిత్స ప్రారంభించాడు.

గంట తర్వాత యోగి స్పృహలోకొచ్చాడు. హత్యా ప్రయత్నం చేసిన వ్యక్తిని పోలీసులు స్వామి ముందుకు తీసుకొచ్చారు. వాళ్లు ఎఫ్.ఐ.ఆర్ ఫ్రేం చేయడానికి యోగి స్టేట్‌మెంట్ కోసం ఎదురుచూస్తున్నారు. వాళ్లని బైటికి వెళ్లవలసిం

దిగా కోరాడు యోగి. పైగా "నన్ను పొడి చింది ఇతను కాదు. దయచేసి ఇతన్ని వదిలెయ్యండి" అన్నాడు.

నేరస్తునితో సహా అందరూ నిశ్చేష్టులై నారు. వణికిపోతున్న ఆ నేరస్తుని దగ్గ రగా పిలిచి యోగి "నాయనా! ఎందుకలా వణికిపోతున్నావు? భయపడకు. నీకేం భయం లేదు" అంటూ తన కోసం తెచ్చిన వేడిపాలు ఆ వ్యక్తికిప్పించాడు. అతనిలో పేరుకున్న మలినాన్ని, యోగి దయా, కరుణా క్షణంలో కరిగించాయి. అవి కన్నీళ్లై అతని కళ్ల వెంబడి ధారగా కారుతు న్నాయ్.

వేడిపాలు తాగడం వల్ల అతనికి చెమ టలు పట్టాయి. అది పశ్చాత్తాప జలమో, స్వేదజలమో అర్థంకావడం లేదు.

ఉన్నట్టుండి అతను యోగి కాళ్ల మీద పడి భోరున ఏడవసాగాడు "చమించండి సామీ.. చమించండి. బుద్ధి గడ్డితిని, ఆ సచ్చిదానంద సామి మాటలిని... నీచుణ్ని, దుడ్డుకోసం ఆశపడి..." అంటుండగా యోగి అతన్ని వారిస్తూ "నాయనా! దుడ్డు కోసం ఆశపడ్డానని, నీచుణ్ణని నువ్వే అంటున్నావు. ఒకర్ని నిందించడం ఎందుకు? తన తప్పులకు, ప్రలోభాలకు ఇతరుల్ని బాధ్యులుగా చేయరాదు" అంటూ పంపించివేశాడు.

ఒక పక్కగా నిలబడి చూస్తున్న శంక ర్రాజుకు ఇదంతా కలో, నిజమో అర్థం కాలేదు.

తనెన్నడూ ఎరుగని ఒక కొత్త ప్రపం చాన్ని పరమయోగి ఆశ్రమంలో చూశాడు. ఇప్పుడు పరమయోగిలో తనెన్నడూ చూడని ఒక మహా మనిషిని చూస్తు న్నాడు. అతని మనసు అనిర్వచనీయమైన ఒక అనుభూతితో నిండిపోయింది. అత్యు న్నతమైన మానవతా విలువలను అతడు మొదటిసారిగా చూశాడు.

మరుసటి దినం ఈ సంఘటన గురించి ఫొటోలతో సహా అన్ని పేపర్లలో అచ్చువే శారు. పదేపదే ఈ సంఘటనను టీవీ ఛానెల్స్‌లో చూపారు. ఈ రెండూ లేకపోవడం వలన ఆశ్రమ వాసులకు ఈ విషయం తెలియకపోయింది.

పరమయోగికి తగిలిన గాయం అంత లోతైనది కాకపోవడంతో, ఆయన త్వర గానే కోలుకున్నాడు. ఆయన శంకర్రాజులో కొట్టొచ్చినట్టున్న మార్పు గమనించాడు. శంకర్రాజిప్పుడు మిగతా వాళ్లతో కలిసి వేదాంత ప్రసంగాలు శ్రద్ధగా వింటు న్నాడు. తాత్విక చర్చల్లో పాల్గొంటు న్నాడు. ఇంతకు ముందులా గిరిగీసుకొని

## కొత్తగాలి...

**ఎవరయినా..**
**అందంగా ఎదగొచ్చు**
**అందుకు సాక్ష్యంగా..**
**సీతాకోక చిలుకను చూడొచ్చు**

– పి.వి. రమణకుమార్,
చిలకలూరి పేట

లేడు. అందరికీ తలలో నాలుకలా తయా రయినాడు. 'మనిషి ముఖం అతని మన సుకద్దం పడుతుంది' అన్న నానుడి ప్రకారం అతని కళ్లలో ఇప్పుడు ఎర్రజీరలు లేవు. ప్రతీకారవాంఛతో మొఖం జేవురించ డం లేదు. చాలా ప్రశాంతంగా ఉందా ముఖం.

★ ★ ★

ఆవాళ శంకర్రాజు, నిత్యానంద స్వామితో కలిసి వంటశాల ముందు కూచుని, అరిటాకులు చీలుస్తున్నాడు. అతని కళ్లు మాటిమాటికి చెమ్మగిల్లుతు న్నాయి. అది గమనించిన నిత్యానందుడు

"అన్నా? నీ కళ్లెందుకలా మాటిమాటికి చెమ్మగిల్లుతున్నాయి? " అని ప్రశ్నించాడు.

"ఏం లేదులే నిత్యానందా!"

"సరే అన్నా! ఇష్టంలేకపోతే చెప్పొద్దులే"

"అలాంటిదేమీ లేదు నిత్యానందా! మా మామయ్యకు ఈ అరిటాకు భోజనం చాలా ఇష్టమని మాఅమ్మ చెబుతుండేది"

"అట్లా అయితే నువ్వెళ్లేటప్పుడు బోలెడన్ని తీసుకెళ్లవు గానిలే"

"తీసుకెళ్తే, ఆయన సమాధి మీద వెయ్యాల్సిందే"

"ఆఁ! అదేమిటి? "

"అవును నిత్యానందా! మా తాతల కాలంలో మా వీరంపల్లెకు, పక్కగ్రామం గుమ్మడిదిబ్బకు మొదలైన కక్షలు వంశపారంపర్యపు కక్షలుగా, పగలుగా ఇంకా కొనసాగుతున్నాయి. నా పూర్వీకులంతా వీటికి బలైనవాళ్లే"

"అంటే అన్నా! గుమ్మడిదిబ్బవాళ్లంత దుర్మార్గులా? "

"మేం కూడా తక్కువైనోళ్లం కాదు నిత్యానందా! ఇక్కడ లేచిన ప్రతి శవానికి బదులుగా గుమ్మడిదిబ్బలో రెండు శవాలను లేపే వాళ్లు వీరంపల్లె వాళ్లు. ఇందులో భాగంగానే స్కూల్ నుంచి వస్తున్న అమాయకమైన ముక్కుపచ్చలారని బాలుణ్ని నిర్దాక్షిణ్యంగా నరికేశారట. వాళ్లు మా చిన్నతాత మనవణ్ణి.. ఆరేళ్లవాణ్ణి పొట్టన బెట్టుకున్నారట. నేను ఆర్మీలో ఉండేవాణ్ణి. మా తల్లి నన్ను రహస్యంగా సాకింది. నేను ఆర్మీ నుంచి వచ్చాక, ఇక ఈ హత్యాకాండ కూడదని ఎన్నో చేశాను" అంటూ ఇటీవల తనపై జరిగిన దాడి, తుపాకీ దెబ్బ తిన్న తను ఈ ఆశ్రమానికొచ్చిన సంగతీ అంతా విపులీకరించాడు.

అంతావిన్న నిత్యానందస్వామి నిర్ఘాంతపోయాడు.

మళ్లీ మొదలుపెట్టి చెప్పసాగాడు శంకరాజు.

"ఇక్కడికొచ్చిన కొత్తలో నేను కూడా ప్రతీకారంతో రగిలిపోయేవాణ్ణి. కాని ఇక్కడి వాతావరణం, పరమయోగి ఆవాళ కురవపల్లెలో తనపై హత్యా ప్రయత్నం చేసినవాణ్ణి క్షమించడమేకాక, ఎంతో కరుణతో అతన్ని ఆదరించడం, ఇవన్నీ నాపై విపరీతమైన ప్రభావాన్ని చూపి, నా మనసును ప్రక్షాళనం చేశాయి. నేనిప్పుడు చాలా ప్రశాంతంగా బతుకుతున్నాను. నిజానికి ఈ ఆశ్రమపు గాలిపీల్చే అర్హత కూడా నాకు లేదు" అంటూ ఆపాడు.

అతన్లో వచ్చిన మార్పు నిత్యానందస్వామిని సంతోషంలో ముంచెత్తింది. శంకరాజు మళ్లీ మొదలెట్టాడు.

"ఇంతాచేసి మా వీరంపల్లె వాళ్లుగాని, ఆ గుమ్మడిదిబ్బవాళ్లుగాని సాధించిందేమీలేదు నిత్యానందా! అయిన వాళ్లందరినీ పోగొట్టుకున్నాం. ఎందరో స్త్రీలు విధవరాళ్లైనారు. ఎందరో పిల్లలు తండ్రులను పోగొట్టుకున్నారు. ఆస్తిపాస్తులు హరించుకుపోయాయి. మమ్మల్నే నమ్ముకున్న అయినవాళ్లూ, అనుచరులూ బలైపోయారు. మా తాత, తండ్రుల్లా మేం కూడా అనుక్షణం ప్రాణభయంతో మగ్గుతున్నాం" చెబుతున్న శంకరాజు కళ్లల్లో ధారాపాతంగా నీరు కారుతున్నది.

నిన్న పగతో, కక్షతో రగిలిన అతని గుండె నేడు పశ్చాత్తాపంతో ఎగసిపడుతోంది.

నిత్యానందస్వామి కళ్లల్లో కూడా నీళ్లు తిరిగి చెంపలు తడిశాయి.

మళ్లీ మొదలుపెట్టాడు శంకరాజు "నేనొక నిశ్చయానికొచ్చాను నిత్యానందస్వామీ! రేపే బయల్దేరి వెళ్లి నరసింహయ్య ముందు నిలబడతాను. - అన్నా! నీ ప్రతీకారం, పగ, నాపైనే కదా. నన్ను బలితీసుకో. ఇదుగో నా ప్రాణాలు నీ

పాదాల ముందు పరుస్తాను. ఐతే మన ఇరు గ్రామాల్లో ఇదే చివరి హత్య కావాలి. ఈ మారణహోమం ఇంతటితో ఆపన్నా- అని కాళ్లు పట్టుకొంటాను. మా తర్వాతి తరాలవాళ్లైనా సుఖంగా బతికే వీలుంటే చాలు. నరసింహయ్య, అతని పిల్లలూ చల్లగా ఉండాలి" అంటూ భోరున ఏడ్చాడు శంకర్రాజు.

అతని ఏడుపుకు కారణం అతన్లో కలిగిన పశ్చాత్తాపం. అది ఆ పశ్చాత్తాపం రగిల్చిన దుఃఖమేగాని వేరొకటి కాదని నిత్యానందస్వామి అర్థం చేసుకుని ఇలా అన్నాడు.

"అన్నా! అంతపని చేయకు. అతని మనఃప్రవృత్తి తెలిసికూడా..."

"అతని మనఃప్రవృత్తితో నాకేంపని స్వామీ? నా చావేగా అతనికి కావల్సింది? నన్ను చంపడమేగా అతని జీవిత ధ్యేయం! అతని కోరిక నెరవేర్చుకోనీ" అని శంకర్రాజు అంటుండగానే వంటశాల వెనక నుంచి ముసుగువ్యక్తి వాళ్ళ ముందుకొచ్చి నిలుచున్నాడు. అతని చేతిలో పిస్టల్ నల్లగా మెరుస్తోంది. నిర్లక్ష్యంగా వదలడం వల్ల అతని ముసుగు జారిపోయింది.

అతను నరసింహయ్య!

అతన్ని చూడగానే దిగ్గున నిలుచున్నాడు శంకర్రాజు.

"అన్నా! నరసింహయ్యా! వచ్చేశావా? కాగల కార్యం గంధర్వులే తీరుస్తారన్నట్టు, నువ్వే వచ్చేశావు. ఇప్పుడే నేను ఈ స్వామితో చెపుతున్నాను ఆ విషయం. నాకూ శ్రమ తగ్గించావు. ఇంకా సందేహిస్తావెందుకన్నా? నీ పిస్టల్‌కు పని చెప్పు. నా ప్రాణం నీది. నిరభ్యంతరంగా తీసుకో. ఐతే నా చావుతో మన ఇరుగ్రామాల శత్రుత్వానికి తెరపడాలి. నువ్వూ నీతోపాటూ ప్రజలందరూ మనశ్శాంతితో బతకాలి" అన్నాడు చేతులు జోడించి.

అలా శంకర్రాజు రెండడుగులు ముందుకు వేయగానే నిత్యానందస్వామి, శంకర్రాజుకు అడ్డంగా నిలబడి "అయ్యా! ఇతని ప్రాణాలు తీసేముందు, నా ప్రాణాలు తియ్యి" అన్నాడు.

"నిత్యానంద స్వామీ! ఒక మహోన్నతునికి శిష్యుడవైన నీవు, ఇంత ఔదార్యం చూపడంలో ఆశ్చర్యం ఏముంది? కానీ నీ ఔదార్యానికి నేను తగను. నాలాంటి పాపి కోసం పవిత్రమైన నీ ప్రాణాలు పోగొట్టుకోడం నేనెంతమాత్రం సహించను" అంటూ అతన్ని పక్కకి నెట్టాలని ప్రయత్నించాడు శంకర్రాజు.

ఇదంతా నివ్వెరపోయి చూస్తున్నాడు నరసింహయ్య. అంతదూరం నుంచి ఇదంతా చూసిన శివానందస్వామి ఈ విషయం పరమయోగికి చెప్పాలని లోపలికి పరుగెత్తాడు.

నరసింహయ్య ఎలాగో గొంతు పెగుల్చుకుని "అయ్యా! మీరిద్దరూ అలా ఒకర్నొకరు నెట్టుకోనవసరం లేదు. నేనెవర్నీ చంపబోవడంలేదు" అన్నాడు.

అతని చేతిలో పిస్టలు జారి, మట్టిలో పడిపోయింది.

అతను మోకాళ్లమీద కూలబడి, చేతుల్లో ముఖం దాచుకుని, గట్టిగా ఏడవడం మొదలుపెట్టాడు. పశ్చాత్తాపానికి చివరిదశ కన్నీరే!

అది చూసిన శంకర్రాజు కూడా ఆశ్చర్యపోతూ అతన్ని సమీపించి తానూ కింద కూచుని "అన్నా, ఏమిటలా అయిపోయావు? ఏడుస్తున్నావెందుకు? ఇదుగో నీ పిస్టల్! ఎలా మట్టి అంటుకుందో చూడు. నేను దీన్ని తుడిచి ఇస్తాను" అంటూ కింద పడ్డ పిస్టల్ ఎత్తి తుడవసాగాడు.

నరసింహయ్య ఆ పిస్టల్ లాక్కుంటూ "నేన్నిన్ను చంపలేను రాజూ. నిన్నే కాదు.. ఇంకెవర్నీ కూడా చంపలేను" అన్నాడు

వెక్కిళ్లమధ్య.

టీవీలో శంకర్రాజును గుర్తుపట్టిన నరసింహయ్య అతనింకా సజీవుడని తెలుసుకుని అతని ఆచూకీ కనుగొనడానికి ప్రయత్నించాడు. అతని ప్రయత్నం ఫలించింది. శంకర్రాజు పరమయోగి నీడలో ఉన్నాడని తెలుసుకొని, రెండు దినాల క్రితమే కురవపల్లె చేరి, అవకాశం కోసం వేచి చూడసాగాడు. అంతకు రెండు గంటల క్రితమే ఆశ్రమం చేరి, వంటశాల వెనక దాక్కుని శంకర్రాజుకు, నిత్యానందునికీ మధ్య జరిగిన సంభాషణంతా విన్నాడు.

ఆ మాటలు అతనిలో అనుకోని పరిణామానికి ప్రమాణాలయినాయి. 'తను సుఖంగా, ప్రాణాలతో ఉండాలంటే శత్రువుని మట్టుబెట్టడం ఒకటే మార్గం. పైగా మూడేళ్ల కొడుకున్నాడు. భార్య మళ్లీ గర్భవతి. వీళ్లందరి ప్రాణాలు పదిలంగా ఉండాలంటే ముందు శత్రుశేషం లేకుండా చూసుకోవాలి' అనే ఉద్దేశంతో అక్కడికొచ్చిన అతన్లో పగ, ప్రతీకారం తుడిచిపెట్టుకుపోయాయి.

గ్రామాల్లో శాంతి నెలకొల్పడానికి తన ప్రాణాలను పణంగా పెట్టదలచిన శంకర్రాజుపై అతనికి ప్రేమాభిమానాలు కలిగాయి.

అంతదూరంలో నిలుచుండి చూస్తున్నాడు పరమయోగి. నరసింహయ్య కింద కూలబడడం, ఏడుస్తున్న అతన్ని ఊరడిస్తూ శంకర్రాజు 'నన్ను చంపుకో అన్నా' అంటూ ఉండడం ఆయన చూస్తున్నాడు.

'ఆహా! మనిషి మనసు ఎంత చిత్రవిచిత్రాలు. ప్రతిబింబించే అద్దం! క్షణంలోనే చీకటి, మరుక్షణంలో వెలుగు చూపడం మనసుకే చెల్లు. పశ్చాత్తాపం మనిషికొక వరం. అది జీవితాలలో ఎటువంటి మార్పునైనా తేగలదు. ఈ సమయంలో తను అక్కడికి వెళ్లకుంటేనే మంచిది. పాపాలకు ప్రక్షాళన జరుగుతూ ఉంది' అనుకుంటూ సమీపంలో అరుగుమీద కూచున్నాడు. ఎందుకో ఆయన కళ్లు కూడా చెమ్మగిల్లి ప్రపంచం మసకమసగ్గా కనిపించసాగింది.

నరసింహయ్య, శంకర్రాజు ఒకరినొకరు పట్టుకుని ఏడుస్తున్నారు. పశ్చాత్తాపం 'ప్రేమ' అనే జీవనదిని ప్రవింపజేస్తున్నది. ఇది చూస్తున్న నిత్యానందస్వామి కూడా కన్నీళ్ల పర్యంతమయినాడు. కాసేపటి తర్వాత వాళ్లిద్దరూ పరమయోగిని సమీపించి ఆయన ఆశీర్వాదం తీసుకున్నారు.

పరమయోగి "నాయనలారా! రెండురోజులు ఆశ్రమంలోనే ఉండి, ప్రశాంతచిత్తంతో వెళ్లండి" అని చెప్పాడు.

రెండోనాడు శంకర్రాజు క్షురకర్మ చేయించుకున్నాడు. నరసింహయ్య, శంకర్రాజు ఇద్దరూ సమీపంలో ఉన్న నదిలో శుచిస్నాతలై వచ్చి యోగీశ్వరుని ముందు కూచున్నారు. వాళ్లని చూసి యోగితో సహా అంతా ఆశ్చర్యంలో మునిగారు.

ఎందుకంటే వాళ్లిద్దరూ ఒకేరకంగా ఉన్నారు. పరమయోగికేదో అనుమానం వచ్చింది. ఇద్దర్నీ చేరబిలిచి పుట్టుమచ్చలను పరీక్షించాక, ఆయన వాళ్ల పుట్టుక గురించి తెలుసుకోవాలని ప్రయత్నించి, వాళ్లని రకరకాల ప్రశ్నలు వేశాడు. తనను ఆదిలక్ష్మమ్మ సాక్కున్నదని నరసింహయ్య చెబితే, తను వీరమ్మ కొడుకునని శంకర్రాజు చెబుతున్నాడు. వాళ్ల సమాధానాలు ఆయనకు తృప్తికరంగా లేవు. అందుకే తన వద్దనున్న స్వాములనిద్దరిని ఒకర్ని గుమ్మడిదిబ్బకు, మరొకరిని వీరంపల్లెకూ పంపించాడాయన.

ముందుగా వీరమ్మ శివానందస్వామితో కలిసి ఆశ్రమానికి వచ్చింది. నిత్యానందస్వామి సుందరమణి కోసం హైద్రాబాదు వెళ్లవలసి వచ్చింది.

"తల్లీ! నీవు కవలల్ని కన్నావా? " అన్న పరమయోగి ప్రశ్నకు లేదని సమాధానం చెప్పి తన అత్తగారు మగపిల్లవాణ్ణి ఆస్పత్రి నుంచే తీసుకువెళ్తానని తనకు మాటిచ్చి, ఆ మాట నిలబెట్టుకోలేకపోవడం వివరించి చెప్పింది వీరమ్మ.

కాస్త ఆలోచించిన పరమయోగి "నీవు పొరపాటు పడుతున్నావమ్మా. మీ అమ్మ మంగమ్మలాగానే నీవూ కవలల్ని కని ఉంటావు. మీ అత్తగారు మాట తప్పలేదు. నీ పిల్లలిద్దర్లో ఒకర్ని తీసుకెళ్లి ఉంటారామె. నిజం తెలుస్తుంది" అన్నాడు.

ఈ మాటలు విన్న అందరూ ఆశ్చర్యంలో మునిగితేలారు. వీరమ్మ అయోమయంలో పడిపోయింది.

రెండు రోజుల తర్వాత వచ్చిన సుందరమణి వీరమ్మ కవలల్ని కనడం, కవలల్లో ముందు పుట్టినవాడిని తాము తీసుకుని వెళ్లిపోవడం, ఆదిలక్ష్మి అనాథ శరణాలయం నుంచి బిడ్డను తెచ్చానని అందరికీ చెప్పడం వగైరా వివరాలన్నీ చెప్పింది.

నరసింహయ్యను అక్కున జేర్చుకోవాలని వీరమ్మ మనసు ఉబలాటపడసాగింది. తను చేసిన ఘోరమైన పాపం ఇనుప తెరలా అన్నిటికీ అడ్డుపడింది. ఆమె కన్నీటిపర్యంతమై పరమయోగి కాళ్లపై పడ్డది.

"అయ్యా! నేను మహాపాపిని. పెద్దల అడుగుజాడలలో నడవాలనే గుడ్డి ఆశయంతో ప్రేమమూర్తి, ఉత్తముడు అయిన నా భర్తను ఈ చేతులతో విషప్రయోగం చేసి, అంతమొందించాను.

ఆ పాప ప్రక్షాళన కోసం ఎన్నో దానాలు చేశాను. ఎంతోమంది అనాథలను చేరదీసి సాకాను. ఎన్నో పుణ్యక్షేత్రాలు తిరిగాను. నా పుణ్యమో, మా అన్న చేసిన పుణ్యమో, లేకుంటే మీ కరుణాకటాక్ష ఫలితమోగాని ఈవాళ నా పెద్దబిడ్డను దేవుడు దగ్గర చేశాడు" అంటూ వెక్కి వెక్కి ఏడ్చింది.

ఏ పేగు కదిలిందో ఏ బంధం లాగిందో గాని ముందుగా నరసింహయ్య పరుగు పరుగున వచ్చి, తల్లిని అక్కున జేర్చుకుని, ఊరడించాడు తర్వాత శంకర్రాజు!

పరమయోగి ఆమెను ఊరడిస్తూ "అమ్మా! మానవుడు కర్మబద్ధుడు. భగవద్గీత చెప్పిన ప్రకారం మన జీవితంలో జరిగే అనేకానేక సంఘటనలు మన కర్మ ఫలాలే. అందుకు మీరు విచారించనక్కర్లేదు. మీరు కన్న బిడ్డలిద్దరినీ ఒకర్నొకరు చంపుకోనీకుండా కన్నతల్లి ఒడిచేర్చిన ఆ భగవంతుడు దయామయుడు" అన్నాడు.

అందరూ ఆశ్రమంలో మరి రెండు రోజులున్నారు.

ప్రశాంతమైన ఆ వాతావరణం తమలో మార్పు తీసుకొచ్చిన ఆ దివ్యస్థలం, కోరని వరాలిచ్చిన పుణ్యప్రాంతం, తప్పులన్నీ క్షమించి వేసిన ఆ పవిత్ర స్థానం వదిలి పోవడానికి ఎవరికి మనసవుతుంది గనక!

శంకర్రాజు కంటతడి పెట్టుకుంటూ ఆశ్రమ వాసుల వద్ద సెలవు తీసుకున్నాడు. నరసింహయ్యకు కూడా ఈ రెండు దినాలలోనే వాళ్లంతా దగ్గరవారైనారు. తనకు కన్నతల్లిని చూపిన ఆశ్రమం ఇది! తనకు తమ్ముణ్నిచ్చిన ఆశ్రమం ఇది. దీన్ని వదిలి పోయేదెట్లా?

భారమైన మనసుతో అందరివద్దా సెలవు తీసుకున్నాడు నరసింహయ్య.

స్త్రీ మనసు, అందునా మాతృమూర్తి మనసు, అంతగట్టిగా ఉండదు. అందుకే వీరమ్మకు దుఃఖం తన్నుకొస్తున్నది.

'తన స్నేహితురాలు ఆదిలక్ష్మి ఉంటే ఈ సమయంలో ఎంత సంబరపడేదో కదా! ఈ సంఘటనలన్నీ చాలా నాటకీయంగా జరిగినాయి' అనుకొంటున్నది సుందరమణి.

ఆశ్రమ వాసులంతా కనుచూపుమేర వరకు వారిని చూస్తూండిపోయారు. Ⓒ







# చతుర ప్ర.జ.

పాఠకుల ప్రశ్నలకు
**అవధాన సరస్వతి**
**డా. మేడసాని మోహన్**
సమాధానాలు

ప్ర. సాహిత్య సభలలో సన్మానితుడ్ని 'దుశ్శాలువ'తో సత్కరిస్తారు. ఒక విధంగా చెడుగా ధ్వనించే దీని అసలు అర్థం ఏమిటి? దీనిని ఎందుకు అనుసరిస్తున్నారు?

– బి. కృష్ణవేణి, చెన్నై

జ. అతి ప్రాచీనకాలంలో సంస్కృతంలోని కొన్ని శబ్దాలకు, ఉపసర్గలకు ఉన్న అర్థవిశేషాలు కాలాంతరంలో మార్పులు చెందుతుంటాయి. దీన్నే భాషాశాస్త్రజ్ఞులు 'అర్థవిపరిణామం' అంటారు. సంస్కృతంలో వైదిక సంస్కృతం, లౌకిక సంస్కృతం అని భాషను రెండు విధాలుగా విశ్లేషించారు. ఈ విశ్లేషణను బట్టి కూడా అర్థాలలో మార్పు ఉంటుంది. 'దుః' అనే ఉపసర్గకు ప్రాచీనకాలంలో దట్టమైన, సాంద్రమైన, తీవ్రమైన - అనే అర్థాలు వ్యవహారంలో ఉన్నట్లు తెలుస్తూంది. దుర్యోధన, దుశ్శాసన, దుస్సల - వంటి పేర్లు ఇలా ఏర్పడినవే. 'దుశ్శాలువ' వంటి శబ్దాలలో ఈ ఉపసర్గకు అటువంటి అర్థమే చెప్పుకోవాలి. తెలుగు మాటలలో కూడా ఇటువంటి అర్థవిపరిణామాలు ఉన్నాయి. ఉదాహరణకు 'కంపు' అనే పదం ప్రాచీన కావ్యాలలో 'సువాసన' అనే అర్థంతో ప్రయోగించారు. ఇప్పటి వ్యవహారంలో దుర్గంధం- అనే అర్థంతో వాడుకలో ఉందిగదా!

ప్ర. శఠగోపం అంటే ఏమిటి? ఆలయంలో పూజారి పెడతారు. ఎవరైనా ఏదైనా ఎగ్గొడితే 'శఠగోపం పెట్టాడు' అంటారు.. వివరించండి?

– కొమ్మాజోస్యుల రాజేశ్వరి, విశాఖపట్నం

జ. 'శఠగోపం' అన్నది శ్రీవైష్ణవ సంప్రదాయంలో అత్యంత ప్రశస్తంగా భావిస్తారు. పన్నిద్దరాళ్వార్లలో ప్రసిద్ధులైన నమ్మాళ్వార్ వారికి శఠగోపులని కూడా పేరు ఉంది. శఠంతో అంటే పట్టుదల గలిగిన కోపంతో కలిని శాసించినందు వల్ల వీరికి ఈ పేరు వచ్చినట్లు సంప్రదాయజ్ఞులు పేర్కొంటారు. 'భక్తామృతం విశ్వజనానుమోదనమ్, సర్వార్థదం శ్రీశఠగోపవాఙ్మయమ్'- అని నాథమునులవారు నమ్మాళ్వార్ల రచనలను ప్రశంసించారు. దేవాలయంలో 'శఠారి' తలకు తాకిస్తే శ్రీవారి పాదుకలు శిరస్సును స్పృశించినట్లు అనుభూతి పొందుతారు. కాలక్రమంలో అన్యసంప్రదాయాలవారు ఈ శబ్దాన్ని వ్యంగ్యార్థంలో వ్యవహారంలోకి తెచ్చారు.

ప్ర. ఆత్మ మానవులకేనా? పశుపక్ష్యాదులు, క్రిమికీటకాలు, వృక్షాదులకూ ఉంటుందా? ఉంటే తేడా ఏంటి?

– డా. పెరంబూరి నరశింహారావు, విశాఖ

జ. ఆత్మ పశుపక్ష్యాదులకు, క్రిమికీటకాదులకు కూడా ఉంది. వృక్షాదులకు కూడా ఉంది. ఆత్మకు అనుబంధమైన చైతన్యశక్తిలోనే తేడాలుంటాయి.

ప్ర. లవకుశులు అయోధ్యా రాజ్యాన్ని పరిపాలించారా? వారి సంతతి ఎవరు?

– తేడేటి సుబ్బమ్మ, రేపల్లె

జ. సువిశాల కోసల రాజ్యాన్ని శ్రీరాముడు రెండుగా విభజించి కుశావతి అనే నగరం రాజధానిగా కుశుని, శ్రావస్తి- అనే నగరం రాజధానిగా లవుని పట్టాభిషిక్తులు చేసినట్లు ఉత్తర రామాయణం ద్వారా తెలుస్తున్నది. వాల్మీకంలో వీరి సంతతికి చెందిన వివరాలు లేవు. ఆనందరామాయణంలో కుశునికి హేమ అనే కుమార్తె ఉన్నట్లుగా చెప్పబడి ఉంది. వీరితో త్రేతాయుగం సమాప్తమై, ద్వాపరయుగం ప్రారంభమవు

తుంది.

ప్ర. శ్రీకృష్ణుడు నెమలి పింఛం ఎందుకు ధరిస్తాడు?

– కె. రాఘవి, కొత్తగూడెం

జ. నిత్యం నవనవోన్మేషంగా వికసించి, విస్తరించే సృష్టి లక్షణానికి నెమలి పింఛం సంకేతం. అటువంటి సృష్టితత్త్వానికి తాను అధినాయకుడనని నిరూపిస్తూ శ్రీకృష్ణుడు నెమలి పింఛం ధరించాడు.

ప్ర. శూర్పణఖ విశ్వవసుబ్రహ్మ కూతురు.. రావణబ్రహ్మ చెల్లెలు.. ఆమెను రాక్షసిగా, రామలక్ష్మణుల వెంట పడిన కామపిశాచిగా మహాకవి వాల్మీకి ఎలా రాస్తాడు? ఇది ప్రక్షిప్తం కాదా? మహిళాలోకానికి అగౌరవం కాదా?

– పారుపల్లి వెంకటేశ్వరరావు, నల్లకుంట, హైదరాబాద్

జ. విశ్వవసు బ్రహ్మ కూతురైనా, దేవజాతికి చెందినవారైనా కామక్రోధాదులు సహజం. దేవతలైనా, రాక్షసులైనా కామాది మనోవికారాలను యోగబలంతో జయించవలసిందే. రామాయణం మిక్కిలి ప్రాచీన కావ్యం. అందులోనూ ఆదికావ్యం కావడంతో అక్కడక్కడా ప్రక్షిప్తాలు ఉండే అవకాశం ఉంది. ఆ ప్రక్షిప్త భాగాలను గుర్తించాలంటే లోతైన పరిశోధనలు జరుగవలసిన అవసరం ఉంది.

ప్ర. శనీశ్వరుడు కూడా దైవస్వరూపుడే కదా! మరి అతనికి నివేదన చేసిన ప్రసాదాన్ని కొందరు స్వీకరించరెందుకు?

– దివాకర్ల సన్యాసిరాజు, సింహాచలం

జ. శనీశ్వరుడు, శని భగవాన్ - అని పిలువబడే శని దైవస్వరూపుడు - అనడంలో ఎటువంటి సందేహం లేదు. ఆ స్వామికి నివేదనం చేసిన ప్రసాదాన్ని స్వీకరింపకపోవడం వారి వారి విశ్వాసాలకు సంబంధించిన అంశం. స్వీకరించినా తప్పులేదు.

ప్ర. 'మాంగల్యా'పు తంతు వాల్మీకి రామాయణంలో లేదు. దేవాలయాల్లో సీతారాముల కల్యాణంలో మాంగల్యధారణ తంతు జరిపిస్తున్నారు. ఇది ఆర్షసంప్రదాయానికి విరుద్ధం కాదా?

– బమ్మిడి సుబ్బారావు, రిట్టపాడు, శ్రీకాకుళం జిల్లా

జ. మాంగల్యధారణ - అన్నది వాల్మీకి రామాయణమే కాదు.. చాలా ప్రాచీన గ్రంథాలలో లేదు. యవనులు మన దేశంపై దండెత్తి వచ్చిన తర్వాత ఇక్కడి వివాహిత స్త్రీలను సముచితంగా గుర్తించడానికి ఏర్పరచుకున్న కొత్త సంప్రదాయమిది. తరువాతి కాలంలో క్రమక్రమంగా మాంగల్యధారణ కూడా వేదమంత్ర పునీతమైంది. కాబట్టి దీనిని ఆర్ష సంప్రదాయానికి విరుద్ధంగా భావింపవలసిన పనిలేదు.

ప్ర. అహం - అహంభావం రెండూ ఒకటేనా? భేదముందా?

– టి. కవిత, సైదాబాద్, హైదరాబాద్

జ. అహం, అహంభావం, అహంకారం - ఇవన్నీ ఇంచుమించు సమానార్థకాలే. ఈ గుణాన్ని వివిధ రకాల వ్యక్తులు ప్రదర్శించడంలో భేదాలుంటాయి.

ప్ర. ప్రతి అమావాస్యకు పితృదేవతలకు తర్పణాలు ఇవ్వాలా? ఎలా ఇవ్వాలి? బదరీలో పిండ ప్రదానం చేశాక.. కాశీ, ప్రయాగ, గయలకు వెళ్లినపుడల్లా ఇవ్వాలా? అక్కర్లేదా?

– సి. హెచ్. కోటయ్యశాస్త్రి, కాకినాడ

జ. ప్రతి అమావాస్యకు పితృదేవతలకు తర్పణాలు ఇవ్వడం ఎంతైనా శ్రేయస్కరం. బదరీలో పిండప్రదానం అత్యంత శ్రేష్ఠం. కాశీ, గయ, ప్రయాగలకు వెళ్ళినపుడు ఒకసారి పిండ ప్రదానాలు చేస్తే మళ్ళీ వెళ్లినపుడు వీలును బట్టి ఆచరింపవచ్చు. ప్రతి అమావాస్యకు పితృతర్పణాదులు చేయటం వీలులేనప్పుడు సంక్రాంతి, మహాలయపక్షాలలో ఆచరించడం శ్రేయస్కరం.

ప్ర. భోగలాలసుడైన వ్యక్తికి స్థితప్రజ్ఞత వస్తుందా? వైరాగ్యం వల్ల గానీ, పేదరికం వల్లగానీ, భరింపలేని ఒంటరితనం వల్లగానీ మనిషి స్థితప్రజ్ఞతకు కొంతవరకు చేరుకోవచ్చునేది ఎంతవరకు నిజం?

– ప్రభాకర్ తల్లాప్రగడ, బెంగళూరు

జ. భోగలాలసుడైన వ్యక్తికి స్థితప్రజ్ఞత లభింపదు. స్థితప్రజ్ఞత సాధించడానికి పేదరికం అడ్డుపడదు. సిరిసంపదలు తోడ్పడవు. వైరాగ్యంతో కూడిన యోగసాధనతో స్థితప్రజ్ఞత సాధింపవచ్చు.

ప్ర. ఇంటి యజమాని ఉదయం, సాయంత్రం దేవునికి పూజ చేస్తే ఆ ఫలం భార్య పిల్లలందరికీ లభిస్తుందంటారు. ఇక భార్య పూజ చేయకపోయినా ఫర్వాలేదా?

– యు. శ్రీనివాసరావు, హైదరాబాద్

జ. గృహస్థుడు నిర్వహించే పూజాదికాలు

ఇంటిలో అందరి అభ్యుదయానికి దోహదం చేస్తాయి. అంతమాత్రాన గృహిణి, పిల్లలు పూజలు చేయకూడదని ఏమీ లేదు. అవకాశాలను అనుసరించి వారు కూడ పూజలు చేయవచ్చు.

ప్ర. రామాయణంలోని 'త్రిజట' ఆధ్యాత్మికంగా త్రిమూర్తుల సమగ్ర తత్త్వమా?

**– డా. తూములూరి పార్థసారథి,** హైదరాబాద్

జ. రామాయణంలోని త్రిజట త్రిమూర్తుల సమాహారభూతమైన చైతన్యమూర్తిగా వ్యాఖ్యాతలు పేర్కొన్నారు.

ప్ర. ప్రతి అమావాస్య, పౌర్ణమికి మధ్య రోజుల తేడా సమానంగా ఉండడం లేదు.. ఎందుకు?

**– సుతారి బాబు,**
పెద్దలింగారెడ్డిపల్లి, మెదక్ జిల్లా

జ. ప్రతి అమావాస్యకు, పౌర్ణమికి మధ్య వచ్చే తిథులకు సంబంధించిన ఘడియలలో నక్షత్రాల ప్రభావం చేత కొన్నితేడాలు వస్తుంటాయి. అందువల్ల సమానంగా ఉండే అవకాశం లేదు.

ప్ర. వాస్తు ప్రకారం ఇళ్లు నిర్మించాలని అందరూ భావిస్తారు. అయితే ఫ్లాట్ల విషయంలో వాస్తుకి ప్రాధాన్యం ఇవ్వగలమా? రాజీపడాలా?

**– బోడపాటి కృష్ణవేణి,** చెన్నై

జ. స్వతంత్ర గృహనిర్మాణాలకు వాస్తు పాటించడం సులభమే. అపార్టుమెంట్ల విషయంలో వీలయినంత వరకు వాస్తు పాటించినా కొన్ని అంశాలలో రాజీపడక తప్పదు.

ప్ర. ఆత్మహత్య మహాపాపం అంటారు. ఎవరైనా ఆత్మహత్య చేసుకుంటే వారికి ఎటువంటి పాపం అంటుకుంటుంది? ఆ పాపం కుటుంబ సభ్యులకూ వర్తిస్తుందా?

**– నల్లపాటి సురేంద్ర,** విశాఖపట్నం

జ. ఆత్మహత్య మహాపాపమే. ఆ ఆత్మహత్యకు కుటుంబసభ్యులు నిజమైన కారకులు, ప్రేరకులైతే వారికి గూడ అది వర్తిస్తుంది.

ప్ర. చనిపోయినవారి అస్థికలను సముద్రంలో ఎందుకు కలపరు? నదులలోనే ఎందుకు కలుపుతారు? అన్ని నదులూ సముద్రంలోనే కదా కలిసేది!

**– ఎ.ఎస్.ఆర్. మూర్తి,** హైదరాబాద్

జ. సముద్రానికి మనం ఏమైనా సమర్పించినా పరిత్యజించవచ్చు. సముద్రానికి ఆ లక్షణం ఉంది. నదీమతల్లులు పరిత్యజింపవు. అందుకు అస్థికలైనా, భస్మాదులైనా నదులలోనే కలుపుతారు.

## రూ.116/- బహుమతి పొందిన ఉత్తమ ప్రశ్న

ప్ర. పంచభూతాలు లేకుండా ఇలలో సృష్టి లేదు. అలాంటి వాటిని పూజించకుండా మిగతా విగ్రహారాధనవల్ల ఫలితముంటుందా?

**– బిక్కునూరి రాజేశ్వర్,**
ఈదిగాం, ఆదిలాబాద్ జిల్లా

జ. భారతీయ సంస్కృతిలో చెట్టుల్నీ, పుట్టలనూ, కొండలను, నదులను, సూర్యచంద్రాదులను, నక్షత్రమండలాలను ఆరాధిస్తాం. ఇవన్నీ పంచభూతాలను అర్చించడం కిందికే వస్తాయి. సగుణారాధన సంప్రదాయంలో ఏర్పడిన విగ్రహారాధన వల్ల కూడ తప్పక సత్ఫలితం ఉంటుంది.

ప్ర. 'పూర్వజన్మ కృతం పాపం వ్యాధి రూపేణ బాధతే' అని విన్నాను.. నిజమేనా? వివరించండి?

**– చి.పు. శాస్త్రి,** నిజామాబాద్

జ. 'పూర్వజన్మ కృతం పాపం వ్యాధిరూపేణ బాధతే'- అన్న పెద్దల వాక్యం అక్షరాల నిజం. అటువంటి పాపం ఇంకా ఎన్నోరకాలుగా కూడా బాధిస్తుంది.

ప్ర. మా గురువుగారు 'ఎఱుక బ్రతుకు బ్రతుకుతూ నాహం స్థితిలో నిశ్చలమైన ఎఱుక రూపునిగా సాక్షి స్వభావంలో ఉండమంటున్నారు' అర్థమయినట్లే ఉంటుంది కానీ బోధపడదు.. ఆధ్యాత్మిక దృష్టిని వివరించగలరు?

**– గురజాల వరలక్ష్మి,** రావులపాలెం

జ. మీ గురువుగారు చెప్పిన బోధనలో ప్రధానంగా మూడు అంశాలు ఉన్నాయి. (1) ఎఱుక అంటే జ్ఞానం కలిగి జీవించడం. (2) అహంకారాది మనోవికారాలకు అతీతమై యోగస్థితితో కూడిన నైశ్చల్యం సముపార్జించడం (3) ఇటువంటి నిశ్చలత్వం కలిగిన తరువాత సాధకుడు తన అంతరంగంలో స్వతస్సిద్ధంగా ప్రభవించే భావనాపరంపరలకు, వ్యాసంగాలకు సాక్షిమాత్రుడై ఉంటాడు. ఇదే భారతీయ అధ్యాత్మ దృక్పథం.

మలయాళ కథ



# హనీమూన్

బాంబే మహానగరంలో బతుకుతున్న మలయాళీ కుర్రాణ్ణి నేను. ఇంకా పెళ్ళి కాలేదు. సాహిత్యకారుణ్ణి కావాలని ఎంత అభిరుచి ఉన్నప్పటికీ అది తీరే దారిలేక, బతుకు తెరువుకోసం ఈ బాంబేకి వచ్చి, ఇక్కడి ఆమ్‌ఆద్మీకన్నా దిగువస్థాయి మనుషులలో కలిసిపోయాను. నా వైభవం గురించి నలుగురికీ తెలిస్తే దిష్టి తగులుతుందని పైకి ఇలా అంటున్నానేగానీ నాకు మాత్రం ఏం తక్కువనీ? వచ్చే దాంట్లోనే బతకటానికి కావల్సినవన్నీ అమరుతున్నయ్ గదా!

పనిచేసే చోటుకు వందల మైళ్ళ దూరంలో వుంటూ, ఎలక్ట్రిక్ ట్రైన్స్‌లో నానా హైరానా పడుతూ బాంబేకు రాకపోకలు సాగించే మధ్యతరగతి మలయాళీల్లా

**దా**దాపు ఐదు దశాబ్దాల నాటి కథ 'హనీమూన్'. ఈ కథలో బాంబే (ముంబయి) నగరంలో పేర్కొన్న హోటల్ రూమ్స్ అద్దెలు, తినుబండారాల ధరలు, ఇంటి బాడుగ మొదలైనవన్నీ కథాకాలం నాటివని గమనిక.



మూలం :
జి. వివేకానందన్

అనువాదం :
శీతంరాజు పద్మావతి

కాకుండా, నగరం నడిబొడ్డులోని చర్చిగేట్ లోనే దర్జాగా వుంటున్నానాయె! బాంబేలో ధనికులు అధికంగా నివసించే ప్రదేశాల్లో ఇది కూడా ఒకటి. చుట్టుపక్కల ఉన్న అన్ని ప్రాంతాలకూ ఇక్కణ్ణుంచి లోకల్ ట్రైన్స్ నడుస్తాయి. ఈ నగరంలో ఫ్లోరా ఫౌంటెన్ ఏరియాకు ఎంత ప్రాముఖ్యం వుందో ఈ చర్చిగేటుక్కూడా అంతే

ప్రాముఖ్యం వుంది.

అసలా ఫ్లోరా ఫౌంటెన్‌లోనే ఉందామని ప్రయత్నించాను గానీ కుదరకపోవటంతో... 'ఎక్కడైతేనేంలే' అనుకుని ఈ చర్చిగేట్ లో వుంటున్నాను.

నగరంలో అత్యధిక జనాభా నివసించే ప్రాంతాలలో చెప్పుకోదగ్గది చర్చిగేట్.

పాతకాలంనాటి ఓ డొక్కు ట్రంకు పెట్టెతో బాంబేలో అడుగుపెట్టాన్నేను. నాకున్న విలువైన వస్తువులన్నీ అందులోనే వుంటాయి గనుక దాన్ని ముద్దుగా 'ఐరన్ సేఫ్' అని పిలుచుకుంటాను.

అది పోతే నాకెంత నష్టం! అందుకనే దాన్ని నా స్థావరానికి తీసికెళ్ళలేదు.

ఫ్లోరా ఫౌంటెన్‌లో స్టాల్ తెరిచి వేడి వేడి శనగలు అమ్ముతూ 'గరం చనావాలా' అని పేరుపొందిన ఒకాయన వున్నాడు. ఆయన కాలికట్ నుంచి వచ్చిన ముసల్మాను. మంచివాడు. పేరు హాజియార్. అయితే ఆయన ఎన్నడూ హజ్ యాత్రకు వెళ్ళనే లేదు! పాపం! ఏనాడో ఈ బాంబేకు వలస వచ్చి శనగలమ్ముకుంటూ బతుకుతున్నాడు! అతనితో దోస్తీ కుదిరింది నాకు. ఆ మాటకొస్తే నాలాంటి దోస్తులు చాలా మంది ఉన్నారాయనకు!

నా డొక్కుపెట్టెను.. సారీ నా ఐరన్ సేఫ్‌ను హాజియార్‌జీ దగ్గర భద్రపరిచాను. సేఫ్ డిపాజిట్‌లాకర్ వున్నవాళ్ళు బ్యాంక్‌వారికి అద్దె చెల్లించినట్టుగా, నేను కూడా నా పెట్టెను భద్రపరుస్తున్నందుకు హాజియార్‌జీకి నెలకు మూడు రూపాయలు అద్దె చెల్లిస్తాను.

అప్పుడప్పుడు నా పెట్టెలో నుంచి అవసరమైన వస్తువులను తీసుకుని తాళం వేసి మళ్ళీ ఆయనకు అప్పజెప్పేస్తుంటాను. అందుకు ఆయనకు డబ్బులేమీ ఇవ్వక్కర్లేదు! నెంబరు గుర్తు పెట్టుకుంటే చాలు! ఫ్రీ సర్వీస్ అన్నమాట!

నాబోటివాళ్ళు చాలామంది తమతమ ఐరన్‌సేఫ్‌లను హాజియార్‌జీ దగ్గర భద్రపరచుకుని బాంబేలో నిశ్చింతగా బతుకుతున్నారు! అలాంటివారి పేర్లూ, పెట్టెల నెంబర్లూ తన లెడ్జర్‌లో నోట్ చేసి పెట్టుకుంటాడాయన! అందులో వెరిఫై చేసుకున్న తరవాత గానీ ఎవరినీ ఏ పెట్టే తెరవనివ్వడు. అందుకని... బ్యాంక్ లాకర్ నెంబర్‌ను గుర్తుంచుకున్నట్లు... పెట్టె నెంబర్‌ను గుర్తుంచుకోవలసిందే!

రాత్రి పన్నెండు దాటితేగానీ నేను నా నివాసస్థానానికి వెళ్ళటానికి వీల్లేదు.

అప్పటిదాకా వచ్చేపోయే జనంతో అది కిక్కిరిసి వుంటుంది. దానికి నలువేపులా లెక్కలేనన్ని ఆకాశహర్మ్యాలున్నాయి. వాటిలో కొన్ని ఆఫీసులైతే, కొన్ని నివాస గృహాలు. కరెంటుతో నడిచే లిఫ్టుల్లో జనం పైకీ కిందకూ వెళ్లొస్తుంటారు. ఇరవై నాలుగ్గంటలూ లిఫ్టులు పనిచేస్తూనే వుంటాయి.

అర్ధరాత్రివేళకు కాస్త అటూఇటుగా అక్కడికి పహరాదార్లు వస్తారు. వాళ్ళు కేవలం ఓ రౌండ్ వేసి వెడతారంతే! వాళ్ళందరూ నాకు మిత్రులే! నా శ్రేయోభిలాషులే! వాళ్ళందరికీ కలిపి ప్రతినెలా ఒకటోతేదీన ఐదు రూపాయలిస్తాను. ఇక నెలంతా నన్ను కనిపెట్టుకుని వుంటారు. ఏ ఇబ్బందీ రాదు!

పహరాదార్లు ఆ చోటు దాటి వెళ్ళగానే మేమందరం అంటే మా మలయాళీలు, ఇరుగుపొరుగు రాష్ట్రాలవారైన తమిళులు, కన్నడిగులు, వారి పక్క రాష్ట్రం వారైన తెలుగువాళ్ళు, బెంగాలీ బాబులూ... దేశంలో ఇంకా మిగిలిన ప్రాంతాల నుంచి వచ్చిన నాలాంటి వారందరం కలిసికట్టుగా ఒకే ధ్యేయంతో ముందుకు కదులుతాం.

జాతీయ సమైక్యత, భారతీయుల భావాత్మక ఏకతలాంటి పదాలను వినే వుంటారు మీరు! ఇలాంటి పదజాలమంతా

సాకారం దాల్చి కనపడుతుందక్కడ. అదొక అద్భుతమైన ప్రదేశం! నా దృష్టిలో ప్రతి భారతీయునికీ అది దర్శనీయ స్థలం! జీవితంలో ఒకసారైనా చూసి తీరాల్సిందే. నాబోటి వేలాదిమంది భారత పౌరులకు సేదదీర్చి విశ్రాంతినిచ్చే చోటును చూడొద్దు మరీ! మేం కూడా భరతమాత బిడ్డలమేగా మరీ!

అక్కడికి చేరగానే మేమందరం దాని మీద గబగబా మా డన్‌లప్ బెడ్స్‌ను పరుచుకుంటాం. మా మలయాళీ భాషలో వాటిని కంబళ్ళు అంటారు.

ఎవరి బెడ్‌మీద వాళ్ళు దర్జాగా పడుకుంటారు. ఇలా నడుం వాల్చగానే అలా నిద్ర పట్టేస్తుంది. 'నిదుర రాదు కనులకూ..' అంటూ ఏ ఒక్కరూ కూడా నిర్వేదంతో పాడుకోవాల్సిన అవసరం లేదు.

అది ఫుట్‌పాత్ అయితే అవుగాక! జనాలంతా దాన్ని ఫుట్‌పాత్ అనే అంటారు గానీ, మాకు మాత్రం నిద్రాదేవి జోలపాడే ఓ పెద్ద బల్ల ఉయ్యాలలాంటిదది! దాని మీద కంబళీ పరచుకుని పడుకోవటం మొదలుపెట్టాకే నాకు నిద్ర సుఖమంటే ఏమిటో తెలిసింది!

అలా సుఖనిద్రలో వున్న మాకు తెలతెలవారుతుండగానే మేలుకొలుపులు మొదలవుతాయి. ఎంత గాఢనిద్రలో వున్న వాడైనా మెలకువ తెచ్చుకోక తప్పదు. ఆ మేలుకొలుపుల తీవ్రత అలాంటిది మరి!

లేచిన వాళ్ళం లేచినట్లుగా జట్లుజట్లుగా రైల్వేస్టేషన్‌కు వెడతాం. అక్కడి పబ్లిక్ టాయిలెట్స్‌ను నిరాటంకంగా ఉపయోగించుకుంటాం. వాటికి సమీపంలోనే ఫ్లష్, షవర్ మొదలైన సౌకర్యాలతోనూ, చక్కని మొజాయిక్ ఫ్లోరింగ్‌తోనూ తీర్చిదిద్దిన స్నానాల గదులుంటాయి. ఒంటికి పట్టిన మురికినంతా కావల్సినన్ని నీళ్ళతో వదిలించుకుంటూ తనివితీరా హాయిగా మినిస్టర్స్ లాగా స్నానం చేస్తాం. అక్కడుండే వాచ్‌మ్యాన్‌కి నెలకు రెండు రూపాయలు బక్షీస్‌గా ఇస్తే మాత్రం మాకు నష్టమేముందీ?

స్నానాలయ్యాక మేమందరం కబుర్లు చెప్పుకుంటూ పెళ్ళివారిలాగా భోజనశాలకు వెడతాం.

మా స్వంత ఊళ్ళలో లాగ ఈ భోజనశాలలో వరి అన్నం, అప్పడాలు, వడియాలు వడ్డించరు. ఇడ్లీ, దోశ, వడ లాంటివి ఇవ్వరు. అలాంటివి తింటే ఊబకాయం వస్తుంది.

అందుకనే నరాలకు బలాన్నీ, శరీరానికి శక్తినీ ఇచ్చే సూఖా రోటీలూ, చపాతీలూ లాంటివి కడుపునిండా తింటాం మేము!

నిలువ వుంటే కల్లు, సారాయిల రుచి పెరుగుతుందంటారు. అలాగే చద్ది రొట్టెల రుచి కూడా! రుచితో పాటు వాటి పోషక విలువలు కూడా పెరుగుతాయి. ఇలాంటి పురానీ రోటీలను సస్తాగా సప్లయ్ చేసే 'పురానీ రోటీవాలా' మా అందరికీ మిత్రుడు. రొట్టెలకు డబ్బు చెల్లిస్తే చాలు! నంజుకునేందుకు ఉల్లిపాయలూ, కొత్తిమీర తురుము, జీలకర్రా ఫ్రీగా ఇస్తాడు. మాలో కొందరు ఈ రోటీవాలాను చనువుగా చాచా అంటారు. ఇదంతా అయ్యాక మేం ఆఫీసులకి బయల్దేరతాం! ఇక్కడ 'ఆఫీసు' అంటే పనిచేసే చోటని అర్థం! ఎవరు పని

## కొత్తగాలి...

**చందమామను చూచి**
**మైమరచిపోవడం**
**సామాన్యుడి గుణం**
**చందమామపైనే దిగి**
**విహరించడం సాహసికుడి లక్షణం**

*– జి. రమణారావు, తాడిపత్రి*

చేసే చోటుకు వారు వెడతారన్నమాట.

ఇలా బాంబేలో దర్జాగా బతుకుతూ... నా సంపాదనలో చాలాభాగం మా అమ్మకు పంపుతాన్నేను. నా మనియార్డర్ కోసం ఆవిడ ప్రతినెలా చివరివారంలోని మొదటి రోజునుంచీ ఎదురుచూసినా మళ్లీనెల మొదటివారంలోని చివరి రోజుకు గానీ ఆ డబ్బు ఆవిడకు అందదు.

తల్లితోపాటు నాకో చెల్లి కూడా ఉంది. అది నా కన్నా చాలా చిన్నది. వాళ్ళిద్దరూ కూడా ఏవో చిన్నాచితకా పనులు చేసు కుంటూ కాస్తోకూస్తో సంపాదించుకుంటూ వుంటారు. ఇల్లు గడవటానికి నేను పంపేది సరిపోదు మరి!

ఆ రోజున హాజియార్‌జీని కలవటానికి వెళ్ళినప్పుడు ఆయన నాకో ఉత్తరం ఇచ్చాడు. అది అమ్మ దగ్గర్నుంచి వచ్చి నట్లు లేదు.

'ఎవరు రాశారా?' అనే ఉత్కంఠతో గబ గబా ఆ ఇన్‌ల్యాండ్ లెటర్‌ను చించి చది వాను. మా ఊరినుంచి నా బాల్యస్నేహి తుడు రాసిన ఉత్తరం అది.

ఇక్కడకువచ్చి ఈ బాంబేలో ఉద్యోగం చేసుకుంటూ నాలాగా దర్జాగా బతకాలని ఉందని సారాంశం!

ఇక్కడ నేనేదో గొప్ప ఉద్యోగం వెలగబె డుతూ వైభవంగా బతుకుతున్నానని మా ఊరివాళ్ళంతా అనుకుంటారు. అక్కడకు నేను వెళ్ళినప్పుడు నన్నెంతో గౌరవంగా చూస్తారు. 'పోనీ.. వాళ్లు ఆ భ్రమలోనే బతకనీ.. నాదేం పోయింది?' అని నేనూ అనుకుంటాను.

ఇప్పుడు వీడొచ్చి చూస్తే నా అసలు బతుకు బైటపడి పదిమందిలోనూ పలచనై పోనూ?

అందుకనే వాడు బాంబే రాకుండా అడ్డు కోవాలని చూశాను. నా ఉద్దేశం స్పష్టంగా అర్థమయ్యేట్లు ఉత్తరాల ద్వారా వాడికి తెలి యజేశాను.

ఈ మహానగరంలో ఉద్యోగాలు దొర కటం అంత తేలిక కాదన్నాను. ఉండటా నికి వసతి దొరకదన్నాను. మన ఊళ్ళో కన్నా ఇక్కడ అన్ని వస్తువుల ధరలూ ఎన్నో రెట్లు ఎక్కువ గనుక... రోజువారీ ఖర్చుకు చాలా డబ్బు కావలసి వస్తుంద న్నాను. హిందీ, మరాఠీ రానివాళ్ళకు పని దొరకటం కష్టమనీ, అతను రాకపోవటమే మంచిదనీ తేల్చి చెప్పాను. చివరికి 'నువ్వు ఇక్కడికి వచ్చే ప్రయత్నం మానుకుని మన ప్రాంతంలోనే ఏదో పని చూసుకో!' అని గట్టిగా రాసేసి ఊపిరి పీల్చుకున్నాను.

అయితే పై ఉత్తరం మా ఊరు చేరక ముందే అటునుంచి వచ్చిన మరో ఉత్త రాన్ని హాజియార్‌జీ నా చేతిలో పెట్టాడు. తను ఎక్కుతున్న ట్రైన్ వివరాలూ, అది బాంబే చేరుకునే సమయం తెలియజేస్తూ, తప్పకుండా స్టేషన్‌కు వచ్చి తనను రిసీవ్ చేసుకోమని ఊరి మిత్రుడు రాశాడు.

ఇక తప్పేదేముందీ? ఊరు కొత్త. భాష రాదు. బాల్యమిత్రుడు. కంగారు పడతా డని కాస్త ముందుగానే బాంబే విక్టోరియా టర్మినస్ రైల్వేస్టేషన్‌కు చేరుకుని వాడి కోసం ఎదురుచూడసాగాను.

రైలు చాలా ఆలస్యంగా వచ్చింది.

పరిసరాలను సంభ్రమాశ్చర్యాలతో పరి కిస్తూ పెట్టె పట్టుకుని ప్లాట్‌ఫాం మీదకు బెరుకు బెరుకుగా దిగుతున్నాడు వాడు.

కాస్త దూరంగా ఉన్న నేను, అది గమ నించి గబగబా వెళ్ళి వాడిని పలకరిస్తూ ఆ పెట్టె అందుకున్నాను.

నేను మొదటిసారి బాంబే వచ్చినపుడు నా చేతిలో ఉన్న పెట్టె లాంటిదే. అచ్చం అలాంటి చవకరకం ట్రంకుపెట్టే అది!

ప్యాంటూ, బుష్‌షర్టూ తొడుక్కుని దొర బాబులా ఉన్న నన్ను చూడగానే వాడిక ళ్ళలోని భావాన్ని గట్టిగా ఇదే అని చెప్పలే

న్నేను. ఆశ్చర్యమా లేక ఈర్ష్యా? ఏమో!

కుశలప్రశ్నలయ్యాక కబుర్లు చెప్పుకుంటూ స్టేషన్ బయటకు రాగానే ఓ ట్యాక్సీ మాట్లాడి పెట్టెను డిక్కీలో పెట్టించి, ఇద్దరమూ ఎక్కి కూర్చున్నాం. ఆ ట్యాక్సీ బాంబే వీధుల్లో వేగంగా ముందుకు పోతుంటే ఇరువైపులా కనిపిస్తున్న దృశ్యాలను తేరిపారజూస్తున్నాడు వాడు.

ఫ్లోరా ఫౌంటెన్ రాగానే ట్యాక్సీని ఆపించి, మిత్రుడి ఐరన్ సేఫ్‌ను హాజియార్‌జీకి అప్పగించి వచ్చి కూర్చున్నాను.

చర్చిగేట్‌కు పోనిమ్మని నేను ట్యాక్సీవాలాకు చెబుతుంటే "ఆ పెట్టెలో ముఖ్యమైన వస్తువులన్నీ ఉన్నయ్! అట్టా రోడ్డు పక్కన పడేసివస్తావేరా? " అని సణిగాడు.

"మరేం ఫరవాలేదు. ఆ ముసల్మాను చాలా మంచివాడు. నీ పెట్టెను భద్రపరుస్తాడులే!" అంటూ భరోసా ఇచ్చాను.

ట్యాక్సీ ఫ్లోరా ఫౌంటెన్‌లోని రోడ్లమీదుగా వెడుతుంటే ఇరువైపులా బహుళ అంతస్తుల భవనాలను సంభ్రమాశ్చర్యాలతో చూడసాగాడు, ఊరిలో ఒక్క పక్కాఇల్లుకూడా లేని పల్లెటూరి మిత్రుడు!

చర్చిగేట్‌కు రాగానే ట్యాక్సీని ఆపించి ట్యాక్సీ వాలాకు డబ్బిచ్చి పంపేశాను.

"ఎక్కడ మనపల్లె! ఎక్కడ ఈ హర్మ్యాలు? ఇంత ఖరీదైన ప్రాంతంలో ఉంటున్నావా? అదృష్టమంటే నీదేరా!" అని వాడు మెచ్చుకుంటుంటే, పట్టించుకోనట్లు ముందుకు కదిలాను.

వాడు మౌనంగా నన్ననుసరించాడు.

చుట్టూవున్న ఆ ఎత్తైన మేడల్లో ఏ అంతస్తులో నేనుంటున్నానో తెల్సుకోలేక, తడబడుతూ అడుగులు వేస్తున్న నా మిత్రుడిని వేగంగా వస్తున్న ఓ కారు గుద్దెయ్యబోతుంటే ఫుట్‌పాత్ మీదున్న నేను చటుక్కున వాడి చెయ్యి పట్టుకుని పైకి లాగాను. దాంతో బోర్లాపడిపోయాడు.

ఇదంతా చూస్తున్న పరిచయస్థుడొకడు నాకు సలాం చేస్తూ... మిత్రుణ్ణి లేవదీసి ఓ పక్కన కూర్చోబెట్టాడు. పరిచయస్థుడంటే మరెవరో కాదు, రాత్రిపూట నేను పడుకునేచోటే అతనూ పడుకుంటాడు.

ఓ రోజు జ్వరంతో బాధపడుతున్న అతను పొద్దున్నే లేవలేకపోతుంటే, నేను ఓ కప్పు బ్లాక్‌కాఫీ, రెండు యాస్ప్రిన్ బిళ్లలూ కొనుక్కొచ్చి ఇచ్చి... కోలుకునే దాకా అతనికి సపర్యలు చేశాను. పాపం! ఆ అల్పసంతోషి నా ఉపకారాన్ని ఇంకా మరచిపోలేదనుకుంటా! అందుకనే సవినయంగా సలాంచేసి స్నేహితుడి ముందు నా ప్రతిష్ఠను పెంచాడు.

నేను కూడా స్నేహితుని పక్కన కాసేపు కూర్చుని, మెల్లగా వాడిని లేవదీసి ఓ రెస్టారెంట్‌కు తీసికెళ్లాను. అక్కడ బేరర్‌తో నేను మాట్లాడిన నాలుగు హిందీ పదాలు నా మిత్రుణ్ణి విస్మయానికి గురిచేశాయి. నేనెంతో ఎదిగిపోయాననుకుంటూ మెచ్చుకోలుగా నావంక చూశాడు.

వాడికి హిందీ, మరాఠీ భాషలు అసలు రాకపోగా ఆయా భాషల్లో ఎవరన్నా మాట్లాడుతుంటే, వాళ్లేం మాట్లాడుకుంటున్నారో కూడా అర్థం కాదు. బాంబేలో బతకాలంటే మరాఠీ రాకపోయినా కనీస హిందీ పరిజ్ఞానం ఉండాలి. మెల్లిమెల్లిగా మరాఠీ నేర్చుకోవాలి. వీటన్నిటికీ ఆంగ్లం అనుసంధాన భాషగా పనిచేస్తుంది.

★ ★ ★

రొట్టె తిని, టీ తాగి, బిల్లు చెల్లించిన తర్వాత మిగిలిన డబ్బు లెక్కపెట్టుకుని చూస్తే నా గుండె గుభేల్‌మంది. ఇక్కడకు ఎన్నో వందల మైళ్ళ దూరంలో ఉన్న కేరళలోని ఓ కుగ్రామంలోని మా పాత ఇంటి వరండాలో ముడతలుపడ్డ ముఖంతో నా మనియార్డర్ కోసం ఎదురు చూస్తూ, దీనంగా నిలబడిన మా అమ్మ ముఖం స్పష్టంగా దృగ్గోచరమైంది.

ఆరోజు నేను పెట్టిన ఖర్చును గుర్తు చేసుకున్నాను. విక్టోరియా టర్మినస్ వరకూ వెళ్ళటానికి ఛార్జీ, ప్లాట్‌ఫాం టికెట్ ఖరీదు, ట్యాక్సీ ఛార్జీ... వీటికే నా ఒక్కరోజు జీతం ఖర్చయిపోయింది!

ఇలా ఇంకెంత ఖర్చుపెట్టాల్సి వస్తుందో? ఇక అమ్మకేం పంపగలనూ? అనుకున్నాను.

బిల్లు చెల్లించిన తరవాత కూడా కదలకుండా చాలాసేపు రెస్టారెంట్‌లోనే ఆలోచిస్తూ కూర్చున్నాను. మిత్రుడు కూడా కిమ్మనకుండా కూచున్నాడు.

'ఇంకేం కావాలి సాబ్!' అని బేరర్ పదే పదే అడుగుతుంటే ఇక తప్పదన్నట్టు రోడ్డు మీదకు వచ్చాను.

మళ్ళీ నడక కొనసాగిస్తుంటే నన్నునుసరిస్తున్న మిత్రుడు, "ఇక ఇంటికి తీసికెళ్ళరా! కాసేపు నడుం వాల్చాలీ!" అన్నాడు.

పాపం! రైలెక్కిన తరువాత పడుకోటానికి కుదిరి ఉండదు. కానీ వాడికి విశ్రాంతి తీసుకునేచోటు ఎక్కడ చూపించగలనూ?

ఈ సంగతిని బయటపెట్టకుండా, "ఏమిటీ? పడుకుందామనుకుంటున్నావా? ఈ బాంబేలో పిల్లలు కూడా పగటి వేళ పడుకోరు తెలుసా? ఊరు చూపిస్తాను. పద! ఈ మహానగరంలో చూడదగిన వింతలూ విశేషాలూ ఎన్నో ఉన్నాయి" అన్నాను ముందుకు కదులుతూ.

నా మాటలు నమ్మినా నమ్మకపోయినా, వాడికి నన్నునుసరించి నడవక తప్పలేదు.

చర్చ్‌గేట్ నుంచి క్వీన్స్‌రోడ్డుకూ, అక్కడి నుంచి మలబార్‌హిల్‌కూ నడుస్తూ... మార్గం మధ్యలో ఎన్నో చూశాం మేం.

అలసిపోయి ఇక నడవలేక మిత్రుణ్ని హ్యాంగింగ్ గార్డెన్‌కు తీసుకెళ్ళాను. ఆ గార్డెన్‌లో ఆ చివరి నుంచి ఈ చివరి వరకూ తిరుగుతూ... చెట్లూ..చేమలూ,

పూలూ, తీగలూ అన్నీ చూశాక ఓ చెట్టు కింద విశ్రాంతిగా కూచ్చున్నాం.

కాసేపాగి అక్కడే నడుం వాల్చిన మిత్రుడు వెంటనే గాఢ నిద్రలోకి జారుకున్నాడు. వాడి పక్కనే కాస్త చోటు చేసుకుని నేనూ పడుకున్నాను.

మేం లేచేసరికి పొద్దు వాలుతోంది. చుట్టూ ఉన్న చెట్ల మీదుగా వస్తున్న చల్ల గాలిలో మరికాసేపు బడలిక తీర్చుకుని మెరెయిన్ డ్రైవ్‌కు వెళ్లాం.

"అబ్బో! అబ్బో! ఇది అప్సరసలు నడయాడే ప్రదేశమనుకుంటా!" అక్కడిదృశ్యాలను చూసి అబ్బురపడిపోతూ స్వగతంగా అనుకున్నాడు నా స్నేహితుడు.

నాకు వినపడినా జవాబివ్వలేదు. మెరెయిన్ డ్రైవ్ పూర్తిగా జనసందోహంతో కళకళలాడటంలేదు మరి! అప్పుడే జనం రావటం మొదలైంది.

నడుస్తూ నడుస్తూ హోటల్ నటరాజ్ దాటేసి, 'సీ గ్రీన్' హోటల్ రెండో వేపుకు వెళ్ళి. అక్కడ ఓ బెంచి మీద బైఠాయించాం.

తేలికపాటి చల్లనిగాలి!

సముద్రం చేసే శాంత గంభీర ధ్వనులు! ఆహ్లాదకరమైన ఆ వాతావరణాన్ని ఆస్వాదించటానికి వచ్చిన అప్సరసలలాగా మా చుట్టూ నడయాడుతున్న అందమైన భామలెందరో! పసిడి వన్నెతో మెరిసిపోతున్న పార్సీ పడతులు! ఎర్రగులాబీలను మించిన ఎర్రని రంగుతో... ఎత్తైన పిరుదులతో... చక్కని శరీర సౌష్ఠవంతో, సజీవ శిల్పసుందరుల్లా తిరుగుతున్న సింధీ స్త్రీలు!

శరీరభాగాలన్నింటినీ బయటకు ప్రదర్శిస్తూ... ఒంటికి ఉండీలేనట్లున్న రంగు రంగుల వస్త్రాలను ధరించి, ప్రియుని చేతి మణికట్టు పట్టుకుని ఊపుతూ... విలాసంగా నడుస్తున్న విదేశీ వనితలు!

ఆ స్త్రీలు తిరుగుతున్న చోట్ల సుగంధ సౌరభం అలలు అలలుగా వ్యాపిస్తోంది. వద్దనుకున్నా వచ్చి ముక్కుపుటాలను తాకుతూ మత్తెక్కిస్తోంది. "నిజంగా నాకు పిచ్చెక్కేట్టుంది!" అన్నాడు మిత్రుడు.

"ఏమనుకున్నావ్? యహ్ బంబయ్యా హై భాయ్! బంబయ్యా!" కించిత్ గర్వంతో అన్నాన్నేను.

వాడుచేసిన పద ప్రయోగం నాకు బాగా నచ్చింది, "నాకూ పిచ్చెక్కేట్టుందిరా" అన్నాను.

చీకటి పడేవేళకి జుహూ బీచ్‌లో ఉన్నాం. చాటూమాటూ అక్కర్లేకుండా 'సమస్త'మైన కార్యకలాపాలూ నిరాటంకంగా కొనసాగే సముద్రతీరమది.

ఒడ్డున మెత్తని ఇసుకలో తీరిగ్గా కూర్చుని ఎత్తయిన అలలతో ఎగిసి ఎగిసి పడే అరేబియా సముద్రపు అందాలను తనివితీరా ఆస్వాదించాం.

ఆ బీచ్‌లో పలుమార్లు అటూ ఇటూ తిరిగి ఒడ్డున మెత్తని ఇసుకలో తీరిగ్గా కూర్చుని 'అన్నీ' చూసేశాక, మళ్ళీ రోడ్ల మీద నడుస్తూ మరెన్నో చోట్లకు వెళ్ళాం.

అంతకుముందు నేను వెళ్ళని ప్రదేశాలకు స్నేహితుణ్ణి తీసుకువెళ్ళి. నేను చూస్తూ వాడికీ చూపించాను.

బీచ్‌లోనూ, మాల్స్‌లోనూ తిరిగేట

**కొత్తగాలి...**

**సైనికులకు వందనం**
**ఎంత ధైర్యం.. ఎంత సాహసం**
**సైనికులకు అభివందనం**
**వారి శిక్షణ ఎందరికో రక్షణ**

– తటవర్తి రామకృష్ణ,
తాళ్లగడ్డ

ప్పుడు ఈ కళ్ళతో చూడతగ్గవీ, చూడకూడనివీ కూడా చూసేశాం.

చూసినంత సేపూ మౌనంగానే ఉన్నా, ఇక ఉండబట్టలేక, 'ఛీ! సిగ్గులేని మనుషులు' అంటూ ఏవగించుకున్నాడు మావాడు.

మర్యాదస్తులెవరికైనా అలాగే అనిపిస్తుంది. వాడి అయిష్టతను గమనించినా వాడితో పాటు మరికొన్ని ప్రదేశాల్లో తిరగక తప్పలేదు. అవేం ఫ్యాషన్లో గానీ... ఇక్కడ కొందరి వస్త్రధారణ సభ్యసమాజం సిగ్గుతో తలదించుకునేట్లుగా ఉంటుంది. ఆడవాళ్లది మరీనూ.

నిజానికి నేనే వాడి చెయ్యిపట్టుకుని ఈడ్చుకుని వెళ్ళాను. ఇలా అనటమే సబబుగా ఉంటుంది.

రాత్రి పన్నెండింటి వరకూ ఏలాగోలా కాలం వెళ్ళదీయాలి మరి! అప్పుడుగానీ పడుకునే చోటు దొరకదు. నా రాజభవనం అప్పటికిగానీ ఖాళీ కాదు!

ఎట్టకేలకు ఆ పుణ్యకాలం సమీపించింది. సరిగ్గా ఆ సమయానికి మిత్రుడిని వెంటబెట్టుకుని చర్చిగేట్‌లోని నా స్థావరానికి చేరుకున్నాను.

సరిగ్గా అప్పుడే రాత్రిపూట గస్తీ తిరిగే వాళ్ళువచ్చారు. వాళ్ళకు స్నేహితుణ్ణి పరిచయం చేసి... ఆరడుగుల జాగాను వాడి కోసం రిజర్వు చేయించాక మిత్రుని వేపుకి తిరిగి, "ఇక పడుకుందామా?" అన్నాను.

"పడుకోక ఇంకా ఇప్పుడేం చేస్తాం?" వాడి మాటల్లో చిరాకు, విసుగు ధ్వనించాయి.

"అబ్బా! ఎంత ఉక్కపోత పోస్తోందో!" స్వగతంగా వాడికి వినపడేటట్లుగానే అన్నాను.

"...."

"పోనీ ఆరుబయటే పడుకుందామా?"

"ఎక్కడో అక్కడ కళ్ళుమూసుకు పడుకోగలిగితే చాలు! కంటినిండా నిద్ర పోయి మూడు రోజులైంది" తెచ్చిపెట్టుకున్న సహనంతో అన్నాడు.

'పాపం అలసిపోయాడు' అనుకుంటూ నా డన్‌లప్ బెడ్ తీశాను. రెండుచేతులతో దాన్ని పైకెత్తి నా శక్తి కొద్దీ దులిపాను.

దానికి పట్టిఉన్న దుమ్ము ఆకాశమంత ఎత్తుకు ఎగసింది. అలా మళ్ళీ మళ్ళీ దులిపిన తరవాత, ఆ కంబళిని సిమెంట్ ఫ్లోర్ మీద పరిచి, జాగ్రత్తగా నాలుగువేపులా సరిచేశాను. మధ్యలో మడతలు లేకుండా చేతులతోనే సాపు చేశాను.

ముందుగా నేనే పడుకున్నాను. నిలువుగా కాదు, అడ్డంగా! నా పక్కన సరిగ్గా నేను పడుకున్నట్లే పడుకోమని స్నేహితునికి సూచించాను. మారు మాట్లాడకుండా పడుకున్నాడు వాడు! వెంటనే మా ఇద్దరికీ ఒళ్ళు తెలీకుండా నిద్ర పట్టేసింది!

తెలతెలవారుతుండగానే మేం నిద్రలేచేశాం. 'కాసేపాగి లేద్దాంలే' అని బద్ధకిస్తూ పడుకోటానికి వీల్లేదిక్కడ... పొద్దు పొడవకముందే లేచి త్వరత్వరగా కాలకృత్యాలు తీర్చుకుని, స్నానాదికాలు ముగించుకుకోవలసిందే!

నా చిన్ననాటి స్నేహితుణ్ణి కూడా ఇక్కడి మిత్ర బృందంతోపాటు నడిపించుకుంటూ రైల్వేస్టేషన్‌కు తీసుకువెళ్ళాను.

ఆ కార్యక్రమాలన్నీ అయ్యాక రోటీవాలా చాచా దగ్గరకు వెళ్ళాం. కొత్త కస్టమర్‌ను తీసుకువచ్చినందుకు సంతోషిస్తూ మాకు మరికాస్త కొత్తిమీరా, జీలకర్రా, మరిన్ని ఉల్లిపాయ ముక్కలూ అదనంగా ఇచ్చాడు.

"ఇదేమిట్రా? నువ్వు నెలనెలా ఠంచనుగా మీ అమ్మకు డబ్బు పంపుతుంటే... ఇక్కడ నువ్వేదో ఉద్యోగం వెలగబెడుతూ దర్జాగా బతుకుతున్నావనుకున్నాను. తీరా చూస్తే ఇదా నువ్వుతినే తిండీ?" ఆ పదార్థాలను చూసి తెల్లబోతూ అన్నాడు.

"ఏం చెయ్యనురా? అక్కడ పూటగడవని పరిస్థితి. మహానగరం గదా.. ఏదన్నా ఉద్యోగం దొరక్కపోతుందా? అని బొంబే వస్తే రోజువారీ వేతనం మీద పని దొరకటమే గగనమైంది. అందులోదే కొంత అమ్మకు పంపుతూ... నేనేదో తినీ తినకా కాలక్షేపం చేస్తున్నాను"

"..............."

బాగా తక్కువ ఆదాయవర్గాలవారు ఈ మహానగరంలో సరైన కూడూగూడూ అమర్చుకోవటం కష్టంరా! మన చదువులకూ... సామర్థ్యానికీ ఎక్కువ ఆదాయం వచ్చే పనులు దొరకటం అసాధ్యం. అందుకే నిన్ను రావద్దన్నాను"

"నేను చెయ్యదగిన పని ఏదీ మన ప్రాంతంలో కూడా దొరకలేదు. ప్రేమలో పడి సరిగ్గా చదువుకోలేదు. చివరికి ఆ ప్రేమలో కూడా విఫలమవటంతో కుంగుబాటుకులోనై నువ్వు ఆదుకుంటావని వచ్చానురా!" అంటూ కళ్ళనీళ్ళ పర్యంతమయ్యాడు వాడు.

"వస్తే వచ్చావులే. బాధపడకు! నీకు ఇష్టమైనంత కాలం నాతోపాటే ఉండొచ్చు! నీక్కూడా ఏదన్నా పని చూస్తాను" వాడి భుజం మీద చెయ్యివేసి మెల్లగా తడుతూ ఓదార్పుగా, "ఇద్దరం ఒకరికొకరం తోడుగా ఉందాం! సరేనా? " అన్నాను.

కళ్ళు తుడుచుకుంటూ నా స్నేహితుడు నన్ను చూసిన చూపులు నాపట్ల కృతజ్ఞతతో నిండి ఉన్నాయి.

గరం చనా వ్యాపారి హాజియార్‌జీ దగ్గరికి మిత్రుణ్ణి తీసుకునివెళ్ళాను. వాడ్ని ఆయనకు పరిచయం చేసి వాడి 'ఐరన్ సేఫ్' నెంబరు తీసుకున్నాను. ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్ఛేంజ్‌లో వాడ్ని పేరు నమోదు చేయటానికి ఆయన సహాయం అర్థించాను.

ఈ మహానగరంలో నాకు తెలిసిన వాళ్ళలో తనకంటూ స్వంత చిరునామా ఉన్న పెద్దమనిషి ఆయనొక్కడే!

ఆయన కూడా "మన రాష్ట్రం నుంచి ఇంతదూరం వచ్చిన ఓ నిరుద్యోగికి ఆ మాత్రం సాయం చెయ్యకపోతే ఎలా? " అంటూ సంతోషంగా ఒప్పుకున్నాడు.

ఆ రోజంతా ఆ పనితో సరిపోయింది.

★ ★ ★

నా పరిచయస్థులందరినీ అడిగి, వాళ్ళు ఎక్కడెక్కడ పనిచేస్తున్నారో తెలుసుకున్నాను. ఆయా చోట్లకు నా మిత్రుణ్ణి వెంటబెట్టుకుని వెళ్ళి వాడికి ఏదన్నా పని దొరుకుతుందేమోనని ప్రయత్నించాను.

ఏడెనిమిది రోజులు కఠినంగా శ్రమించాక వాడికి ఓ పని దొరికింది.

అన్నిరోజులకూ నా జీతంలో కోత పడింది. డబ్బుఖర్చూ... శారీరక కష్టం అదనం!

అయితే బాల్యమిత్రునికి బతుకుతెరువు చూపించగలిగాననే తృప్తి మిగిలింది.

"నీలాంటి స్నేహితుడు ఉండటం నా అదృష్టం!" అంటూ నన్ను గట్టిగా కౌగిలించుకుని కృతజ్ఞతతో ఆనందబాష్పాలు రాల్చాడు వాడు.

★ ★ ★

నా మహల్ ఎక్కడుందనిగానీ... ఆ హర్మ్యాలలో ఏ అంతస్తులో నేను ఉంటు

## కొత్తగాలి...

'చెడు' ముసుగులో
'మంచి' మూగబోతోంది!
'నోటు' వెలుగులో
'ఓటు' గల్లంతైపోతోంది!!

– కె.వి. లక్ష్మణరావు,
మానేపల్లి, తూ. గో జిల్లా

న్నానని గానీ, ఇన్నిరోజుల్లో ఒక్కసారి కూడా అడగలేదు వాడు.

తనంతట తనే హాజియార్‌జీతో పరిచయాన్ని పెంచుకున్నాడు.

నాకు చెప్పకుండానే తనకోసం ఓ 'డన్‌లప్‌బెడ్' కొనుక్కున్నాడు.

ఉచితంగా ఇచ్చే పచ్చి ఉల్లిపాయ ముక్కలూ, జీలకర్రా, కొత్తిమీర తురుమూ నాలాగే ఎంతో ఇష్టంగా తినటం అలవాటు చేసుకున్నాడు.

కొంచెం కొంచెం హిందీ పట్టుబడుతోంది. టిఫిన్ అనటానికి బదులు 'నాస్తా' అంటున్నాడు. పురానీ రోటీలను ఆవురావురుమంటూ తినేస్తున్నాడు!

**కొత్తగాలి...**

**అమ్మానాన్నల**
**పంపకాలలో**
**అమ్మను తీసుకున్నాడు**
**అలుపెరగని శరీరం కదా ఆమెది!**

– పి.వి.ఎస్ ప్రసాద్,
నవులూరు, గుంటూరు జిల్లా

'చద్దిరొట్టెలు' అని ఏవగించుకోటం మానుకున్నాడు!

ఓరోజు రాత్రివేళ విశాలమైన మా పడగ్గదిలో.. ఈ నగరంలో నివసించే ప్రజలూ, నగర సందర్శనార్థం వచ్చిన టూరిస్టులు యావన్మందీ పగలంతా తమ పాదధూళితో పావనం చేసిన కాలిబాట మీద.. మేం మా డన్‌లప్ బెడ్స్ పరుచుకు కూర్చుని బీడీలు తాగుతున్నాం.

అప్పుడు "ఎక్కడన్నా ఓ చిన్నగది అద్దెకు దొరుకుతుందేమో వెతికితే బాగుంటుంది కదరా? " అన్నాడు మిత్రుడు.

ఆ మాటలు విని నవ్వాను. నవ్వొచ్చింది మరి!

"ఇక్కడ దాదాపు పదివేల మంది, కాళ్ళు జాపుకునో, కాలుమీద కాలు వేసుకునో రాజామహరాజుల్లాగా పడుకునేందుకు వీలుంది. ఆకాశమే పందిరిగా, నేలతల్లి ఒడిలో, చల్లనిగాలి వీస్తుండగా పవ్వళించే సౌకర్యాన్ని కాల దన్నుకుని, ఎక్కడో గాలి, వెలుతురు రాని ఇరుకుగదిలోకి వెళ్ళాలను కోవటం మంచిది కాదు. అలాంటి తెలివి తక్కువ ఆలోచన రానివ్వకు!" అంటూ నవ్వుతూనే చనువుగా మిత్రుణ్ణి కోప్పడుతూంటే, ఓ కుక్క వచ్చి నా బెడ్‌మీద నిలబడింది.

దాన్ని దూరంగా తరిమి కొట్టాలనే ఆరాటంతో కళ్ళతోనే రాళ్ళకోసం వెతుకుతున్న నన్ను చూస్తూ మౌనంగా ఉండిపోయాడు వాడు.

కుక్కలంటే నాకు ఆజన్మవిరోధం ఏమీ లేదుగానీ వాటిని కూడా నమ్మలేం!

ఒకవేళ ఈ గ్రామసింహం విశిష్టమైన నా డన్‌లప్ బెడ్‌మీద తనమూత్రమనే రోజ్‌వాటర్‌ను ధారగా వదిలితే నా గతేం గానూ? కంబళి తడిసి కంపుకొట్టదూ?

అందుకే 'ఛీ! ఛీ!' అని పలుమార్లు గట్టిగా అదిలించినా అది పోలేదు. కదలకుండా కంబళి మధ్యలోనే నిలబడింది.

ఇక తప్పదన్నట్లు లేచి... కాస్తదూరం నడిచివెళ్ళి, ఓ మోస్తరు రాయి వెతికితెచ్చి దాన్ని గట్టిగా కొట్టి వెళ్ళగొట్టాను.

నా వీర సాహసకృత్యాన్ని గమనించకుండా తన మనోమయ లోకంలో ఉన్నాడు నా మిత్రుడు. నేను కూడా మరేం మాట్లాడకుండా పడుకుని నిద్రపోయాను.

★ ★ ★

"అది కాదురా! సెలవురోజున కూడా పగలు కాసేపు పడుకోటానికి లేకుండా ఊరట్టుకు తిరగాల్సి వస్తోంది. అర్ధరాత్రి వేళకు ఇక్కడకు చేరుకుని, నలుగురూ

నడిచే ఫుట్‌పాత్ మీద నానా రకాల మనుషులతోనూ కలిసి పడుకోవాలంటే నాకు రోత పుడుతోందిరా! కాస్త భయంగా కూడా ఉంది. ఇంతమందిలో ఎవరెటువంటి వాళ్ళో తెలీదుగా!" మర్నాడు మామూలుగా మా డన్‌లప్ బెడ్స్‌మీద నడుంవాల్చి పడుకోగానే మొదలైన మిత్రుని నస ఇది.

"....."

"పోనీ చవకరకం గదైనా చాలు! మన ప్రైవసీ మనకి ఉంటుంది గదా!"

"ప్రైవసీ సరే! గాలి, నీరు, వెలుతురూ, ఇలాంటి సౌకర్యాలన్నీ ఉండొద్దూ? "

"అద్దెకిచ్చేవాళ్ళు అవన్నీ చూసుకోరా? అద్దెడబ్బు ఊరికే ఎవరూ ఇవ్వరుగా!"

"..."

"పోనీ గరం చనానడగరాదురా? "

"నీమొహం? శనగలెలా చెబుతాయ్? " అంటూ పకపకా నవ్వాను.

"అదే! ఆ కాలికట్ పెద్దమనిషిని అడిగితే బాగుంటుందనీ..."

"ఓహో! హాజియార్‌జీనా! ఆయన్ని గరం చనావాలా అంటార్రా!" అంటూ మళ్ళీ నవ్వాను నేను.

"ఏదో ఒకట్లే. అయినా నా బాధ నీకర్థం కావటం లేదు"

"ఎందుకర్థం కావటం లేదూ? మా బాగా అర్థమవుతోంది. ఆ మాటకొస్తే... ఇలా ఫుట్‌పాత్ మీద పడుకోవటం నాకు మాత్రం కష్టంగా లేదా? గత్యంతరం లేక ఏడవలేక నవ్వినట్లు బాధే సౌఖ్యమనే భావనతో బతికేస్తున్నానుగానీ..."

విని.. మెదలకుండా ఊరుకున్నాడు మిత్రుడు.

"ఇల్లు.. గది ఇలాంటివి అద్దెకు దొరకటమే కష్టం ఇక్కడ. వెతికి వేసారాక ఒక వేళ దొరికినా... ఆ అద్దెలూ అవీ మనం భరించలేంరా!" కాసేపాగాక మిత్రునితో అనునయంగా అన్నాన్నేను.

నాతో వాదించి లాభం లేదనుకుని కళ్ళు మూసుకుని నిద్రకుపక్రమించాడు.

వాడు వెంటనే నిద్రపోయాడు గానీ నాకే చాలా సేపు నిద్ర పట్టలేదు.

'ప్రైవసీ!'... మిత్రుడు వాడిన ఈ పదంతో నాలో కదలిక కలిగింది.

మదిలో ఏదో కలవరం! ఏవేవో ఊహలూ... ఆలోచనలూ!

ఎప్పటికో కలత నిద్రపట్టింది. ఆ కలత నిద్రలోనే ఓ కల...

ఎన్నో మైళ్ళదూరంలో వున్న మా స్వరాష్ట్రం కేరళలోని ఓ కుగ్రామంలో...

## జులై - 2013
## చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ అయిదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.



1. **టి. సుమతీ శ్రీ**
   - సంగారెడ్డి, మెదక్ జిల్లా
2. **ఎం. లక్ష్మీరాజ్యం**
   - న్యూ శాస్త్రి నగర్, హైదరాబాద్
3. **మహ్మద్ రఫీ**
   - జెండావీధి, శ్రీకాకుళం
4. **గరికిపాటి కృష్ణమూర్తి**
   - సాయిపేట, కడప
5. **కొత్తపల్లి సుధాదేవి**
   - వుడ్‌నగర్, చీరాల

## సరైన జవాబులు

| | |
|---|---|
| 1. ప్రసన్నకుమార్ | 6. గిరిధర్ |
| 2. జ్యోతి | 7. మార్సెల్ ప్రూస్ట్ |
| 3. ముగ్గురు | 8. ఇందిరాగోస్వామి |
| 4. విశాలాక్షి | 9. పీతాంబర్ |
| 5. సరస్వతి | 10. సిల్వా |

మట్టిగోడల మీద లేపిన పాత తాటాకు పాక! అది మా దూరపు బంధువుల ఇల్లు. ఇంటిచుట్టూ పచ్చదనం పరుస్తున్న అరటి తోట. ఆ తోటకు ఆనుకుని పట్టపగలు కూడా పాములు తిరిగే అడవి!

ఆ పాములకు ఎంతమాత్రం భయపడకుండా ఇంట్లోనూ, తోటలోనూ హంసలా నడయాడే అమ్ముకుట్టి.. ఇంటి పనులతో అమ్మకూ, తోటపనిలో అయ్యకూ సాయం చేస్తూ, తీరిక లేకుండా తిరుగుతుంటుంది. వాళ్ళు మా ఇంటికి తరచుగా వస్తూపోతూనే ఉంటారు.

జ్ఞాపకాలు అంతవరకూ వెళ్ళగానే, స్వచ్ఛమైన కొబ్బరి నూనె వాసన నా ముక్కుపుటాలను తాకింది.

కుదుళ్ళతో సహా పొడవాటి కురులకు ఆ కుట్టి ప్రతినిత్యం పట్టించే కొబ్బరినూనె వాసన అది! ఆ నూనె ప్రభావం వల్లనే ఆమె జుట్టు నల్లగా నిగనిగలాడుతూ, పొడుగ్గా, ఒత్తుగా పెరిగి ఆ పిల్లకు అందాన్నిస్తూ ఆకర్షణ పెంచుతోంది.

ఆ కురులు నామీద సమ్మోహనాస్త్రంలా పని చేస్తాయి ఎప్పుడూ!

చిన్నప్పుడు వాళ్ళింటికి మేం వెళ్ళినప్పుడు పొద్దస్తమానం మేమిద్దరం కలిసి ఆ అరటితోటలో ఆడుకుంటూ ఉండేవాళ్ళం. ఇంచుమించు నా ఈడుదే!

ఆ అమ్మాయికి ఇంకా పెళ్లి కాలేదనీ, నాకిచ్చి చెయ్యాలనే ఉద్దేశంతో ఉన్నారనీ ఆ మధ్య అమ్మ ఓ ఉత్తరంలో రాసింది.

ఆ పిల్ల నేనంటే ఇష్టపడుతోందని కూడా రాసింది. ఆ ఉత్తరం సంగతి గుర్తుకురాగానే వాళ్ళ తోటలోని ఓ అరటిచెట్టు కింద ఆమె ఏడుస్తూ నుంచున్నట్లు ఓ దృశ్యం నా మనోనేత్రం ముందు కదలాడింది.

"అమ్ముకుట్టీ! ఏడుస్తున్నావెందుకూ? "

"ఏమో! తెలీదు. నాకే తెలీటంలేదు"

"ఏడవకు అమ్మూ! నేను వస్తాను. వచ్చేస్తానంటున్నాగా!"

ముఖాన్ని కొంగుచాటున దాచుకుని ఏడుస్తూనే పరిగెత్తుతోంది. అదిగో అరటి తోట అంచువరకూ వెళ్లింది. అలసిసొలసి పరుగెత్తలేక పాములు పట్టపగలు తిరిగే ఆ అడవి ముందర నిలబడింది.

కంగారుగా వెళ్ళి కాస్త ఎత్తైన చోట నిలబడి ఆమెను పిలుస్తున్నాను. "అమ్ముకుట్టీ! అమ్ముకుట్టీ!"

నా పిలుపు వినపడిందో లేదో కానీ ఆమె బదులు పలకటం లేదు.

"ఒరేయ్! ఛాతీ.. నా ఛాతీ!" బిగ్గరగా అరుస్తూ, బలంగా నన్ను పక్కకు తోసేశాడు నా పక్కనే పడుకున్న మిత్రుడు.

దెబ్బకు మెలకువ వచ్చింది నాకు. కల చెదిరిపోయింది!

"సారీరా! నాకేదో కల. అందులో కాస్త ఎత్తైన చోట.." అంటూ చెప్పబోయాను.

నా సంజాయిషీ వినిపించుకోకుండానే మరో పక్కకి తిరిగి పడుకున్నాడు.

★ ★ ★

"నువ్వేన్నన్నా చెప్పు! నాకిలా బాగుండటంలేదు! వానలో, చలిలో ఏమైపోతాం? ఆలోచించు!" మర్నాడు నడిరేయి దాటాక నడుం వాల్చగానే మళ్ళీ మొదలెట్టాడు.

"సరే! వెతుకుదాంలే! గట్టిగా ప్రయత్నిస్తే ఎక్కడో అక్కడ.. ఏదో ఒక గది దొరక్కపోదు!" నా మాటలు నాకే వింతగా ధ్వనించాయి.

అలా అన్నది నేనేనా? ఈ మహానగరంలో మాబోటివాళ్లు ఓ గది అద్దెకు తీసుకోగలగటం కల్ల అని నాకు తెలీదా?

నాతోపాటు ఇక్కడే, ఈ ఫుట్‌పాత్‌మీద ఉంటున్నవాళ్ళు గదికోసం ప్రయత్నించి వారి అనుభవాలను నాకు చెప్పలేదూ? 'పగడీ' ఇవ్వాలన్నారనీ, అదనీ.. ఇదనీ.. అంతంత అద్దెలు చెల్లించటం మనబోటి వారివల్ల కాదనీ.

# ప్రియమైనవేంటో తెలుసా?




ఎక్కువ ధరగల వస్తువులను 'బంగారంలా ప్రియమైనవి' అంటాం. కాని బంగారంకంటే అధిక ధరగల లోహాల్లో రోడియం ఒకటి. తుప్పు పట్టని దీన్ని 1803లో కనుగొన్నారు. న్యూక్లియర్ రియాక్టర్లలో వాడతారు. గ్రాము బంగారం 56 డాలర్లయితే, రోడియం ధర 58 డాలర్లు. ఈ రెంటికంటే ప్రియమైనది ప్లాటినం. అది అరవై డాలర్లు. మెథమ్ ఫెటామైన్ అనే స్ఫటికంలాంటి పదార్థం వీటన్నింటికంటే ఎక్కువ ధర గలది. దానికి గ్రాముకు నూరు డాలర్లు. ఇది మంచులా ఉంటుంది. దీని తయారీ, వినియోగాన్ని ప్రపంచవ్యాప్తంగా అమెరికా నియంత్రిస్తోంది. దీన్ని ఔషధాల్లో ఉపయోగిస్తారు. రైనోమృగం కొమ్ము ధర గ్రాముకు 110 డాలర్లు.




దీన్ని ఆయుర్వేదంలో వాడుతారు. వీటి కంటే ఎక్కువ ధర పలికేది హెరాయినే. దాని ధర గ్రాముకు 130 డాలర్లు. అమెరికాలోకి ఇది స్మగుల్ అవుతుంది. ఇటీవల నైజీరియా నుంచి హైదరాబాదుకు ఇది భారీగా స్మగుల్ అయిందనీ, కొంతమంది ప్రముఖుల పిల్లలు దీన్ని వినియోగిస్తున్నారనే వార్తలు వచ్చాయి. హెరాయిన్ కన్నా ఎక్కువ మత్తును కలిగించే పదార్థం కొకెయిన్. దీని ధర గ్రాముకి 215 డాలర్లు. ఇది చక్కెరపొడిలా ఉంటుంది. ఎల్.ఎస్.డి. అనే మరో మత్తు పదార్థం ధర గ్రాముకి మూడువేల అమెరికన్ డాలర్లు. అణుపరిశ్రమలో విరివిగా వాడే ప్లుటోనియం ధరం గ్రాముకు నాలుగు వేల డాలర్లు. పైనైట్ లోహం ధర గ్రాముకు తొమ్మిదివేల డాలర్లు. ఇది అత్యంత అరుదైన లోహం. మయన్మార్‌లోనే లభ్యమవుతుంది. 2005 దాకా వంద కిలోల లోపు పైనైట్ లభించింది. రిచర్డ్ టాఫియెట్ అనే మరో మినరాలజిస్టు 1945లో ఓ అలంకరణ లోహాన్ని కనుగొన్నాడు. దీని ధర గ్రాముకి ఇరవై వేల డాలర్లు. అంతకంటే ఎక్కువ ధర ట్రిటియం అనే లోహానిది. దీని ధర గ్రాముకి ముప్పైవేల డాలర్లు. వజ్రం ధర కారెట్‌కు యాభైఐదు వేల డాలర్లు. కేలిఫోర్నియం అనే మరో లోహం ధర గ్రాముకి 2.7కోట్ల డాలర్లు! 1950లో దీన్ని అణుపరిశ్రమ కోసం కేలిఫోర్నియా శాస్త్రజ్ఞులు కనుగొన్నారు.

ఇక బంగారం కంటే కింది స్థాయిలో ఉన్నది కుంకుమ పువ్వుధర. అది గ్రాముకి పదకొండు డాలర్లే!

అన్నీ తెలిసీ మిత్రునికి వంతపాడటంలో నా ఆంతర్యమేమిటీ?

రాత్రి వచ్చిన కల ప్రభావమో ఏమో!

ఎందుకోమరి తెలీదు.. ఆ రాత్రి కూడా సరిగ్గా నిద్రపట్టలేదు నాకు. ఏదో వ్యాకులత! అదో రకమైన అశాంతి!

నేను చూసిన చలన చిత్రాలలోని దృశ్యాలెన్నో ఒకదాని తర్వాత ఒకటిగా నా మనోయవనికపై కదలాడసాగాయి.

"అందుకేనా ఈ అశాంతి? "

"అందుకేగా మరీ!"

ప్రశ్నా నాదే! జవాబూ నాదే!

నా మనసులోని కోరిక నాకు తెలుస్తూనే వుంది. ఇంకెందుకూ ఆలస్యం?

మర్నాడే హాజియార్‌జీని కలిసి మా ఉద్దేశాన్ని తెలియజేశాం.

ఆయన పరిచయం చేసిన ఏజెంట్ ద్వారా మా గృహాన్వేషణ ఆరంభమైంది.

'వసతి గృహం అంటే అన్ని వసతులతో అలరారే చక్కని గృహమని కాదు. వీలై నంత తక్కువ అద్దెలో దొరికే కాస్త పెద్ద గది' అంటూ ఆ ఏజెంట్ కు స్పష్టం చేశాం.

"మీకు ఎలా కావాలంటే అలాగే చూద్దాం" అన్నాడాయన.

అతను రమ్మన్న చోటుకల్లా వెడుతూ... ఈ మహానగరంలోని పేదల బస్తీలన్నీ కాళ్ళరిగేలా తిరుగుతున్నాం.

"వెయ్యి రూపాయల పగడీ ఇస్తారా? "

"పగడీ అంటే..? " అంటూ అయోమయంగా నా వంక చూశాడు మిత్రుడు.

"కాలేజీల్లో స్టూడెంట్స్ కట్టే కాషన్ డిపాజిట్ లాంటిది. మనం గది ఖాళీ చేసేటప్పుడు తిరిగి ఇచ్చేస్తారు"

"ఇక్కడ ఇదొకటుందా? " అంటూ తెల్లబోయాడు.

"మరదే నే చెప్పింది.. అద్దె గది కావాలంటే అడిగినవన్నీ ఇవ్వాల్సిందే!"

ఒక బస్తీకి, మరోబస్తీకి అద్దెల్లోనూ, పగడీ మొత్తాల్లోనూ వ్యత్యాసం ఉంది.

"వెయ్యిన్నర రూపాయలు పగడీగా ఇస్తారా? "

"రెండువేలు"

"రెండున్నరవేల పగడీ! ఆర్నెల్ల అద్దె ఎడ్వాన్స్"

"మూడువేలు పగడీ.. ఏడాది అద్దె ఎడ్వాన్స్"

'దేవుడి పాట నూట పదార్లు, రెడ్డిగారి పాట రెండొందలు, రాజుగారి పాట వెయ్యి' అనే వేలంపాట చందంగా తిరిగిన కొద్దీ పగడీ, ఎడ్వాన్స్ ఇవ్వాల్సిన మొత్తం పెరిగిపోతూనే వున్నాయ్!

అంతంత డబ్బే ఉంటే, మాకు ఫుట్ పాత్ పడకలు ఎందుకూ? పురానీ రోటీలు ఎందుకూ?

ఇక మా వల్ల కాదంటూ ఆ ఏజెంట్ కు దణ్ణం పెట్టేశాం. మా ఇద్దరికీ తెలిసిన కార్మికులందరికీ చెప్పి, అవకాశం కోసం ఎదురుచూడసాగాం.

అలా ఎదురుచూపులతోనే సరిపెట్టకుండా మేమూ ప్రయత్నాలు చేస్తున్నాం.

అలా కొన్ని నెలలు గడిచిన తరువాత మాతుంగలో మాకోగది అద్దెకు దొరికింది.

పగడీ, అడ్వాన్సూ ఇలాంటివేవీ అక్కర్లేదు. అద్దె చెల్లిస్తే చాలు!

ఏదో కోర్సు చదవటానికి విదేశానికి వెళుతున్న ఓ మలయాళీ యువకుడు, 'మూడు నెలలకు మాత్రమే' అనే షరతు మీద తనగదిని మాకు అద్దెకు ఇవ్వటానికి ఒప్పుకున్నాడు. అద్దెడబ్బు కూడా ఈ లోపల సమకూర్చుకుని తను తిరిగి రాగానే ఇస్తే సరిపోతుందన్నాడు.

మేమిద్దరమే ఉండాలనీ, ఎవరెవరినో చేర్చి గది ఖరాబు చెయ్యకూడదనీ ఒప్పందం రాయించుకున్నాడు.

'సాటి మలయాళీలనే అభిమానంతో ఏదో కొన్నాళ్ళపాటు ఉంటారని ఇస్తున్నాను' అని అన్నాడు.

ఎంత మంచి మనిషి!

తను గదిని అద్దెకు ఇచ్చిన విషయాన్ని నలుగురికీ తెలిసేట్లు చాటింపు వెయ్యకుండా రహస్యంగా ఉంచాలన్నాడు.

ఇన్ని షరతులతోనే అయినా ఈ బాంబేలో మా బోటివాళ్ళక్కూడా ఉండటానికి ఓ గదంటూ దొరకటం గొప్ప సంగతి.

సంతోషంతో పొంగిపోతూ మా ఐరన్ సేఫ్‌లూ, డన్‌లప్ బెడ్సూ తీసుకుని ఆ గదిలోకి మారిపోయాం.

అందులో చేరిన మర్నాటి నుంచే మేమిద్దరం ఒకరికి తెలీకుండా ఒకరం మా ఇళ్ళకు ఉత్తరాలు రాయటం మొదలు పెట్టాం.

పది రోజుల తరవాత నుంచీ మాకు





జవాబులు రావటం మొదలైంది. ఇప్పటికీ మా చిరునామా హాజియార్‌జీదే కనుక ఆ లేఖలన్నీ ఆయన చేతుల్లోనే పడేవి.

"మీకో గది దొరికిందనే సంతోషాన్ని స్వరాష్ట్రంలోని బంధుమిత్రులందరితో పంచుకుంటున్నారా? అసలు ఎవరెవరికి రాస్తున్నారూ? ఏమని రాస్తున్నారూ? ఇన్నాళ్ళూ లేనిది... ఇప్పుడు మీకు ఇన్నిన్ని జాబులు వస్తున్నాయేమిటి? " అంటూ ఆరా తీశాడాయన.

నేను నవ్వి ఊరుకున్నానుగానీ సంగతేమిటో చెప్పలేదు. మిత్రుడు కూడా మౌనంగానే ఉండిపోయాడు.

"మీ రహస్యాలు తెలుసుకోవాలనే కుతూహలం నాకేం లేదుగానీ.. మీమీ పెద్దలూ, మీరూ ఏకాభిప్రాయానికి వచ్చి మంచి నిర్ణయం తీసుకోండి. ఇక్కడే అడుగులు జాగ్రత్తగా పడాలి సుమా!" అంటూ ఆత్మీయంగా హెచ్చరించాడాయన.

ఆ పెద్దరికానికీ, చనువుకూ అబ్బురపడిపోతూ అలాగేనంటూ తలలూపాం.

చాన్నాళ్ళ తరువాత అమ్మ నుంచి వచ్చిన ఉత్తరం నాకు కమ్మని కబురందించింది. అమ్ముకుట్టితో నా వివాహం నిశ్చయమైంది.

"నా పెళ్ళి కుదిరిందిరా! ఈ నెల పందొమ్మిది రాత్రికే సుముహూర్తం. మళ్ళీ వారం ఊరెళ్ళాలి" అంటూ నా సంబరాన్ని మిత్రుడితో పంచుకోబోయాను.

నా మాటలు వింటూనే వాడు ముఖం మాడ్చుకున్నాడు. నేనేదో తనను మోసం చేసేసినట్టనుకుంటున్నాడు.

"అప్పుడే ఎందుకులే అని నీకు చెప్పలేదుగానీ నాక్కూడా మావాళ్ళు సంబంధాలు చూస్తున్నారు" అన్నాడు.

"ఈ సంబంధంవాళ్ళు మా బంధువులేరా! మా సాటివాళ్ళేలే! అందుకే తొందరగా కుదిరింది" అసలు సంగతి చెప్పాను.

కాసేపు మౌనంగా ఉన్నాక మామూలుగా అయిపోతూ "ఎప్పుడు తిరిగొస్తావ్? " అని అడిగాడు.

"పెళ్లయిన తెల్లారే బయల్దేరిపోతాను. జీతం నష్టంలేని సెలవు ఓ వారం రోజులే ఇస్తారు. రానూ పోనూ ప్రయాణానికే సరిపోతుందిగా!"

"మరి ఆమె? "

"వెంటబెట్టుకునే వస్తాను"

"..."

"ఇంతకీ నీ సందేహమేమిట్రా? " వాడి ముఖంలోకి సూటిగా చూస్తూ అడిగాను.

"నా సంగతేమిటి? నేనెక్కడుండాలీ? "

"మాతోనే వుందువుగాని. మనం కలిసే ఉంటాం. గది కాస్త పెద్దదేగా? ఏదో ఓ ఏర్పాటు చేద్దాంలే"

వాడు ఎగాదిగా నావంక చూసి ఊరుకున్నాడు. ఆ వాలకం చూస్తే నా అభిప్రాయం నచ్చినట్లు లేదు. అయినా ఆక్షేపించలేదు. ఆ సంభాషణ అంతటితో ఆగిపోయినా వాడెందుకో కలవరపడుతున్న మాట నిజం!

ఓ ఇంటివాణ్ణవబోతున్నానన్న సంతోషం నా అణువణువునా తొణికిసలాడసాగింది.

అక్కడ ఇంట్లోకి కావాల్సినవీ, ఇక్కడ కొత్త కాపురానికి సమకూర్చుకోవలసినవీ...

## కొత్తగాలి...

**అనుభవం**
**కొమ్మలకు**
**చిగుళ్లు**
**ఊహలు!**

– కొట్టి రామారావు,
మచిలీపట్నం

అన్నీ నేనే కొనుక్కోవాలి. అయినవాళ్ళ ద్వారా రాయబారాలు నడిపించి పెళ్ళంటే కుదర్చగలిగింది గానీ వయసు మీద పడ టంతోపాటు, లేమితో అల్లాడుతున్న అమ్మ ఏం చెయ్యగలదూ? బాధ్యత అంతా నాదే!

ఇక్కడికి అమ్ముకుట్టిని తీసుకురాగానే వంటావార్పుకు అవసరమైన సామాన్లన్నీ ఒక చీటీ రాశాను.

ఒక స్టవ్, కొన్ని అల్యూమినియం గిన్నెలూ, వాటికి మూతలూ, తినటానికి కంచాలు, ప్లేట్లు, గ్లాసులూ... కాఫీ, టీలు పెట్టుకోవటానికి కావల్సిన చిన్నచిన్న గిన్నెలు, కప్పులూ, సాసర్లూ... అన్నీ కొనాల్సిందే! ఏది లేకపోయినా బండి నడవదు.

పెళ్ళి చేసుకోవటానికి వెడుతున్నానాయె! బంధువులెవరికీ పెట్టలేకపోయినా శుభ కార్యానికి నిలబడాల్సిన తల్లికీ, చెల్లికీ బట్టలు కొనాలి. పెళ్ళి కూతురికి, అత్తమామలకూ మా తరఫున పెట్టవలసిన పెళ్ళి బట్టలు కొనటం తప్పనిసరి ఖర్చు.

రానూ పోనూ ఛార్జీలకయ్యే మొత్తం కూడా తక్కువేం కాదు! ఇక ప్రయాణంలో దారి ఖర్చులు సరే సరి. మాంగల్యానికి తగు మొత్తం వెచ్చించి తీరాలి. ఇవన్నీ కలిసి తడిసి మోపెడవుతాయి.

గది అద్దెకు ఇవ్వాల్సిన సొమ్ము జమ చెయ్యాలి గదా!

నా ఆదాయానికి, కళ్ళకు కట్టినట్టు కన పడుతున్న ఖర్చుకూ పొంతన లేదు.

ఇవన్నీ తలుచుకుని బెంబేలెత్తిపోతూ... హాజియార్‌జీని కలుసుకుని నా గోడు వెళ్ళబోసుకున్నాను.

ఆ మంచిమనిషి నాకు ధైర్యం చెబుతూ ఈ శుభకార్యాన్ని గట్టెక్కించటానికి తను కొంత మొత్తం సర్దుతానన్నాడు. వాయిదాల పద్ధతిలో అసలు చెల్లిస్తే చాలన్నాడు. ఆయన్నే వెంటబెట్టుకు వెళ్ళి ఆయనకు తెలిసిన దుకాణాల్లోనే గృహోపకరణాలన్నీ కొనేశాను.

నాతోపాటు పనిచేసే స్నేహితుల దగ్గర చేబదుళ్ళు చేసి, వాళ్ళకు తెలిసిన దుకాణాల్లో చవకరకం దుస్తులు కొన్నాను.

ఫ్యాక్టరీ నుంచి కొంత ఎడ్వాన్సు తీసుకుని, నా మిత్రుడిని వెంటబెట్టుకుని వెళ్ళి.. మా మలయాళీల సంప్రదాయం ప్రకారం పెళ్ళికి కావాల్సిన వస్తువులతోపాటు మంగళసూత్రం సమకూర్చుకున్నాను.

సహకార్మికులు చందాలు వేసుకుని పెళ్ళి కానుకగా ఇచ్చిన డబ్బును ఖర్చులకని చేతిలో ఉంచుకున్నాను.

కొత్త కాపురానికని కొన్న వస్తువులను అద్దె గదిలోనే అట్టిపెట్టి, ఊరికి తీసికెళ్ళేవన్నీ అట్టపెట్టెలలో సర్దుకుని, రేపు పెళ్ళనగా ఇల్లు చేరుకునేట్లు ప్రణాళిక సిద్ధం చేసుకుని రైలెక్కాను.

మిత్రుడు నాతోపాటు వచ్చి, సామాన్లు మొయ్యటంలో సాయం చేశాడు. శుభాకాంక్షలు తెలియజేస్తూ రైలు కదిలేదాకా ఉండి వీడ్కోలు పలికాడు.

★ ★ ★

ఇరుపక్షాలవాళ్ళం నిరుపేదలమే కావటంతో ఆడంబరాలు, ఆర్భాటాలకూ పోకుండా పెళ్ళి వేడుకలను జరిపించుకోవాలని ముందుగానే అనుకున్నాం.

బాగా దగ్గరి బంధువులూ, సన్నిహితుల ఇళ్లకు స్వయంగా వెళ్ళి పెళ్ళికి రమ్మని ఆప్యాయంగా ఆహ్వానించాం.

పిలిచిన వాళ్లందరూ సరిగ్గా సుముహూర్తం వేళకు తరలివచ్చారు. వారందరి సమక్షంలో శుభకార్యం నిర్విఘ్నంగా జరిగిపోయింది. పెళ్ళిలో అడుగడుగునా పొదుపు మంత్రమే వల్లించాను నేను.

ఆ రాత్రి పెళ్ళితంతు ముగిసింది. తెల్లవారే బొంబేకి బయల్దేరతానన్నాను. అత్తామామలు, తల్లి, చెల్లి ఎంత బతిమాలినా సెలవు లేనందున కుదరదంటూ, కుట్టిని



కూడా వెంటబెట్టుకుని వెళ్ళాలనే దృఢ నిశ్చయాన్ని అందరిముందూ వెల్లడించాను.

ఇక తర్కించి లాభం లేదనుకుని పెళ్ళికూతుర్ని నాతో పంపించే ఏర్పాట్లలో నిమగ్నమయ్యారు వాళ్ళు.

★ ★ ★

అమ్ముకుట్టిని తీరిగ్గా చూసే అవకాశం నాకు చిక్కింది, రైలు బయలుదేరి వేగం పుంజుకున్న తరవాతనే.

'చిన్నప్పుడు నాతో ఆడిపాడిన చుట్టాల

మ్మాయి ఈమేనా?' అని ఆశ్చర్యపోతూ కనురెప్పలు వాల్చకుండా ఆ కుట్టీనే చూస్తూ కూర్చున్నాను.

ప్రతి అవయవంలోనూ నిండు యవ్వనం తొణికిసలాడుతున్న యువతిగా చకచకా ఎదిగిపోయింది. ఆడపిల్లా అరటి చెట్టూ సమానమనేది ఇందుకేనేమో! అల నాటి ఆ చిన్నపిల్ల ఇప్పుడు పెళ్ళికళతో కళ కళలాడుతూ ముద్దబంతిలా ముద్దొస్తోంది. ఆమెను ఆనుకుని కూర్చున్న నాలో ఆ యవ్వన సౌందర్యం గిలిగింతలు పెడుతోంది. ఆమె కురుల నుండి వచ్చే కొబ్బరినూనె వాసన మత్తెక్కిస్తోంది.

★ ★ ★

లక్షలాదిమంది కాలిబాటల మీదనే బతుకులు వెళ్లదీస్తున్న బాంబే నగరంలో నాకంటూ ఓ గూడు కుదుర్చుకుని, నన్ను ఇష్టపడుతోందని తెలుసుకున్న యువతిని ఆ గూడు కుదిరిన వెంటనే పెళ్ళి చేసుకుని.. ఆ పెళ్ళికూతురితో కలిసి అదే బాంబే మహానగరానికి హనీమూన్‌కు వెడుతున్నందుకు నన్ను నేను అభినందించుకుంటూ సంతోషంతో ఉక్కిరిబిక్కిరయిపోతున్నాను నేను.

కొత్త కాపురంలోని అనురాగాలను, ఆనందాలను కూడా ఆ మహానగరంలోనే అనుభవించబోతున్నాను. ఇది నిజంగా గొప్ప సంగతి.

ఈ ఆలోచనల్ని నా జీవిత సహచరితో పంచుకుందామంటే.. ఆమె అసలు నాతో మాట్లాడే స్థితిలో లేదు. తల్లిదండ్రులను వదిలి దూరంగా వచ్చేస్తున్నందుకు కలతపడుతూ దోసిట్లో ముఖం దాచుకుని వెక్కి వెక్కి ఏడుస్తోంది. చుట్టుపక్కల కూర్చున్న ప్రయాణికులు తనను గమనిస్తున్నారన్న ధ్యాస కూడా ఆమెకు లేదు. ఏడుపు తప్ప మరోటి తెలీని అమాయకురాలు.. పాపం!

"ఎందుకా ఏడుపూ? ఇంతవరకూ నువ్వు కనీవినీ ఎరుగని మధురానుభూతులను అందించబోయే మన ఇంటి ద్వారాలు తెరచుకోబోతున్నాయి. ఆ ఇల్లు మనకోసం ఎదురుచూస్తోంది. ఇప్పుడు నిన్ను ఆ స్వర్గసీమకే తీసుకువెడుతున్నాను. నీకు నేను లేనూ" అంటూ ఆమె భుజం మీద మెల్లగా చేత్తో తడుతూ ధైర్యం చెప్పటానికి ప్రయత్నించాను.

ఆ స్పర్శతో ఆమె మరింత ముడుచుకుపోయింది. సిగ్గుల మొగ్గ!

పక్కపక్క సీట్లలోనే కూర్చుని ప్రయాణిస్తున్నా మేమిద్దరం పెద్దగా మాట్లాడుకోవటంలేదు.

నిద్రమత్తులో ఆమె నా భుజం మీద తల వాల్చి పడుకుంటే ఆ స్పర్శ నాకు గిలిగింతలు పెడుతూ పరవశింపచేస్తోంది.

తను మాత్రం మెలకువ రాగానే ఏదో తప్పు జరిగిపోయినట్లు సర్దుకు కూర్చుంటోంది. అది చూసి నేను చిరునవ్వులు నవ్వితే సిగ్గుపడుతూ ముఖం మరోవేపుకు తిప్పుకుంటోంది. నేను సరదాగా ఏ మాట అన్నా తను ముఖం ముడుచుకుంటోంది.

ఆ పిల్లకు ఇంకా కొత్త పోలేదాయె! పెళ్ళి పీటల నుంచి లేవగానే తిన్నగా రైలెక్కించి కాపురానికి తీసుకువస్తున్నానాయె!

నేను కూడా ఇక ఆమెను ఉడికించకుండా భవిష్యత్ కార్యక్రమాన్ని గురించిన ఆలోచనలలో మునిగిపోయాను.

★ ★ ★

మాతుంగా వెళ్లాలంటే విక్టోరియా టెర్మినస్ వరకూ ప్రయాణించక్కర్లేదు. దాదర్‌లో దిగిపోతే చాలు.. దగ్గరవుతుంది.

హాజియార్‌జీ, నా మిత్రుడూ నా కోసం ఏ స్టేషన్‌లో ఎదురుచూస్తూవుంటారో తెలీదుగదా! పొరపాటయింది. బయల్దేరేటప్పుడే అడగాల్సింది.

కార్ఖానాలో నాతోపాటు పనిచేసే

దోస్తులు మాకు స్వాగతం పలకటానికి వస్తారా?

బహుశా రారనుకుంటా! ఒకరోజు వేతనం కోల్పోవటానికి ఎవరు ఇష్టపడ తారు? పాపం! వాళ్ళు కూడా నాలాంటి వాళ్ళేగా!

నా సహకార్మికుడు పత్మని ఆండీ వస్తా డనుకుంటా. వాడికి పని నేర్పించింది నేనే కదా! వాడికి ఆ కృతజ్ఞత వుంది. నన్ను అభినందించటానికి వస్తే రావచ్చు

దారిపొడుగునా నా ఆలోచనలు ఇలాగే సాగిపోయాయి.

★ ★ ★

మూడు పగళ్ళూ, మూడు రాత్రుల సుదీర్ఘ ప్రయాణం తర్వాత మా ట్రైన్ దాదర్ సమీపించింది. అక్కడ ఈ రైలు ఐదు నిమిషాలే ఆగుతుంది.

ఆ కాస్త వ్యవధిలోనే సామాను కిందికి దించి, మేం కూడా దిగెయ్యాలి.

బియ్యప్పిండితో చేసిన పిండివంటలూ, అరటికాయ చిప్స్, అప్పడాలు ఇలాంటి వన్నీ చిన్న డబ్బాలలో పోసి, ఓ రేకు పెట్టెలో పెట్టి, తాళంవేసి ఇచ్చింది అమ్మ.

అదికాక అమ్ముదీ, నాదీ చెరోపెట్టే ఉన్నాయ్. ఆ పెట్టెలతో సహా తలుపు దగ్గరే నిలబడి రైలు ఆగగానే వాటిని గబగబా ప్లాట్‌ఫామ్ మీదకు చేర్చాను.

జనం తోసుకుంటూ దిగుతూనే వున్నారు. గార్డు ఈల వేశాడు. అయినా అమ్ము దిగదేం? మళ్ళీ నేనే లోపలికి వెళ్ళి చూస్తే తలుపుకు ఒక పక్కగా నిలబడి ఉంది.

"అమ్ముకుట్టీ! ఇంకా అలాగే నిలబడ్డావేం? త్వరగా దిగు! బండి బయల్దేరబోతోంది" అంటూ తొందరపెట్టాను.

నా మాటల ప్రభావం ఆమె మీద పని చేసినట్టు లేదు.

తనను ఎవరెక్కడ తాకుతారోనని ఒదిగి ఒదిగి నిలబడుతోంది. ఇక లాభం లేదని నేనే తనని రెండు చేతుల్లో ఎత్తి... ప్లాట్‌ఫామ్ మీదకు దించాను.

ఇలా దించానో లేదో.. అలా బండి బయల్దేరిపోయింది!

కాస్త ఊపిరి పీల్చుకున్నాక చుట్టూ కలయజూశాను. కాస్త దూరంలో ఉన్న ఓ స్తంభం పక్కన నిలబడి చోద్యం చూస్తున్నాడు వాడు. అదే.. నా మిత్రుడు!

పుష్పగుచ్ఛాలూ, పూలమాలలూ... ఇలాటివేవీ లేవు. ఖాళీ చేతులతోనే నిలబడి ఉన్నాడు. స్వాగత సత్కారాలన్నీ... బహుశా స్టేషన్ బయట చేస్తారేమో! హాజియార్‌జీ, ఇతర మిత్రులూ అక్కడే ఎదురు చూస్తున్నారేమో!

అయినా వాడు మాటాపలుకూ లేకుండా అలా నిలబడిపోయాడేం?

గది దొరకగానే తనకంటే ముందు నేను పెళ్ళి చేసేసుకున్నానని కోపగించుకుంటున్నాడా? లేక నా అర్ధాంగిని చూసి అంత అనాగరికంగా, అందవిహీనంగా ఉందేమిటా? అని ఆశ్చర్యపోతున్నాడా?

ఆ ఆలోచన రాగానే అమ్ముకుట్టి మీద దృష్టి సారించాను.

ఆమె తలకు పట్టించుకున్న నూనె నుదుటి మీదకు కారుతూ ఆ ముఖాన్ని జిడ్డు జిడ్డు చేసేస్తోంది.

## కొత్తగాలి...

'వర్ష'రుతువు
రాకతో
'మల్లె'మందగిస్తే...
'గులాబి'గుబాళించింది

– వెల్మల రాంరెడ్డి,
కరీంనగర్ జిల్లా

పెళ్ళిలో నేను పెట్టిన చవకరకం సిల్కు చీర కట్టుకుని, రెండు చేతులకు రెండేసి డజన్ల గాజులు వేసుకుని, సిగ్గుతో మొగ్గల్లే ముడుచుకుపోతూ.. నేను ప్లాట్ ఫామ్ మీద పెట్టిన పెట్టెల పక్కన తలవంచు కుని నిలబడి ఉంది.

కాస్త పెద్దసైజు గుడ్డ సంచినీ ఓ చేత్తో గట్టిగా పట్టుకుంది.

చెప్పుకోదగ్గ అందగత్తె కాకపోయినా అమ్ముకుట్టి మరీ అంత అనాకారి కాదు. యవ్వన శోభతో అలరారుతూ, ఆకర్షణీ యంగా ఉంది.

"అలా నిలబడిపోయావేం? నువ్వు వచ్చి ఎంతసేపయింది? " అని మిత్రుడిని పలకరించి, "ఇలా వచ్చి ఓ పెట్టె అందుకో!" అని పిలిచాను.

నా పిలుపు విని ముందుకువచ్చి. పాపం ఓ పెద్దపెట్టెను చేతిలోకి తీసుకు న్నాడు వాడు.

మిగతావి రెండూ నేను పట్టుకుని, "అమ్మూ! వెడదాం పద! నీకు ఇక్కడ అంతా కొత్త! మమ్మల్ని అనుసరిస్తూ గబ గబా నడవాలి" అని ఆమెను హెచ్చరిస్తూ ముందుకు కదిలాను.

నేనూ నా మిత్రుడూ పెట్టెలు మోస్తూ ముందుకుపోతున్నాం. ఆ జన సందో హాన్ని, పరిసరాలనూ బెరుకు బెరుకుగా పరికిస్తూ మా వెనకాలే నడుస్తూ వస్తోంది నవ వధువు.

★ ★ ★

మేమిద్దరం కాస్త ముందుకు వెళ్ళాక, "ఇప్పుడు ఎక్కడికి వెడదామనీ? " అడి గాడు వాడు.

"ఎక్కడికో ఎందుకూ? మన గదికే పోదాం"

"..."

"మాట్లాడవేమిత్రా? అదోలా ఉన్నావే మిటీ? "

"చెప్పాలంటే భయంగా ఉందిరా! వదిన్ని కూడా వెంటబెట్టుకొస్తివి! ఇప్పు డెలా? " అంటూ నీళ్ళు నమిలాడు.

"అది మనం ముందు అనుకున్నదేగా? "

"నువ్వు అనుకున్నావు సరే! తీరా నువ్వు వెళ్ళిన తరవాత మూడోరోజుకే ఇక్కడ గది గాయబ్!"

వాడి మాటలతో నాలో కోపం కట్టలు తెంచుకుంది. గట్టిగా అరిచి నా ఆగ్రహాన్ని వ్యక్తం చెయ్యటానిక్కూడా లేదు. వెనకాలే వధువు వస్తోంది.

అందుకని తర్వాత నెమ్మదిగా "అలా అంటావేమిత్రా? మూడు నెలలకని మనం గది కుదుర్చుకుని ఉంటున్నాం! హఠాత్తుగా ఆ గది ఎలా పోతుంది? ఎవరు తీసుకుం టారు? ఒక వేళ నువ్వే ఏదన్నా...? " అంటూంటే, ఇక ఆపుకోలేని ఆవేశం, ఆవే దనతో మాటలు పెగల్లేదు నాకు.

"అంతమాట అనకురా! నీ పెళ్ళి కుదిరిం దని నువ్వు చెప్పగానే నాకన్నా ముందు నీకు కుదిరిందని ఏదో కాస్త ఇదైన మాట నిజమే. కానీ నీపట్ల అసూయ పెంచుకుని బాల్యమిత్రుడివైన నీకు నిలువనీడ లేకుండా చేసేటంత దుర్మార్గుణ్ణి కాదురా! ఇదేనా నువ్వు నన్నర్థం చేసుకున్నదీ? కూర్చున్న కొమ్మనే నరుక్కునేటంత మూర్ఖుణ్ణా నేనూ? " అంటూ తెగ బాధప డిపోయాడు వాడు.

అలా అంటూనే కన్నీళ్ళ పర్యంతమ య్యాడు.

ఆ మాటల్లోని నిజాయితీ నా ఆవేశాన్ని చల్లార్చింది.

అప్పటికి మేం స్టేషన్ బయటకు వచ్చేశాం.

మమ్మల్ని స్వాగతించటానికి అక్కడ ఎవరూలేరు!

పెట్టెలు రెండూ కింద పెట్టి "ఛ! అలా బాధపడకురా! ఈ వారం రోజుల్లో.. పెళ్ళి

# అందుబాటులో డి.ఎన్.ఎ. కిట్స్

చతుర ప్రపంచం

నేరపరిశోధనలో భాగంగా పోలీసులు అనుమానితులకు డి.ఎన్.ఎ పరీక్షలు చేస్తుంటారు. కాని వంశపారంపర్య వ్యాధులను తెలుసుకోవడానికి కూడా డీఎన్ఎ పరీక్షలు ఉపయోగపడతాయి దాంతో అమెరికాలో డి.ఎన్.ఎ టెస్ట్ కిట్లను చవకగా అమ్మేందుకు పరిశోధనలు చేశారు.

వాల్‌గ్రీన్‌లాంటి మందుల దుకాణాల్లో అక్కడ నేడు ఈ కిట్స్ లభ్యమవుతున్నాయి. నాలిక మీద వత్తిని అద్ది ఆ ఉమ్మితో డీఎన్ఎ పరీక్షను ఎవరికి వారు నిర్వహించుకోవచ్చు. రక్తం తీయాల్సిన అవసరం కూడా లేదు. డెబ్బై రకాల వంశపారంపర్య వ్యాధుల గురించి ఈ టెస్టుల్లో తెలుసుకోవచ్చు. దీనివల్ల భవిష్యత్తులో డయాబెటిస్, అల్జీమర్స్ లాంటి వ్యాధులు వచ్చే ప్రమాదం తెలుస్తుంది. దాంతో నివారణ చర్యలను చేపట్టవచ్చు. ఒక్కో కిట్ ధర 25 డాలర్లు. అమెరికాలోని 7500 వాల్‌గ్రీన్ మందుల దుకాణాల్లో ఈ కిట్స్ అందుబాటులో ఉంచారు.



అమెరికాలోని విచ్చలవిడితనం వల్ల పిల్లలు తనకు పుట్టలేదనే అనుమానంతో కోర్టుకు వెళ్లే తండ్రుల కేసులు కూడా అధికమే. కోర్టు ఆర్డర్‌తో పితృత్వ నిర్ధారణ పరీక్షను డీఎన్ఎ ద్వారా ఇంతదాకా చేస్తున్నారు. కాని ఈ కిట్స్‌వల్ల అలా కోర్టుకు వచ్చే కేసుల సంఖ్య సున్నాకు తగ్గుతుందని సామాజిక వేత్తలు భావిస్తున్నారు. అలాగే హాస్పిటల్స్‌లో తమకు ఇస్తున్న పసికందులు నిజంగా తమకు పుట్టినవారో కాదో తెలుసుకునేందుకు కూడా డి.ఎన్.ఎ కిట్స్ సహాయపడుతున్నాయి. డి.ఎన్.ఎ.లో దాగివున్న తమ ఆరోగ్య రహస్యాలను తెలుసుకోవాలనే ఆసక్తి ఉండేవారంతా ఆ కిట్స్‌ను కొని ఉపయోగించే అవకాశం ఉందని వైద్యులు భావిస్తున్నారు. త్వరలో మనదేశంలోనూ లైసెన్స్ తీసుకుని ఏ తయారీదారుడో డి.ఎన్.ఎ కిట్స్‌ను ప్రవేశపెట్టినా ఆశ్చర్యం లేదు.

పనులూ.. రానూపోనూ విశ్రాంతిలేని ప్రయాణంలో ఒళ్ళు హూనమైపోయింది. రాత్రివేళ పెళ్ళి ముహూర్తంతో ఆ అలసటా... తీరా పెళ్ళికూతురితో సహా హనీమూన్‌కని వస్తే... నువ్వు చెప్పిన కబురు అశనిపాతంలా తగిలింది. అందుకని... ఏదో ఒళ్ళెరగని కోపంలో అలా అనేశానే గానీ నీ సంగతి నాకు తెలీదట్రా!" అంటూ వాడ్ని ఓదార్చి ఊరడించాను.

చాలాసేపటికి గానీ వాడు మామూలు మనిషి కాలేకపోయాడు.

"అసలేం జరిగిందిరా? " అనునయంగా అడిగాను.

"మన గది ఓనరైన మార్వాడీకి ఎలా తెలిసిందో ఏమో! పోలీసులను తీసుకొచ్చి సామానంతా వాకిట్లో విసిరేసి, నన్ను మెడపట్టి బయటకు గెంటేశాడు. నేను మాత్రం మన రహస్యం ఎవరికీ వెల్లడించలేదు. అసలెవర్నీ ఆ రూముకు తీసుకురాలేదు కూడా! నన్ను నమ్ము!" ఇంకా బాధపడుతూనే చెప్పాడు.

ఆ అవమానం తాలూకు ఆవేదన.. వాడు ఉద్విగ్నంగా చెబుతున్న ప్రతి పలుకులోనూ నాకు తెలుస్తూనే ఉంది.

ఇక చేసేదేముంది?

ఇప్పుడు ఎక్కడికి వెళ్ళాలో నాకే తెలీటం

లేదు.

పెళ్ళికూతురిని, పెట్టెలనూ మార్చి మార్చి చూస్తూ ఏం చెయ్యాలో తెలీని అయోమయంలో అక్కడే స్థాణువులా నిల బడిపోయాను.

అప్పుడు నాకు ముందుగా గుర్తుకు వచ్చిన వ్యక్తి హాజియార్‌జీ!

సామాన్లు చేతపట్టుకుని, ఇల్లాలిని వెంట పెట్టుకుని ఆయన దగ్గరకే వెళ్ళాను.

ఊళ్ళో దిగగానే మొట్టమొదట తన దగ్గరకే వచ్చినందుకు ఆయన చాలా సంతోషించాడు.

సాదరంగా ఆహ్వానిస్తూ ఉన్న వాటిల్లో

కొత్తగాలి...

**అంతరించి పోతున్న జాబితాలో**
**కాడి, మేడి, కర్రు!**
**యాంత్రీకరణ చక్రబంధంలో**
**సంప్రదాయ వృత్తుల విలవిల!**

– బి.వి. నరసింహారావు,
పేరాల, ప్రకాశం జిల్లా

కాస్త గట్టి పెట్టెమీద మమ్మల్ని ఆశీనులను చేశాడు.

చెరో పిడికెడూ వేడి వేడి శనగలు పెట్టి సత్కరించాడు. ఆ శనగల పొట్లాలను చేతి సంచిలో పెట్టింది అమ్ము. నేను కొత్త కాపురం పెట్టటానికి కొనుక్కున్న సామానంతా ఆయన పాదాల దగ్గర చెల్లాచెదురుగా పడివుంది. సరిగ్గా సర్దుకోటానికి పాపం ఆయనకు తీరిక చిక్కలేదేమో!

కాసేపు కూర్చుని, పెళ్ళి సంగతులూ... ప్రయాణం కబుర్లూ చెప్పి, కూడా తెచ్చుకున్న పెట్టెల్ని ఆయనకు అప్పజెప్పి... కుట్టిని తీసుకుని నా పాత స్థావరం చర్చి గేట్‌వేపుకు నడక సాగించాను.

బాటకు అటూఇటూ కనిపిస్తూ కను విందు చేస్తున్న ఆ భవ్యభవనాలలోని ఏదో ఒకదాంట్లో తన పతిదేవుడు నివాస ముంటున్నాడనీ, అటువంటి ఇంట్లో కాపురం చెయ్యబోతున్న తను ఎంత అదృష్టవంతురాలినో కదా అనీ అనుకుంటూ, ఆ ఆకాశహర్మ్యాలను చూసి తన అదృష్టాన్ని తలచుకునీ తెగ ఆశ్చర్యపడిపోతూ మెల్లమెల్లగా నడుస్తోందామె.

రైల్వేస్టేషన్ వచ్చేవరకూ ఎక్కడా ఆగలేదు నేను. నన్ననుసరిస్తూ ఆమె!

స్టేషన్లో ముఖప్రక్షాళనాది కార్యక్రమాలను కానిచ్చుకున్నాక, అలసటంతా తీరేట్లుగా కావల్సినన్ని నీళ్ళతో మినిస్టర్‌లా షవర్‌బాత్ చేసి, ఫ్రెష్ అయ్యాను.

అమ్ముకూ అలాగే చెయ్యమని సలహా ఇస్తే ముందు నావంక తెల్లబోయి చూసినా మారుమాట్లాడకుండా బాత్‌రూం తలుపులు మూసుకుని, గబగబా నాలుగు చెంబుల నీళ్ళు కుమ్మరించుకుని, చేతి సంచిలోంచి మరోచీర తీసి కట్టుకుని బయటికి వచ్చేసింది.

అక్కడే ఓ బెంచిమీద కూర్చుని విశ్రాంతి తీసుకోమని ఆమెకు చెబుతూనే, నేను కూడా తన పక్కనే నడుం వాల్చాను.

ఆమెకు కూడా అలసట తీరిందని నిర్ధారించుకున్నాక 'ఊరు చూపిస్తా.. పద' అని బయల్దేరదీశాను.

అంతకన్నా నేను చెయ్యగలిగింది మాత్రం ఏముందీ?

బడ్డీ కొట్టులో సీసాలోంచి కనపడుతున్న మిఠాయి ఉండలవంక చిన్న పిల్లాడు ఎలా చూస్తాడో.. సరిగ్గా అటువంటి లాలసతో కుట్టి అందాలను చూస్తున్నాయి నా కళ్ళు.

తలనిండా నూనె పులుముకుంది. ముదురు ఎరుపురంగు ముతకచీర ధరించింది.

ఆ పల్లెటూరి కట్టూబొట్టుతో ఆమె

అందాలన్నీ అస్తవ్యస్తంగా కనపడుతున్నాయి.

అవన్నీ సరిచేస్తే.. ఆ ఎరుపురంగు నేత కోకలో కూడా నా కుట్టి మందారపువ్వు లాగా మనోహరంగా వుంటుంది.

ముఖానికీ, జుట్టుకూ అంతేసి కొబ్బరి నూనె పులుముకోవటం మా పల్లెపడతులకు అలవాటు. ఇక్కడెవరూ అలా చెయ్యరు. అందుకే కుట్టితో ఆ అలవాటు మానిపించాలి. ముఖాన్ని సున్నిపిండితో రుద్ది సరిపెట్టుకోకుండా, సినిమా తారలు వాడే గులాబీరంగు సౌందర్యసబ్బు నురగతో రుద్దుకుని, ఫేస్‌పౌడరు అద్దుకోవాలి. ఇవన్నీ ఆ గ్రామీణ యువతికి చెప్పేదెలా?

అసలు ఆ పల్లెల్లోనే రెండుమూడు రోజులుండి రావల్సింది. సరాసరి హనీమూన్‌కి బాంబే తీసుకొచ్చేస్తే... ఇక్కడే నా చిన్ననాటి నేస్తం అమ్ముకుట్టికి సరదా సరదాగా అన్నీ నేర్పుకోవచ్చని ఆశపడ్డాను. తీరా వస్తే నిలువనీడ లేకుండా పోయింది.

పెళ్లయిన వెంటనే ప్రయాణం పెట్టుకోవటంతో నవ వధువుకు సహజంగా వుండే సిగ్గును పోగొట్టే వ్యవధి లేకుండా పోయింది.

'అంతా నా దురదృష్టమేనా?' అంటే, 'కాదు కాదు.. స్వయంకృతం' అని పిస్తోంది.

ఏమయితేనేం? నా ముద్దుముచ్చటలేవీ తీరటంలేదు. తీర్చుకునే అవకాశమూ కనపడటంలేదు.

★ ★ ★

నడుస్తూ నడుస్తూ మలబార్‌హిల్‌కు వెళ్ళాం. అక్కడ రోడ్లన్నీ తిరుగుతూ.. వింతలూ, విశేషాలూ చూస్తుంటే దారిలో పార్సీల మరుభూమి కనిపించింది.

ఎత్తైనచెట్లతో, అరిటాకు పచ్చ, ముదురాకు పచ్చ కలగలిపిన పచ్చదనంతో ఆ ప్రదేశం కంటికి ఇంపుగా కనిపించింది.

ఆ చెట్లనీడలో ఒకింతసేపు విశ్రమిద్దామనే ఉద్దేశంతో లోపలికి వెళ్ళాను.

పరిసరాలనూ, ఆ పచ్చదనాన్నీ పరిశీలిస్తూ నడిచి నడిచి బాగా గుబురుగా చెట్లున్న చోటును వెతుక్కుని వెళ్ళి.. అక్కడ రాలిపడివున్న ఆకులనే ఆసనంగా చేసుకుని కూర్చున్నాను.

అది మిట్ట మధ్యాహ్నం వేళ... బయట ఎండ మండిపోతున్నా అక్కడ మాత్రం చాలా చల్లగావుంది.

ఏదో అక్కడక్కడా సేదదీరుతున్న మాలాంటి బాటసారులు తప్ప పెద్దగా జనం లేరు.

చీమ చిటుక్కుమన్నా వినపడే నిశ్శబ్దం.

ఆ పార్సీల శ్మశానవాటిక గురించి అమ్ముకుట్టికి విశదంగా వివరించసాగాను.

ఆ మతస్తులు పార్థివదేహాలను దహనం గానీ, ఖననంగానీ చెయ్యరట. ప్రాణం పోయిన తరువాత తమ మృతదేహంలోని అవయవాలన్నిటినీ.. అవసరమైనవారికి ఉపయోగించుకోవచ్చని, వారు జీవించి ఉండగానే దానపత్రం రాస్తారట. పనికివచ్చే అవయవాలన్నిటినీ తీసెయ్యగా మిగిలిన కళేబరాన్ని గద్దలు చీల్చుకు తినటం కోసం ఆరుబయటే ఉంచుతారట! ఇది పార్సీల ధార్మిక నియమం.

చెట్ల మధ్య ప్రదేశంలో వున్న ఇంటిని చూపిస్తూ 'శవాలను తీసుకునిరాగానే అక్కడే వుంచుతారు' అని చెప్పాను. పైకి వెళ్ళే మెట్ల మార్గాన్ని కూడా చూపించాను.

నేను చెబుతున్న సంగతులన్నీ వింటూ తలవంచుకుని నా ఎదురుగా కూర్చుంది అమ్ముకుట్టి.

మాటల మధ్యలో నేనేదన్నా అడిగినా జవాబివ్వకుండా మౌనంగా వుంటోంది. అయినా ఈ అమ్ముకి ఇంత సిగ్గు ఎందుకో తెలియటంలేదు. ఇది వరకు ఇలా ఉండే

దికాదు. గలగలా గవ్వలు గుమ్మరించి నట్లు మాట్లాడుతూ, నవ్వుతూ, తుళ్ళుతూ నా వెంటవెంట తిరిగేది. ఇప్పుడు ఎందుకో ఇలా బిగదీసుకు కూర్చుంటోంది!

ఇప్పుడు వయసొచ్చిన పిల్ల కదా? అందుకేనేమో! లేక తీయని తొలిరేయి కోసం ఎదురు చూస్తోందా? ఆ శుభ సమ యంలో నేనే తన సిగ్గులన్నీ దూరం చెయ్యాలని కోరుకుంటోందా?

సరే అయితే.. ఇలా మూగ బొమ్మ లాగా ఎంతకాలం ఉంటావో ఉండు! సరైన సమయం రాగానే.. నీ సిగ్గులన్నీ నేనే దూరం చేసేస్తాను, చూడు!' అంటూ ఆమె దగ్గరకు జరిగి చెవిలో చెప్పాను.

ఆమె మరింత సిగ్గుపడుతూ ముడుచు కుపోయింది. ఏదో మాటవరసకి అన్నానే గానీ... ఆమె చెవిలో చెప్పినట్లు నేను చేసే దెప్పుడూ? ఎక్కడా? అసలు ఎలా కుదు రుతుందీ? లాలసతో, ఆకాంక్షతో, అంతు లేని కోరికతో... నేను ఆమెవంక చూస్తూ కూర్చున్నాను.

అప్పట్లో ఆమె ఎప్పుడూ నవ్వు ముఖంతో వుండేది. ఇప్పుడు ఆ నవ్వు స్థానాన్ని సిగ్గు ఆక్రమించుకుంది. మర్యాద స్థురాలైన స్త్రీకి సిగ్గే సింగారం. రెక్కలు విప్పిన సిగ్గు చాటునుంచే అసలు ఆ స్త్రీ సౌందర్యం పరికించటానికి వీలవుతుంది.

ఇప్పుడు నేను ఆ పనే చేస్తున్నాను. తప్పేముందీ? నా ఎదురుగా వున్న యువతి నాకు పరాయిది కాదుగా?

ఈ కొత్త పెళ్ళికూతురు అగ్నిసాక్షిగా నాతో ఏడడుగులు నడవటంతోపాటు, నాతో వేల మైళ్ళదూరం ప్రయాణించి వచ్చిన నా సహధర్మచారిణి.

ఒక గది ఉండివుంటే ఈ పాటికి...? ఈ ఆలోచన రాగానే నా ఒళ్ళు వేడెక్కిపో యింది. చూపుల్లో శక్తి తగ్గిపోతున్నట్లని పించింది.

అరె! ఇదేమిటి? చుట్టూ చీకటిగా వుందే? ఒకవేళ కావాలని కళ్ళు మూసు కుని ఈ చీకటిని నేనే కల్పించుకు న్నానా? నిజమే! ఇది కల్పితమైన చీకటే. ఎందుకంటే నా కనురెప్పలు మూసుకుని వున్నాయి. మెల్లమెల్లగా కళ్ళు తెరిచి చూశాను. చుట్టుపక్కల ఎవరూలేరు. మాకు నీడనిస్తున్న మహావృక్షాల కొమ్మల రెమ్మల మీదుగా వీచే సముద్రపుగాలి చేసే సవ్వడి వీణానాదంలా వినిపిస్తోంది.

ఇక కోరిక ఆపుకోలేని నేను మరింత ముందుకు జరిగి నా అర్ధాంగి చెక్కిళ్ళను మునివేళ్ళతో ముద్దుముద్దుగా నిమిరాను.

అసలే సిగ్గుతో ఎర్రబడిన ఆ బుగ్గలు మరింత ఎర్రబడ్డాయి. పెళ్ళికళతో కళకళ లాడిపోతున్న ఆమె అందం ఇనుమడించి నన్ను మురిపిస్తూ మైమరపిస్తోంది.

ముట్టుకుంటే కందిపోయేటట్లుండే సింధీ కన్యలకన్నా ఇప్పుడు నా అమ్ముకుట్టి అందంగా కనిపిస్తోంది.

అయితే నా చిలిపి చేష్టలకు ఆమె సంతోషించకపోగా, ఎవరైనా చూస్తారేమో నని భయపడసాగింది. బెరుకు బెరుకుగా చుట్టూ కలియజూసింది. ఎవరన్నా చూస్తే ఏమనుకుంటారోనని భయపడసాగింది.

ఆ బెరుకునూ, భయాన్నీ పోగొట్టటానికి బొంబే పట్టణపు ప్రత్యేకతను గురించీ, ఇటువంటి విషయాలలో ఇక్కడి మనుష లు ప్రవర్తించే తీరును గురించీ పూసగుచ్చి నట్టు వివరించి చెప్పాను.

కావాలంటే కాస్త చల్లబడ్డాక సాగరతీరా నికి తీసికెళ్ళి ఆ జుహూ బీచ్‌లో ఏం జరు గుతుందో చూపిస్తానని చెప్పాను.

అక్కడ ఎటువంటి సంకోచాలూ లేకుండా, చాటూమాటూ చూసుకోకుండానే అన్నీ చేస్తారని అన్నాను.

నా మాటలు తనకు రుచించలేదు. ఏవ గింపుగా మొహం పెట్టింది.





# ఎస్ఎంఎస్ రికార్డులు!




సెల్‌ఫోన్‌ను మనదేశంలో కోట్లాదిమంది వాడుతున్నా షార్ట్ మెసేజ్ సర్వీసు(ఎస్.ఎం.ఎస్)ను ఉపయోగించేది కొద్దిమందే. కారణం ఇంగ్లిష్ రానివారు ఇక్కడ అధికం. ఎస్ఎంఎస్‌ని విదేశాల్లో టెక్స్‌టింగ్ అంటారు. ఇరవైఏడేళ్ల ఓ బ్రిటిష్ మహిళ 26 పదాల వాక్యాన్ని 25.94 క్షణాల్లో పంపి గిన్నీస్‌బుక్‌కు ఎక్కింది.

మిస్ థాంపన్ అదే వాక్యాన్ని కేవలం 9.6 సెకండ్లకే పంపి, అంతకు ముందున్న రికార్డును అధిగమించింది.




ఓ నెలలో అధిక మెసేజీలను పంపిన రికార్డు 2005లో ప్రపంచంలో దీపక్‌శర్మాదే. నెలలో 1,82, 689 మెసేజీలు పంపాడు. సగటున రోజుకు 6, 100, గంటకు 253, నిమిషానికి 4 ఎస్.ఎం.ఎస్‌లను పంపినట్లు. సగటున ప్రతి 14 క్షణాలకు ఓ ఎస్.ఎం.ఎస్‌ని పంపాడు. అంటే తన జీవితకాలంలో ఓ నెలను ఎస్ఎంఎస్‌లను పంపడానికే వినియోగించాడు. అతనికి 1411 పేజీల బిల్ వచ్చింది. కాని అన్‌లిమిటెడ్ ఎస్ఎంఎస్ స్కీం ఉండటంతో అతనేం చెల్లించక్కర్లేదు.

ఫిలడెల్ఫియాలోని నిక్ ఏడమ్స్(29) తన మిత్రుడికి ఓ నెల పంపిన ఎస్.ఎం.ఎస్‌లకు ఇరవైఆరు వేల డాలర్ల బిల్ వచ్చింది. అతనికి ఆ బిల్‌ను పంపేందుకే ఆ ఫోన్ కంపెనీకి 28 డాలర్లు ఖర్చయ్యాయి.

హైతీలో భూకంపం వచ్చాక దాతలకు ఓ ప్రకటన వెలువడింది. అమెరికాలోని ఫలానా నంబర్‌కి మీరు ఓ ఎస్ఎంఎస్ పంపితే, అది అందుకున్నప్పుడల్లా కొంత సొమ్ము హైతీ బాధితులకు వెళుతుందనీ. క్లారా అనే పరోపకారి నెలకు 200 ఎస్ఎంఎస్‌లను ఆ ప్రకటనలో పేర్కొన్న నంబర్‌కు పంపింది. కాని ఆమెకు రెండువేల డాలర్ల బిల్ వచ్చింది. ఆ ప్రకటనను ఆమె ఆసాంతం చదవలేదు. ప్రతి ఎస్ఎంఎస్‌కు పది డాలర్లు దాన్ని పంపినవారి నుంచి సేకరించి హైతీ బాధితులకు ఇస్తామని టి-మొబైల్‌ఫోన్ కంపెనీ ప్రకటన అది. అయితే ఈమె మైనర్ కాబట్టి ఆమె తల్లిదండ్రులే ఆ బిల్‌ను చెల్లించాల్సి వచ్చింది.

సామ్‌సంగ్ మొబైల్ పన్నెండువేల అడుగుల ఎత్తునుంచి స్కై డైవ్ చేస్తూ వేగంగా మెసేజీలు పంపే పోటీ నిర్వహించింది. కేలిఫోర్నియా ఎడారిమీద జరిగిన ఈ పోటీలో 37 మంది పాల్గొన్నారు.

జుహూ బీచ్ ఎందుకంత నిస్సిగ్గుగా తయారైందో జీవితంలో మొట్టమొదటిసారిగా ఈ రోజు తెలిసొచ్చింది నాకు. "ఇక్కడ బతుకుతున్న ఆమ్‌ఆద్మీ (సామాన్యుడి) కన్నా దిగువస్థాయి మనిషి అంతకన్నా మరేం చెయ్యగలడూ? ఎక్కడికి వెడతాడు? ధనికులు మాత్రమే నివసిస్తున్న నగరం కాదుగదా ఇదీ? " అన్నాను.

అటువంటి మనుషులనూ, వారి చర్యలనూ తన భర్తనైన నేను సమర్థించాలని చూడటం అమ్ముకుట్టికి నచ్చలేదు.

ఆమె తలెత్తి నావంక చురుగ్గా చూసింది. ఆ చూపుల్లో ఒకింత కోపం తొంగి చూస్తోంది.

అదేం పట్టించుకోని నేను నా అమ్ము కన్నులలో, కపోలాలలో, గళసీమలో, కవ్విస్తున్నట్లున్న వక్షోజాలలో, కటిసీమలో .. ఇలా పైకి కనిపిస్తున్న అందాలనేకాక.. ఇంతవరకూ నాకు కనిపించకుండా ఆమెలో దాగున్న అందచందాలన్నింటినీ

చూపులతోనే ఆస్వాదించసాగాను.

ఎంతటి నిస్సహాయత!

అసలు నేను పెళ్ళెందుకు చేసుకున్నట్టూ? అప్పులు చేసి ఇద్దరికీ రైలు టిక్కెట్లు కొనుక్కుని, నా నవవధువుని ఇంతదూరం ఎందుకు తీసుకువచ్చినట్టూ?

సరదాగా హనీమూన్ జరుపుకోవాలనే ఆశతోనే కదా!

ఇప్పుడు ప్రోగ్రామంతా తల్లకిందులైపోటంతో తల్లడిల్లిపోతున్నాన్నేను. వెంటనే చీకటి పడిపోతే బాగుంటుందనుకున్నాను. ఎంత వెర్రి ఆలోచన! నా గుండె వేగంగా కొట్టుకోసాగింది. శరీరం జలదరిస్తోంది. అప్పటికప్పుడు అమ్మును ఏదో చేసెయ్యాలనిపిస్తోంది. నిజంగా అలాచేస్తే ఆ అమాయకురాలు ఊరుకుంటుందా? బెదిరిపోయి కేకలు పెడుతుందేమో!

'అప్పుడు... అప్పుడు మా ఇద్దరి పరిస్థితీ ఏమిటీ?' అని ఆలోచించుకోగానే నేనే భయపడుతూ అక్కణ్ణుంచి లేచి దూరంగా ఉన్న చెట్టుకిందకెళ్ళి నిలబడ్డాను.

ఈ లోకంలోని సమస్తమైన విశుద్ధ వస్తువులనూ జ్ఞప్తికి తెచ్చుకున్నాను. నా కన్నతల్లీ, చిన్నారి చెల్లీ.... ఇద్దరూ నా ఎదుట నిలబడి నాకేసి గుడ్లురిమి చూస్తున్నట్లు ఊహించుకున్నాను.

కాస్త మామూలుస్థితికి వచ్చాక నవవధువుని వెంటబెట్టుకుని, ఆ ఖబరస్థాన్ నుంచి బయటకు వచ్చి మళ్ళీ రోడ్డున పడ్డాను.

★ ★ ★

ఆ నిండు జవ్వని నా పక్కనే నడుస్తుంటే ఏదోలావుంది నాకు. ఆమె కురులకు రాసుకున్న స్వచ్ఛమైన కొబ్బరినూనె సువాసన నా నాసికాపుటాలను తాకగానే నా మది ఉయ్యాలలూగసాగింది.

ఇక్కడి బస్తీ దొరసానులు రాసుకునే సుగంధద్రవ్యాలు వెదజల్లే సువాసనలకన్నా ఇది ఎన్నోరెట్లు మిన్నగా, ఇష్టంగా అనిపించసాగింది.

ఈ నారికేళ తైలసుగంధంతో కలిసి, నా నవవధువు కుట్టి శరీరం నుంచి వచ్చే కన్నె సుగంధం ఉక్కిరిబిక్కిరి చేస్తూ నన్ను నిలువనివ్వటం లేదు. నిజంగా నాకు పిచ్చెక్కిపోతోంది.

అమ్ముకుట్టిని.. కాదు కాదు.. నా క్లియోపాత్రని, నా హెలెన్‌ను వెంటబెట్టుకుని బొంబాయిలోని విశాలమైన వీధులలోనూ, ఇరుకైన కాలిబాటలమీదా, మురికిసందుల్లోనూ నాకు తెలీకుండానే ఓ పద్ధతంటూ లేకుండా తిరుగుతూ పొద్దుపుచ్చసాగాను.

అలా తిరుగుతూ తిరుగుతూ ఉండగా నాకు ఓ అద్భుతమైన ఆలోచన వచ్చింది.

అదేమిటంటే 'ఏదన్నా హోటల్‌లో ఒక గది తీసుకోవాలి'

పర్సు తీసి చూశాను. ఏడురూపాయలూ, కాస్త చిల్లరా ఉన్నాయి.

ఈ ఎండలో పడి నావెంటే నీడలా నడిచి వస్తున్న అమ్ముకుట్టిని చూశాను. ఆకలితో నకనకలాడుతున్నట్లుంది. అలసిసొలసి నీరసంగా అడుగులో అడుగు వేస్తోంది.

ఇప్పుడు ఇద్దరం ఏదన్నా తినాలి. సాయంత్రం డిన్నర్‌కు కూడా డబ్బు కావాలి. నా దగ్గరున్నది సరిపోతుందా?

ఇప్పటికిప్పుడు కడుపులో ఏదన్నా పడకపోతే బుర్ర పని చెయ్యకపోగా, ముందుకు నడిచే ఓపిక కూడా ఉండదనుకుంటూ నా పల్లె పడుచును వెంట బెట్టుకుని ఓ రెస్టారెంట్‌లో అడుగుపెట్టాను.

ఫ్యాన్‌కింద సీట్లు చూసి, అక్కడ నేను కూర్చుని, ఆమెనూ నా పక్కనే వున్న కుర్చీలో కూర్చోమన్నాను.

హడావిడిగా ఉన్న బేరర్లు అటుకేసి రాకపోవటంతో తీరిగ్గా విశ్రాంతి తీసుకున్నాం.

కాస్త రష్ తగ్గాక వచ్చిన బేరర్‌తో రోటీలు కావాలని చెబుతూ... మేం

వాటిని తినటం పూర్తి చేసిన తరవాతే గరంగరంగా చాయ్ తెమ్మన్నాను.

అతనితో నేను హిందీలో సంభాషిస్తుంటే అమ్ము ఆశ్చర్యంతో కళ్ళు పెద్దవి చేసుకుని నా వంక చూసింది.

ఆ చూపుల్లో నా పట్ల తొంగి చూస్తున్న గౌరవం ఉబ్బితబ్బిబ్బయ్యేటట్లు చేసింది. నా యోగ్యతనూ, పాండిత్యాన్నీ నవవధువు గుర్తించి, గౌరవిస్తున్నందుకు చాలా సంతోషంగా వుంది నాకు.

ఏదన్నా మంచి హోటల్లో ఒక్కరోజన్నా ఉండి ఆమె ఆశ్చర్యాన్ని ఇంకా ఇనుమడింపజెయ్యాలి. ఆ ఆడంబరాలూ, అలంకరణల మధ్య తొలిరేయి మధురానుభూతులను చవిచూపిస్తే ఈ బిడియం ఒక్కసారిగా వదిలిపోయి అమ్ము నాతో చనువుగా ఉండటానికి వీలవుతుంది. ఆమెకు నా పట్ల గౌరవం మరింత పెరుగుతుంది కూడా. ఈ మూగనోము వీడి ఆమె నాతో స్వేచ్ఛగా మసలగలిగితే.. ఇద్దరం అన్ని సంగతులూ మాట్లాడుకోవచ్చు.

చాయ్ తాగటం పూర్తయ్యాక బేరర్‌ని పిలిచి సంభాషణ ప్రారంభించాను.

"ఏదన్నా గది ఖాళీగా వుందా? "

"జీ సాబ్!"

"అద్దె ఎంత? "

"ముప్ఫై రూపాయలు."

అంత అద్దె ఇచ్చుకోలేను. ఆ నిజాన్ని భార్యముందు ఒప్పుకోటానికి సిద్ధంగా కూడా లేను.

అందుకే "ఎటాచ్డ్ బాత్‌రూం ఉందా? " అంటూ డాబుసరిగా ఆరా తీశాను.

"రెండేసి గదులకు కలిపి ఒకటి వుంది. మీరు వాడుకుంటున్నప్పుడు అవతలి వేపు తలుపును మూసేసుకోవచ్చు"

"ఛీ! ఛీ! అదంతా బోర్" అంటూ బయటకు దారితీశాను.

అమ్ము నన్ననుసరించింది.

తిన్నగా హాజియార్‌గారి గరమ్ చనా స్టాల్‌కి వెళ్ళాను.

"పదిహేను రూపాయలు కావాలి.. చాలా అవసరం" అన్నాను.

"బాప్‌రే! పదిహేను రూపాయలా? అంత లేదు. అయిదయితే..."

"అచ్ఛా! ఉన్నదే ఇవ్వు!" అంటూ ఐదు రూపాయల నోటు అందుకుని అమ్ముతో కలిసి కదలబోతున్నాను.

"సునోజీ!" అంటూ వెనక్కు పిలిచి, "ఇప్పటికే మూడు రూపాయలు బాకీ పడ్డావు. పెద్దబాకీలు రాసి పెట్టుకున్నాం గానీ చేబదుళ్ళు ఎక్కడా రాసుకోలేదుగా..? అందుకని చెబుతున్నాను. చేబదులు తీసుకున్నది ఈ అయిదుతో కలిపి ఎనిమిది.. గుర్తుపెట్టుకో!" అన్నాడు.

"అచ్ఛా!" అని పైకి గాంభీర్యాన్ని నటించానేగానీ నాకు ఆయన మీద కోపం వచ్చింది. 'అంత తెలివి తక్కువగా మాట్లాడుతాడేం? తన పాత బాకీల గురించి నా కొత్త పెళ్ళికూతురి ముందు ఎత్తి నా పరువు తీస్తే తనకు వచ్చే లాభమేముందీ? బాకీలు ఎగ్గొట్టి నేనేమన్నా పారిపోతానా? ఛీ? ఏం మనిషి? ' అని సణుక్కుంటూ ముందుకు కదిలాను.

అమ్ముకుట్టిని తీసుకుని హోటల్ ఆస్టోరియా రిసెప్షన్‌లో దర్జాగా కూర్చున్నాను.

## కొత్తగాలి...

**పుష్పవిలాపం కవికి**
**సన్మానం**
**పూలదండల్తో!**

– కొట్టి రామారావు,
మచిలీపట్నం

ఏం కావాలని వాళ్ళు అడిగేదాకా మౌనంగా ఉండి హాజియార్ మీద కోపాన్ని అణుచుకున్నాను.

"ఏం కావాలి సార్? " రిసెప్షనిస్ట్ మళ్లీ అడిగాడు.

"రూం ఖాళీగా వుందా? "

"జీ సాబ్!"

"అద్దె ఎంత? "

"డబల్ రూం అరవైరూపాయలు"

"సింగిల్ రూం తీసుకుంటేనో.....? "

" నలభైఐదు రూపాయలే!"

"సరే.. మళ్లీ వస్తాం! " అంటూ బయటకు నడిచాను.

ఆ అమాయకురాలు నా వెనకే వస్తుంటే రిసెప్షన్‌లో వున్న మనిషి మమ్మల్ని గురించి ఏదో పరిహాసంగా మాట్లాడాడు. అమ్ముకు ఆ భాష అర్థం కాదు గనుక సరిపోయింది. లేకపోతే ఎంత బాధపడేదో?

★ ★ ★

అడిగి లాభం లేదని, ఆ అద్దె నాకు అందుబాటులో వుండదనీ తెలిసినా... హోటల్ 'ఎయిర్‌లైన్స్'కి వెళ్ళి అడిగాను.

"ఏదన్నా గది ఖాళీగా వుందా? '

"ప్రస్తుతానికి లేదు. ఓ గంట తరవాత ఖాళీ అవుతుంది"

"కిరాయి ఎంత? "

"నూట పాతిక రూపాయలు"

'నటరాజ్'లో అడిగాను. 'రెండు వందలు' అని చెప్పారు.

'తాజ్'లో అడిగితే- 'నూటయాభై' అన్నారు.

'సీగ్రీన్'లో అడిగితే... సింగిల్ రూం అయితే 'కేవలం యాభై రూపాయలు' అని అన్నారు.

మళ్ళీ మెరెయిన్ డ్రైవ్‌కు వెళ్ళి.. అక్కడున్న చిన్నరాతిగోడ మీద కూర్చున్నాను. ఉట్టికెగరలేనమ్మ స్వర్గానికెగిరిందనీ.. రెస్టారెంట్‌లో దొరికే గదికి ముప్ఫైరూపాయల అద్దె చెల్లించలేనివాడిని.. ఈ మహానగరంలో ప్రసిద్ధి చెందిన 'ఆస్టోరియా,' 'ఎయిర్‌లైన్స్,' 'నటరాజ్,' 'తాజ్'లాంటి హోటల్స్‌లో గది తీసుకోగలనా?

నా కొత్త పెళ్లికూతురు పక్కన వుండటంతో చెలరేగే తీయని కోరికలతో అలా ఆశపడ్డానేగానీ, శోభనంరాత్రిలోని హాయిననుభవించే స్థాయి నాకెక్కడిది?

పెళ్ళిలో నాతో ఏడడుగులు నడిచిన పాపానికి, ఈ బాంబే నగరంలోని వీధివీధీ నాదే అనుకుంటూ నాతో కలిసి తిరుగుతోంది నా అర్ధాంగి.

ఇప్పుడు కూడా 'నటరాజ్' హోటల్ నుంచి మెరెయిన్‌డ్రైవ్ వరకూ నడుస్తూ వచ్చి నా పక్కన కూర్చుంది. ఏం చేస్తుంది పాపం! ఆమె నా సహ పాదచారిణి!

జాలిగా తన వేపు చూశాను.

నూనె కారిన ఆ ముఖం జిడ్డోడుతోంది. అలా జిడ్డుముఖంతో షికార్లు కొడితే ఏం బాగుంటుందీ?

చవక రకందైనా సరే.. ఓ పౌడరు డబ్బా కొనివ్వాలి.

జేబులోంచి పర్సుతీసి డబ్బు లెక్కపెట్టాను.

హాజియార్ ఇచ్చిన ఐదుతో కలిపి తొమ్మిది రూపాయలున్నాయి. రాత్రి భోజనానికి మూడు రూపాయలవుతుంది. ఇక ఆరు రూపాయలుంటాయి.

ఇక ఏ ఖర్చు చేసినా ఆరు రూపాయల లోపే ఉండాలి. బుర్రగోక్కుంటూ చుట్టూ చూశాను. ఎంతైనా మెరెయిన్ డ్రైవ్ అద్భుతమైనది. ఇది భూతలస్వర్గం లాంటిది. దేవతా వస్త్రాలు ధరించిన అప్సరసలు ఈ ప్రదేశంలో నడయాడుతున్నారు. కాలిబాట మీద ఆడామగా చెట్టాపట్టాలేసుకుని తిరుగుతున్నారు.

"ఇవన్నీ మన ఊళ్ళలో ఉండేవాళ్ళకు కావాలనుకున్నా కనపడని వింతలు!




# వివాహాల్లో వింతలు!




పెళ్లి అనగానే ఎలాంటి అపశ్రుతులు దొర్లకుండా ఆనందదాయకంగా సాగేలా జాగ్రత్తలు తీసుకుంటాం. అయినా కొన్ని పాశ్చాత్య పెళ్లిళ్లల్లో ఎదురైన ఇబ్బందులు ఆసక్తికరంగా ఉన్నాయి. ఇంగ్లండ్‌లోని లెస్టర్ షైర్ ప్రాంతంలోని వర్థింగ్‌టన్‌లో రాయ్, వాల్ జంట పెళ్లికి పోలీసులు తుపాకులతో, కుక్కతో ప్రవేశించి అందర్నీ చేతులెత్తమన్నారు. తాము వెంటాడుతున్న ఓ నేరగాడు సందట్లో సడేమియాలా ఆ పెళ్లిజనంలో కలిసిపోవడంతో వారు రంగప్రవేశం చేసారు.



మసాచుసెట్స్‌కి చెందిన జి. షెర్లాక్, నిఖిల్ పెరైల పెళ్లికి ఓ వాహనాన్ని అద్దెకు తీసుకున్నారు. దాన్ని చర్చి బయట పెట్టారు. అయితే అది దొంగతనానికి గురవ్వడంతో ఆ పెళ్లి ఏర్పాట్లలో లోపం ఏర్పడింది.

ఇటలీలోని పీసా నగరంలో తమ పెళ్లికి పైనుంచి పూలు కురిపించేందుకు పెళ్లికూతురు ఇసడోరా ఓ చిన్న విమానాన్ని అద్దెకు తీసుకుంది. అయితే ఆ విమానంలోంచి విసిరిన పూలగుత్తులు దాని ప్రొపెల్లర్‌లో చిక్కుకుని, ఇంజన్‌లోకి వెళ్లడంతో విమానం కూలింది. అదృష్టవశాత్తు వచ్చిన అతిథులకేమీ కాలేదు. కానీ ఇసడోరాకి గాయాలయ్యాయి.

బ్రిటన్‌లోని మెల్బన్‌కు చెందిన పాల్ కేసిడీ, విల్మాల పెళ్లి జరుగుతుండగా విల్మా తల్లి కుప్పకూలింది. ఆవిడను హాస్పిటల్‌కు తరలించిన కాసేపటికి ఆమె పదేళ్ల కొడుకు అద్దాన్ని ఢీకొట్టడంతో తలకు గాయాలయ్యాయి. అంతలోనే పెళ్లి కొడుకు పాల్ తండ్రి మరణించాడన్న వార్త కూడా వచ్చింది. హనీమూన్‌కోసం వారు అద్దెకు తీసుకున్న కారు కూడా మంటల్లో కాలిపోయింది.

జపాన్‌లో టాట్‌షుకొ, కవాట పెళ్లయ్యాక హనీమూన్‌కి బస చేసిన హోటల్ అంటుకుని కాలిపోయింది. అదృష్టవశాత్తు పెళ్లికొడుకు చెయ్యి మాత్రమే కాలింది.

ఆస్ట్రియాలోని టైనా, డయిట్‌మర్‌ని పెళ్లి చేసుకునేటప్పుడు రిజిస్ట్రార్ ఆమెను 'అతడ్ని పెళ్లి చేసుకోవడం ఇష్టమేనా?' అని అడిగాడు. ఆమె వేళాకోళంగా 'లేదు' అన్నది. తర్వాత ఆమె 'సరే'నని చెప్పినా, ఆ హాస్యాన్ని రిజిస్ట్రార్ సీరియస్‌గా తీసుకుని వారి పెళ్లిని రిజిస్టర్ చేయకపోవడంతో పెళ్లి ఆగిపోయింది.

దక్షిణాఫ్రికాలోని క్వాజులు అనే ఊళ్లో హాఫ్‌మేన్, మార్లి పెళ్లి జరిగేటప్పుడు ఎనభై మంది అతిథులు ఓ సరస్సుమీద కట్టిన డెక్ మీద నిలబడి ఉండగా అది కూలిపోయింది. వీల్ ఛెయిర్‌లో కూర్చునివున్న వృద్ధురాలైన పెళ్లికూతురి తల్లిని అతికష్టంమీద రక్షించగలిగారు.

కళ్ళారా చూడు.. అమ్మూ!" అన్నాను.

కాసేపు అక్కడ తిరుగుతున్న మనుషులనూ.. మరి కాసేపు ఆ పరిసరాలనూ గమనించింది.

మళ్ళీ తలవంచుక్కూర్చుంది. నన్ను తేరిపార చూడాలన్నా తనకు సిగ్గే!

"నీ సిగ్గును నీ నుంచి దూరం చెయ్యక పోతేచూడు!" ఆమెకు దగ్గరగా జరుగుతూ అన్నాను.

ఆమె అటుగా ఆ కాస్తా జరిగి మా మధ్య దూరాన్ని యథాతథంగా ఉంచింది.

చీకటి పడేవరకూ అక్కడే ఆ దృశ్యాలన్నిటినీ చూస్తూ కాలక్షేపం చేశాం.

★ ★ ★

అప్పుడు అమ్మును జుహూ బీచ్‌కి తీసుకెళ్ళాను. సముద్రుడు పరిచివుంచిన ఇసుక

తివాచీ మీద కూర్చోబెట్టి పక్కనే కూర్చున్నాను. ధరించిన దుస్తులు తడిసిపోతున్నా లెక్క చెయ్యకుండా నీళ్ళలో పాదాలు తడిసేంత లోతుకు మాత్రమే దిగి కేరింతలు కొడుతూ ఆడుకుంటున్న పిల్లల్నీ, వాళ్ళకు కాపలాగా నిలబడ్డ తల్లుల్నీ సంబరంగా చూస్తోంది అమ్ము.

ఆ కడలిలో తొడలోతు నీటిలో దిగి... ఒకరిమీద ఒకరు నీళ్ళు జల్లుకుంటూ ఆనందిస్తున్నారు కొందరు టూరిస్టులు.

మోకాలి లోతునే నీళ్ళల్లో నిలబడినా... జలక్రీడలు జోరుగా ఆడుతూ, ఉల్లాసంగా ఉద్రూతలూగిపోతూ కనిపిస్తున్న యువతను చూసి, ఒడ్డున ఉన్న వారి పెద్దల మనసులు పులకించిపోతున్నాయి.

అది జలాకర్షణ! ఆ అనంత జలరాశిని ఎప్పుడు చూసినా మనసు నిండిపోతుంది.

అమ్ముకుట్టి కూడా ఆ సాగర సలిలాల సోయగాలను కళ్ళార్పకుండా చూస్తూ కూర్చుంది.

"బీచ్‌లో అటూ ఇటూ తిరిగి చూద్దాం, పదా! ఇంకా చూడాల్సినవి ఉన్నయ్. ఇక్కడే ఎంతసేపు కూర్చుంటాం?" అంటూ నేను లేచి ముందుకు కదిలాను.

నేను బీచ్‌లో ఆ చివర్నించి, ఈ చివరి వరకూ ఆమెను నడిపించాను.

## కొత్తగాలి...

**మనిషికి...**
**పట్టిన 'దాహం'**
**ధనదాహం!**

**– యు. చిట్టిబాబు,**
కొత్తపాల్వంచ, ఖమ్మం జిల్లా

మధ్య మధ్యలో ఆగుతూ.. నవదంపతులు చూసినా తప్పులేని కొన్ని దృశ్యాలను తనకు చూపించి, ఆమె ప్రతిక్రియను తెలుసుకోవటానికి ఆ ముఖాన్ని తేరిపార చూశాను.

చిరాగ్గా, ఛీత్కారంగా పట్టరాని కోపంతో కుతకుతలాడిపోయిందామె.

"పాపం! వాళ్ళు మాత్రం ఏం చేస్తారు? హోటల్ గది తీసుకోవాలంటే ఒక్క రోజుకే వందా, నూటయాభై పెట్టాలి! అందుకే.." అంటూ ధైర్యంగా తమ కోరిక తీర్చుకుంటున్నందుకు వారిని ప్రశంసించాను.

తన రెండు కళ్ళూ విప్పార్చుకుని విస్మయంగా నా వంక చూసింది అమ్ము. నేనుకూడా తనతో కలిసి అటువంటి రాసక్రీడాలకు తెగబడతాననుకుందేమో! వడివడిగా అడుగులువేస్తూ నాకు అందనంత దూరానికి వెళ్ళిపోయింది.

సిగ్గుతో చితికిపోతూ నిలబడిపోయాన్నేను. ఊరుకొత్త. భాష తెలీదు. జుహూ బీచ్‌లాంటి చోట.. అమాయకంగా కనపడుతున్న ఆ గ్రామీణ యువతి తొందరపాటుతో ఒంటరిగా నడిచిపోవటం చూసి, ఆమెకు ఏదన్నా అపాయం వాటిల్లుతుందేమోననే భయంతో, పరుగులాంటి నడకతో ఆమెను సమీపించి, "అయితే ఇక్కణ్ణించి వెళ్ళిపోదామంటావా?" అన్నాను.

"అదే మంచిది!" దృఢమైన కంఠస్వరంతో విసురుగా అంది. ఇంతకుముందు తను చూసిన దృశ్యాల పట్ల జుగుప్సతో కూడిన విసురు అది! లేక ఆమెముందు నేను తేలికయిపోతున్నానా?

ఎటువంటి సంకోచమూ లేకుండా బీచ్ లోని ఇసుకనే పాన్పుగా భావిస్తూ పవళించిన మనుషులను తప్పించుకుంటూ, కొన్ని కొన్ని దృశ్యాల మీదనుంచి చూపులను మళ్ళించుకుంటూ గట్టుకు చేరుకుని, అక్కడే ఓ స్టాల్ ముందు కుర్చీల్లో కూర్చున్నాం.

స్టాల్‌లో పనిచేసే బాయ్‌వచ్చి.. అడిగి అడిగి ఆర్డర్లు బుక్ చేసుకుని తినుబండారాలను సరఫరా చేస్తున్నాడు.

కొందరు చాట్ తింటుంటే మరికొందరు చాయ్ తాగుతూ, సముద్ర తీరపు సొబగులను చూస్తూనే కబుర్లు చెప్పుకుంటూ, సరదాగా కాలక్షేపం చేస్తున్నారు.

పెళ్లయి నావెంట వచ్చిన తర్వాత అమ్ముకుట్టి నాతో మాట్లాడిన మెదటి మాట 'అదే మంచిది!'

తక్షణం ఈ ప్రాంతం నుంచి వెళ్ళిపోదామని దాని అర్థం.

ఆమెవంక చూశాన్నేను.

సువిశాల సాగరజలాలు అనంత నీలాకాశాన్ని తాకుతున్నట్లనిపించే సుదూరతీరం మీద దృష్టిని నిలిపి తదేకంగా చూస్తోంది.

'ఆమెను ఎక్కడికి తీసికెళ్ళాలా?' అని ఆలోచిస్తూవున్నాను.

పత్మని ఆండీ ఎక్కడుంటాడు? గ్రాండ్ రోడ్డులోనా? పోద్దార్ రోడ్డులోనా? అతని అడ్రసు రాసుకున్న పుస్తకం ఇప్పుడు నా దగ్గర లేదే!

హాజియార్ ఎంత మంచివాడైనా ఆయన బీబీ మమ్మల్ని రానిస్తుందా? ఒక వేళ ఆవిడ ఒప్పుకున్నా అమ్ముకు ఆ ఇంటి వాతావరణం నచ్చుతుందా? నచ్చదనుకుంటా! వాళ్ళు ముసల్మాన్లాయె!

ఇంకెవరున్నారా? అని అనుకుంటుంటే కుర్థన్ జ్ఞప్తికి వచ్చాడు. అతను నాకు చాలాకాలంగా తెలుసు. మంచివాడు.. మా వేపువాడు. మా మలయాళీ!

ఎక్కడుంటాడు తనూ? మాతుంగాలో ఏదో లాడ్జిలో ఉంటున్నానని చెప్పినట్లు గుర్తు. దాని పేరు తెలీకుండా ఆ ప్రాంతానికి వెడితే మాత్రం ప్రయోజనమేంటి?

బుర్రకు బాగా పదును పెట్టి, అరగంట తరువాత..'హమ్మయ్యా! గుర్తుకు వచ్చింది' అనుకుంటూ ఊపిరి పీల్చుకున్నాను. అది గుల్‌మొహర్ లాడ్జ్.

వెంటనే అమ్ముని బయల్దేరదీశాను. బీచ్ రోడ్డులో వరుసల్లో నిలబడ్డ వాహనాల మధ్యనుంచీ, కిటకిటలాడుతున్న జనసందోహం మధ్య నుంచీ దోవ చేసుకుని నడుచుకుంటూ నడుచుకుంటూ ఎప్పటికో రైల్వే స్టేషన్‌కు చేరుకున్నాం.

ఎలక్ట్రిక్ ట్రైన్ పట్టుకుని మాతుంగా వెళ్ళే సరికి రాత్రి తొమ్మిదయింది.

★ ★ ★

గుల్‌మొహర్ లాడ్జికి వెళ్ళి, మిస్టర్ కుర్థన్ గురించి వాకబు చేశాను.

వాచ్‌మెన్ వెళ్ళి ఆయన్ని వెంటబెట్టుకుని వచ్చాడు. మమ్మల్ని మనసారా ఆహ్వానిస్తూనే పెళ్ళికి పిలవనందుకు నిష్ఠూరంగా మాట్లాడాడాయన.

ఆయన్ననుసరించి మేడ మీదకు వెడుతుంటే మెట్లు ఎక్కేటప్పుడే ముక్కు బద్దలయ్యేట్టు ఘాటైన అమ్మోనియా వాసన వచ్చింది.

ముప్పై నలభై మందికి కలిపి ఒకే ఒక యూరినల్ ఉందట! ఆ దుర్గంధం అదీ. ఇంకో నాలుగు మెట్లెక్కేసరికి, పైన గదుల్లో వాళ్ళు రాసుకున్న హెయిరాయిల్స్ వెదజల్లే ఘాటైన సువాసన ముక్కుపుటాలను తాకింది.

పూర్తిగా మేడపైన చేరుకునేసరికి, ఆ

## కొత్తగాలి...

**హర్షణీయం**
**విజ్ఞాన విప్లవం**
**శోచనీయం**
**మానవత్వ మరణం**

– వి. సునీల్,
నంద్యాల

దుర్వాసన, ఈ సువాసన కలిసిపోయి వెగటు పుట్టిస్తూ.. అక్కడ గాలి పీల్చుకోటానికి కూడా ఇబ్బందిగానే అనిపించసాగింది.

కుర్ధన్ తన గదిలోకి తీసుకువెళ్ళాడు నన్ను. నేననుకుంటున్నట్లుగా ఆయన ఒక్కడే ఆ గదిలో ఉండటం లేదు.

ఓ మోస్తరుగా ఉన్న ఆ గదిలో ఆయనతో కలిపి ఎనిమిదిమంది ఉంటున్నారు.

ఒక్కొక్కరికీ ఒక్కోమంచం, తలవైపున ఓ చెక్కపెట్టె ఉన్నాయి.

ఆ పెట్టెల్లోనే హెయిరాయిల్స్, సబ్బులూ, బ్రష్‌లూ, పుస్తకాలూ వగైరా సరంజామా అంతా సర్దుకున్నారు.

ఎవరి మంచంకింద ఉన్న ట్రంకు పెట్టెలో వాళ్ళు తమ తమ విలువైన వస్తువులను పెట్టుకున్నారనుకుంటా!

నేను కుర్ధన్ పక్కన మంచం మీదే కూర్చున్నాను. అది తప్ప కుర్చీలూ, బల్లలు లాంటివేం లేవక్కడ.

తన రూంమేట్స్ ఇద్దరు ముగ్గురికి మమ్మల్ని పరిచయం చేశాడాయన.

మిగతావాళ్ళు అసలు మా రాకను పట్టించుకోకుండా తమ పనుల్లో తాము నిమగ్నమైపోయారు.

ఒకాయన తన మంచంమీద బోర్లా పడుకుని కాళ్ళాడిస్తూ ఏదో పుస్తకం సీరియస్‌గా చదువుకుంటున్నాడు.

కుట్టిని నా పక్కనే కూర్చోమని పదే పదే పిలిచినా, వచ్చి కూర్చోక పోగా, అసలు ఆ గదిలోకే అడుగుపెట్టలేదామె.

సిగ్గుతెరలతో తలను వంచుకుని, చీర చెంగును తలమీదుగా ముఖం నిండా కప్పుకుని, నేలచూపులు చూస్తూ గుమ్మంలోనే నిలబడిపోయింది.

దాదాపు ఓ గంటపాటు లోకాభిరామాయణంతో మిస్టర్ కుర్ధన్ దగ్గర కాలం గడిపాను నేను.

మాట్లాడుకోటానికి మరేం మిగలకపోవటంతో "భోజనం చేస్తారా? " అంటూ సాదరంగా అడిగాడాయన.

"తినే వచ్చాం" పొడి పొడిగా అన్నాను.

"మరి? "

ఆ అర్థోక్తికి అర్థం నాకు బోధపడకపోలేదు. 'ఇంకెందుకు ఆలస్యం? వెంటనే బయటకు దయచెయ్యండి' అని ఆయన అభిప్రాయం.

కానీ నేనెక్కడికి వెళ్ళను? కొత్త పెళ్ళికూతురికి పడుకోటానికి చోటెక్కడ చూపించను? కుర్ధన్ పరిస్థితి కళ్ళముందే కనపడుతోందాయె! నేనొక్కడినే అయితే తన పక్కనే చోటిచ్చేవాడాయన.

ఇద్దరికీ ఈ మంచం సరిపోదనుకుంటే ఈ రాత్రికి మరో మంచం అద్దెకు తీసుకునేవాడు.

రాత్రి టీ దుకాణం బందయ్యాక ఆ మంచాన్ని కింద లాడ్జి ఆవరణలో వేయించి... నన్ను పడుకోమనేవాడు. తెల్లారి అయిదింటికల్లా లేచి వాళ్ళ మంచం వాళ్ళకి అప్పజెప్పి వెళ్ళేవాణ్ణి.

అంతమటుకూ సాయం చెయ్యగల మంచి మనిషి కుర్ధన్.

కానీ అంతమంది మగవాళ్ళతో కలిసి ఉంటూ, ఓ ఆడకూతురికి ఆశ్రయం ఎలా ఇవ్వగలడూ? అందునా రాత్రివేళ!

మాటల మధ్య ఈ రాత్రికి తన దగ్గరే ఉందామనుకుని వచ్చినట్లు నేను చెబితే ఆ మాటే అన్నాడాయన.

నిజమేగా మరీ?

★ ★ ★

చచ్చీ చెడీ మళ్ళీ ఎలక్ట్రిక్ ట్రైన్ పట్టుకుని చర్చి గేటులో దిగాం.

అమ్ముకుట్టి బాగా అలసిపోయింది. అయినా నన్ను ఒక్క మాటన్నా అనకుండా విశ్వాసం గల పెంపుడుకుక్కలాగా నా వెంట తిరుగుతోంది. తనని వెంటేసుకుని నేనెందుకలా తిరుగుతున్నానని నన్న





డగలేదామె.

ఈ మహానగరంలోని వింతలూ విశేషాలూ అన్నిటినీ తనకు చూపించెయ్యాలనే ఉబలాటంతో అలా పరుగులు పెడుతున్నాననుకుంటోందేమో!

'ఈ రోజుకి తిరిగింది చాలు! ఇక ఇంటికెడదాం పదండి!' అనగలిగే స్వతంత్రం నా భార్యకు నా దగ్గర లేదు.

తొలిసారిగా నాతో బయల్దేరి వచ్చిన కొత్త పెళ్ళికూతురాయె! నేనే ఆ కొత్తను పోగొట్టాలి.

★ ★ ★

మాతుంగా నుంచి తిరిగి వచ్చేటప్పుడు ఎలక్ట్రిక్ ట్రైన్‌లో మాకు పక్కపక్క సీట్లు దొరికాయి.

వయసులో ఉన్న ఆడదీ, మగాడూ పరస్పరం తాకుతూ కూర్చుంటే ఆ స్పర్శతో రాజుకునే అగ్నికి శారీరక వాంఛలనే నిప్పురవ్వలు రగులుతాయి.

మరి మేం కొత్తగా పెళ్ళయిన పడుచువాళ్ళం. మాలో చెలరేగుతున్న కోరికలు ఎంత తీవ్రంగా ఉన్నా ఏకాంతం దొరకక వాటిని అణుచుకోక తప్పటంలేదు.

చీకటిగా ఉన్న సందుల్లోకి ఆమెను వెంటబెట్టుకుని వెళ్ళినా, కాస్తగట్టిగా చెయ్యిపట్టుకోగానే తను బెదిరిపోసాగింది.

గుబురుగా ఉన్న చెట్ల చాటు చీకట్లో ఊరుకున్నా, ఏదన్నా వెలుతురు పడగానే బెంబేలెత్తిపోతూ నా చెయ్యి వదిలేస్తోంది.

ఈ నగరంలో కాస్త చీకటిగా ఉన్న చోటు దొరికితే అన్నీ జరిగిపోతూనే ఉంటాయి. పైగా ఇది రాత్రివేళ! ఎవరేం చేసినా ఎవరికీ అభ్యంతరం ఉండదు.

మరో మనిషి ఏం చేస్తున్నాడో.. ఎక్కడేం జరుగుతుందో.. ఇక్కడెవరూ పట్టించుకోరసలు.

అయితే పల్లెటూళ్ళో పుట్టిపెరిగిన నా పత్ని దగ్గర ఈ బొంబాయి పప్పులేం ఉడకవు. నడిరోడ్డు మీద తననేమన్నా చెయ్యబోతే ఊరుకునే రకం కాదామె! అందుకని ఊరకనే సందులూ గొందులూ తిరుగుతూ అర్ధరాత్రివేళకి హాజియార్‌జీ ఇంటికి వెళ్ళి తలుపులు తట్టాను.

కళ్ళు నులుముకుంటూ వచ్చి తలుపులు తీశాడు ఆ కాలికట్ పెద్దమనిషి.

ఆయన్ని కాస్త దూరంగా తీసుకువెళ్ళి, "దిక్కులేనివారికి దేవుడే దిక్కన్నట్లుగా, ఈ మహానగరంలో ఎవరూ లేని నన్ను నువ్వే ఆదుకోవాలి హాజియార్‌జీ!" అంటూ గుండెను ద్రవింపజేసే వేదనతో వేడుకున్నాను.

"అరె! నస పెట్టకుండా సంగతేమిటో చెప్పవోయ్! ఎందుకంత వ్యాకులం? "

"ఈ రాత్రికి నా భార్యకు మీ ఇంట్లో కాస్త చోటివ్వవూ? " దీనంగా అడిగాను.

"అమ్మాయికి మాత్రమేగా? "

"అవును హాజియార్! నేను పాత చోటుకు వెడతాను. అక్కడ నా మిత్రుడు ఉంటాడు గదా!"

"సరే! ఇక్కడే కాసేపు నిలబడు. నేను బీబీని అడిగి చూస్తాను"

లోపలికి వెళ్ళిన హాజియార్ ఎంతసేపటికీ రాకపోయేసరికి.. ఇక లాభం లేదనుకుంటూ వెనుదిరిగి పోదామనుకున్నాను.

అర్ధాంగిని కాలిబాట మీదే పడుకోమని, తెల్లారేవరకూ కాపలా కాద్దామనే అనుకున్నాను. అయినా లోపలేం జరుగుతోందో తెలుసుకోవాలని, తలుపు దగ్గరకు వెళ్ళి చెవులు రిక్కించి వినసాగాను.

నా భార్యను ఇంట్లోకి రానివ్వాలా వద్దా? అని ఆ భార్యాభర్తలు మల్లగుల్లాలు పడుతున్నారు.

ఫలితం ఎలా వుంటుందోనని నేను ఆలోచిస్తూ అక్కడే నిలబడి వుండగా తటాలున తలుపు తీశాడు హాజియార్.

"అరె! పిళ్ళై! నువ్విక్కడేం చేస్తున్నావ్?

అప్పటి నుంచీ తలుపు దగ్గరే నిలబడ్డావా ఏం? " అన్నాడు.

"కేవలం ఈ ఒక్కరాత్రికి మాత్రమే నీ పత్నిని తనతోపాటు పడుకోనిస్తానంది బీబీ!" అనే కబురు చెప్పాడు హాజియార్‌జీ మళ్లీ.

నేను తేలిగ్గా ఊపిరి పీల్చుకున్నాను.

"పద బేటీ! ఈ రోజుకి అమ్మ దగ్గర పడుకుందుగాని. త్వరగా రా!" అంటూ, దూరంగా నిలబడివున్న నా భార్యను సాదరంగా ఆహ్వానించాడు.

ఆమె ఆర్ద్రతతో నా వంక చూసింది. 'భగవాన్! ఈ భూమి బద్దలై నేను అధః పాతాళానికి వెళ్ళిపోతే ఎంత బాగుంటుంది!' అనుకున్నాను.

"వెళ్ళు అమ్మా! అమ్మ దగ్గర పడుకో. తెల్లారకముందే వచ్చేస్తాను నేను" అంటుంటే నా స్వరం కంపించింది.

ఆమె మళ్ళీ నా వంక చూసింది. నేను అదేమాట గట్టిగా చెప్పటంతో ఇక చేసేదేం లేక లోపలికి వెళ్ళింది.

★ ★ ★

చాలా సేపటి వరకూ ఆ ఇంటిచుట్టూ కాలుగాలిన పిల్లిలా తిరిగాను నేను. అక్కడ నుంచి వెళ్ళటానికి మనసొప్పటం లేదు. కదలటానికి ఓపిక అసలే లేదు.

చాలా సేపటికి కాస్త ఓపిక తెచ్చుకుని, బాంబే నగరంలోని బడాబడా బాటలమీద నెమ్మదిగా నడవసాగాను.

హోటల్ ఆస్టోరియా, ఎయిర్‌లైన్స్, నటరాజ్, సీగ్రీన్, తాజ్... ఇలా నాకు కనపడ్డ ప్రతి హోటల్‌నీ కూలగొట్టి నేల మట్టం చెయ్యాలనిపిస్తోంది. ఆ శిథిలాలను కూడా వదలకుండా నుజ్జునుజ్జు చేసి గాలిలో కలిపెయ్యాలనేటంత కసి! కక్ష!

ఆయా హోటల్స్‌లో రూం కావాలంటే రెండొందలూ, మూడొందలూ, ఐదొందలూ... ఎంతడిగితే అంత చెల్లించాలా? ఇచ్చుకోలేని నిరుపేదలేం చేయాలి?

స్టార్ హోటల్స్ వాళ్ళందరి పట్లా ఆపుకోలేని ఆగ్రహం కలుగుతోంది. ఎందుకో తెలీటం లేదు. దారిలో ఏది కనపడితే దాన్ని పగలగొట్టాలనే వెర్రి కోరిక! ఎవరి మీదో పగతీర్చుకోవాలనే మొండిపట్టుదల.

శరీరాన్ని బలవంతంగా నెట్టుకువెళ్ళి, ఏదన్నా పెద్ద హోటల్ రూములో విసిరెయ్యాలనిపించింది.

నేను నడుస్తున్న కాలిబాట పక్కనే రోడ్డు మీద బ్యూక్ కారొకటి ఆగి వుంది.

అనుకోకుండానే అందులోకి చూశాను. రోడ్లమీద వేగంగా నడిచే ఆ నాలుగు చక్రాల మహల్‌లో ఏదో అహితమే జరుగుతోంది.

## కొత్తగాలి...

అతను ఉగ్రవాదే
చోరబాటు దారుడే
ఆమె మనసివ్వకుండానే
ప్రేమాస్త్రం గురిపెడుతున్నాడు!

– జి. విజయశ్రీ,
శ్రీకాకుళం

ఏం జరుగుతోందో తెలుసుకోవాలనే స్వాభావికమైన ఇచ్ఛతో బాగా దగ్గరకు వెళ్ళి లోపలకు తొంగి చూశాను.

"ఏయ్ రాస్కెల్" అని గర్జించారెవరో.

భయపడి పరిగెత్తాను. కానీ కాసేపటికి మళ్ళీ సాహసించాను.

విద్వేషం, అసహ్యం, కడుపుమంట... ప్రతిహింసా భావం.. ఇలా నన్ను ఆవహించిన దుర్గుణాలతో రగిలిపోతున్న నేను, అక్కడే రోడ్డుమీద పడివున్న ఓ మోస్తరు రాయిని తీసి, ఆ కారు వెనక అద్దానికి తగిలేట్లు బలంగా విసిరాను.

గురి తప్పలేదు. భళ్ళున శబ్దం చేస్తూ ఆ అద్దం ముక్కలు ముక్కలుగా బద్దలైపోయింది. ఆ దృశ్యాన్ని కళ్ళారా చూశాక చాలా తృప్తిగా అనిపించింది.

వెంటనే ఆ కారులోనుంచి ఎవరో బయటకు రావటం గమనించి పరుగులంకించుకున్నాను.

అలా పరిగెత్తి పరిగెత్తి రోడ్డు మలుపు తిరిగాకగానీ మామూలు మనిషిని కాలేదు నేను. మళ్ళీ హాజియార్‌జీ ఇంటి సమీపానికి వెళ్ళి మిగిలిన రాత్రంతా అక్కడే తిరుగుతూ గడిపేశాను.

భళ్ళున తెల్లారింది.

వెంటనే ఆ ఇంటికి వెళ్ళి తలుపు తట్టాను.

బయటకు వచ్చిన అర్ధాంగితో సహా మళ్ళీ రోడ్డున పడ్డాను.

నన్ను చూస్తూనే వెక్కివెక్కి ఏడవటం మొదలెట్టింది తను. కారణం నేనడగలేదు. అడగలేకపోయాను.

ఆ రోజంతా కూడా నగరంలోని బస్తీలన్నీ తిరిగి ప్రయత్నించినా, భార్యతో కలిసి బతకటానికి ఓ గూడు కుదుర్చుకోలేకపోయాను.

రాత్రి పొద్దుపోయే వరకూ ప్రయత్నాలు కొనసాగించి, ఇక లాభం లేదనుకుంటూ... విక్టోరియా టర్మినస్ స్టేషన్‌కు వెళ్ళి... తెల్లవార్లూ వెయిటింగ్ రూంలో కూర్చున్నాం.

ఎందుకంటే అసలు పడుకోటానికి మాకు చోటేదీ?

★ ★ ★

రైల్వేవారిని సంప్రదిస్తూ, మలయాళీ కుటుంబాల వారెవరైనా మా పల్లెకు సమీపంలోని స్టేషన్‌కు వెళ్ళే రోజును గురించి ఆరా తీశాను. సమాచారం దొరకగానే ఆ తేదీని, ట్రైన్ నంబర్నీ రాసి పెట్టుకున్నాను.

కొత్త కాపురానికి కొనుక్కున్న పాత్ర సామాగ్రినీ, పన్నెండేళ్ల క్రితం నేను బొంబాయికి వస్తూ తెచ్చుకున్న ట్రంకు పెట్టెనూ, కంబళినీ, ఇంకా నా దగ్గరున్న చిన్నా చితకా వస్తువులన్నిటినీ హాజియార్‌జీతో వేలం వేయించాను.

ఆయన తగు చతురతతో వ్యవహరించి నేను కొన్నదానికన్నా ఎక్కువ సొమ్ము రాబట్టాడు.

ఆ డబ్బుతో మా ఊరికి ఓ థర్డ్ క్లాస్ టికెట్ తీసుకుని, మిగిలినది రోజువారీ ఖర్చుకు వుంచుకున్నాను.

పగలంతా నగరంలోని వివిధ ప్రదేశాలలో తిరుగుతూ రాత్రి పొద్దు పోయేవేళకు విక్టోరియా టెర్మినల్‌కు వెళ్లి... వెయిటింగ్ రూంలో విశ్రాంతి తీసుకుంటూ... మేమిద్దరం బొంబాయిలో ఏడు రోజుల పాటు సహజీవనం సాగించాం!

ఇన్నాళ్లూ నేను, నా అర్ధాంగితో కలిసి జీవించినట్లైంది. నిజంగానేనా?

ఎనిమిదో రోజున ఆమె తెచ్చుకున్న పెట్టెతో సహా అమ్ముకుట్టిని రైలెక్కించాను.

ఆ బోగీ పక్కనే ప్లాట్‌ఫామ్ మీద నిలబడి కిటికీలోంచి ఆమెనే చూడసాగాను.

ఏదో శుభకార్యానికని గుంపుగా వెడుతున్న మలయాళీ మహిళల మధ్య కుదురుగా కూర్చున్న అమ్ము.. దోసిట్లో ముఖం దాచుకుని వెక్కివెక్కి ఏడుస్తోంది.

గార్డు ఈల వేశాడు. బండి కదిలింది. ప్లాట్‌ఫామ్ దాటగానే వేగం పుంజుకుంది. నా చిన్ననాటి నేస్తం, నా సహధర్మచారిణి.. అమ్మును కూడా తనతోపాటు, ఇప్పట్లో నేను వెళ్ళలేనంత దూర ప్రాంతానికి తీసుకువెళ్లిపోయింది.

వచ్చేపోయే ప్రయాణికులతో కిటకిటలాడుతున్న విశాలమైన విక్టోరియా టెర్మినస్ ప్లాట్‌ఫామ్ మీద ఏ తోడూ లేని ఒంటరినై నిలబడిపోయాను నేను. ©

# కాలాతీతం





జేమ్స్ జాయిస్

# యూలిసీస్

ఇందులో స్టీఫెన్ డెడాలస్, లియోపాల్డ్ బ్లూం, మాలీ ప్రధాన పాత్రలు.

లియోపాల్డ్ బ్లూం యూదు సంతతికి చెందిన అడ్వర్టయిజింగ్ మేనేజర్, మధ్య వయస్కుడు. ఆయన భార్య మాలి. ఆమె స్పానిష్ సంతతికి చెందినది. కూతురు మిల్లీ (మిల్లిసెంట్). మాలీ ప్రేమికుడు బ్లేజెస్ బాయ్‌లాన్. ఒక ప్రైవేట్ స్కూల్ టీచర్ స్టీఫెన్ డెడాలస్. వైద్య విద్యార్థి బక్ ముల్లిగన్.

ఈ కథకూ హోమర్ రాసిన గాథకూ సారూప్యం ఉంటుంది. పాత్రలన్నీ గ్రీకు పాత్రల్ని పోలి ఉంటాయి. ఉదాహరణకు స్టీఫెన్ డెడాలస్- టెలిమాకస్, లియోపాల్డ్ బ్లూం- యూలిసీస్, మాలీ- పెనెలోప్.

హోమర్ రాసిన యూలిసీస్‌లోని సముద్రయానాలు, జాయిస్ కథలో, డబ్లిన్ నగర వీధుల్లో జరుగుతాయి.

తన భార్య మాలీ, బాయ్‌లాన్‌తో తిరుగుతున్నదని లియోపాల్డ్ బ్లూంకు తెలుసు.



# జేమ్స్ జాయిస్ (1882 - 1941)

"జేమ్స్ జాయిస్‌ను అర్థం చేసుకోవాలంటే అతనికి తెలిసినంత మనకూ తెలిసుండాలి. అందువల్ల సామాన్య పాఠకులకు జాయిస్ అర్థం కాడు అనటంలో అతిశయోక్తి లేదు" ఈ మాటలు ఇంగ్లీషు విమర్శకులు, తమ పాఠకుల్ని దృష్టిలో పెట్టుకుని చెప్పారని గుర్తుంచుకోవాలి.

డబ్లిన్‌లో జన్మించిన జేమ్స్ అగస్టిన్ అలోసియస్ జాయిస్ విలక్షణమైన ప్రతీకలతో, విచిత్ర పదబంధాలతో, శ్రవ్యానందం కోసమే అన్నట్టుగా కొత్త భాషను సృష్టించాడంటారు.

ఇరవయ్యేళ్లప్పుడు 'నాకు నచ్చని చోట ఉండను. నచ్చని పని చెయ్యను. మాతృదేశమైనా, మంచి ఉద్యోగాలైనా లెక్కచెయ్యను' అని తీర్మానించుకుని డబ్లిన్ నుండి పారిస్‌కు కట్టుబట్టల్తో ప్రయాణమయ్యాడు. రాయాలనే కోరిక ఉంది. రాయలేకపోయాడు. చవకగా దొరికే కోకో తాగి బతికాడు. యూలిసీస్‌లో కూడా కోకో ప్రస్తావన ఎక్కువగా వస్తుంది. ఆరోగ్యం పాడయింది. పళ్లు పుచ్చిపోయాయి. చికిత్సకు డబ్బుల్లేవు. చూపు మందగించింది. ఆర్నెల్ల తర్వాత ఇంటి నుండి కబురు వచ్చింది. తల్లి మరణశయ్య మీద ఉంది. ఐర్లండు వెళ్లక తప్పలేదు.

1904 నాటికి జాయిస్ నిస్పృహతో తాగుబోతుగా మారాడు. ఒంటరితనం భరించలేక, నోరా బార్నాకల్‌ను పెళ్లి చేసుకుని, స్విట్జర్లాండు వెళ్లి బెర్లిట్జ్ స్కూల్లో లాంగ్వేజ్ టీచర్‌గా చేరాడు.

1905లో ఒక కథాసంకలనం ప్రచురించాలనుకున్నాడు. ఈ ప్రతిపాదనకు మొదట అంగీకరించిన పబ్లిషర్లు 'కథలు అత్యంత సహజంగా ఉన్నాయి' అనే కారణంతో కంపోజ్ చేసిన గ్యాలీలను కూడా పక్కనబెట్టారు. సుమారు పదేళ్ల తర్వాత 'డబ్లినర్స్' లండన్‌లో అచ్చయింది.

గడ్డురోజుల తన జీవితాన్ని గురించి జాయిస్ 'అన్ని కళల్లోకీ గొప్పకళ జీవించగలగటమే' అంటాడు.

'పోర్ట్రెయిట్ ఆఫ్ ది ఆర్టిస్ట్ యాజ్ ఎ యంగ్‌మాన్' అనే ఆత్మ కథాత్మకమైన నవల రాయటానికి మరో పదేళ్లు పట్టింది. ఇందులోని కథానాయకుడు స్టీఫెన్ డెడాలస్ తనే. 'రోజూ చూసే వాస్తవాల్ని, వెయ్యోసారో, లక్షోసారో మళ్లీ అనుభవించి, నా ఆత్మ అనే కొలిమిలో కరిగించి నా జాతి అంతర్లోక చిత్రాన్ని గీశాను' అంటాడు జేమ్స్ జాయిస్ ఆ నవల గురించి

ఆలస్యంగా నిద్రలేచి బ్రేక్‌ఫాస్ట్ (పోర్క్ కిడ్నీ) తయారు చేసుకుంటాడు. ముల్లిగన్‌తో పోట్లాట పెట్టుకున్న స్టీఫెన్ స్కూలు ఉద్యోగం మానేస్తాడు. అడ్వర్టయిజింగ్ స్లోగన్స్ ఏమి రాయాలో తెలియక బుర్ర బద్దలు కొట్టుకుంటాడు బ్లూం. పాట్రిక్ డిగ్నామ్ అంత్యక్రియలకు అనేకమంది ప్రముఖులు హాజరవుతారు. మినా ప్యూర్‌ఫామ్ అనే మహిళ ప్రసవిస్తుంది. నగరంలో చిన్నాపెద్దా అనేక కార్యక్రమాలు జరుగుతాయి. స్థూలంగా మనం చెప్పుకోగలిగిన కథ ఇంతే.

మూడుభాగాల, పద్దెనిమిది అధ్యాయాల నవల ఇది. ఒక్కొక్క అధ్యాయంలో ఒక్కొక్క శైలీ విన్యాసం పాఠకుడి మేధస్సుకు సవాలు విసురుతుంది.

'చైతన్య స్రవంతి' గురించి తెలుసుకోవాలనుకున్న వాళ్లందరికీ 'యూలిసీస్' పాఠ్యగ్రంథమని మనకు తెలుసు. కాని, జాయిస్ కథన విలక్షణతను 'ఇంటీరియర్ మోనోలాగ్' అనే మాట మరింత బాగా వివరిస్తుంది. ఆలోచనల ప్రవాహాన్ని వర్ణించే ఈ పద్ధతిని మౌలికంగా టాల్‌స్టాయ్ అనేక ఏళ్ల ముందే తన 'అన్నా కరేనినా'లో ఉపయోగించాడు. హెన్రీ జేమ్స్ రచనల్లో ఈ ధోరణి కొంతవరకు కనిపిస్తుంది.

చెబుతూ. ఇది తర్వాత రాబోయే బృహత్ గ్రంథం 'యూలిసీస్'కు ప్రాగ్రూపం. 'పోర్ట్రెయిట్' చాలాకాలం పుస్తకంగా రాలేదు. ఎజ్రా పౌండ్ ప్రమేయంతో 'ఈగోయిస్ట్' అనే పత్రికలో సీరియల్‌గా మాత్రం వచ్చింది.

'యూలిసీస్', జూన్ 16, 1904 నాడు డబ్లిన్‌లో జరిగిన కథ. సాహిత్యప్రియులకు ఇదొక చారిత్రాత్మకమైన రోజు. ఈ నవల రాయటానికి జాయిస్‌కు ఏడేళ్లు పట్టింది.

అయితే సెన్సార్ ఉక్కుపాదం 'యూలిసీస్'ను వెంటాడింది. 'ది లిటిల్ రివ్యూ' పత్రికలో, 1918లో సీరియల్‌గా వచ్చినప్పుడే నిరసనలు ప్రారంభమయ్యాయి. అశ్లీల సాహిత్యమని ముద్రవేసి అమెరికన్ ప్రభుత్వం ఆ పత్రిక కాపీలను స్వాధీనం చేసుకొని, పత్రిక ఎడిటర్లకు జరిమానా విధించింది. అయినప్పటికీ సిల్వియా బీచ్ అనే జాయిస్ అభిమాని, ఫ్రాన్స్‌లో, స్వంత డబ్బుల్తో ఈ పుస్తకాన్ని ప్రచురించి, రచయిత నలభయ్యో జన్మదినాన బహుకరించింది.

ఈ పుస్తకంపై కోర్టు కేసు నడిచింది. నిషేధాన్ని ఎత్తివేస్తూ న్యాయమూర్తి ఇచ్చిన తీర్పు కూడా చారిత్రాత్మకమే. నిషేధాలన్నీ తొలగి పాఠకులకు చేరగలిగే నాటికి జాయిస్‌కు యాభై రెండేళ్లు. దృష్టి దెబ్బతింది. పూర్తి అంధత్వానికి ఎక్కువ దూరం లేదు. మరణించేలోగా జాయిస్‌కు పదిసార్లు కంటి ఆపరేషన్లు జరిగాయి. కళ్లు కనిపించవు గనుక పెద్ద పెద్ద షీట్లమీద తాటికాయంత అక్షరాల్తో రాయాల్సి వచ్చేది. పుస్తకాల మీద పెద్దగా ఆదాయం లేదు. స్నేహితుల దయాధర్మాలమీద బతికాడు. కూతురు లూసియా అనారోగ్యంతో శానిటోరియంలో ఉంది.

ఇన్ని కష్టాలతో జాయిస్ చివరి నవల 'ఫిన్నెగన్స్ వేక్' రాశాడు. ఈ గ్రంథం భాషా ప్రయోగంలో ఎవరూ అధిగమించలేని మైలురాయి. ఎక్కడా విరామచిహ్నాలు లేవు. ఇది ఒక నిరంతర చైతన్య స్రవంతి. యూలిసీస్‌లో కథాకాలం పగలు. 'ఫిన్నెగన్స్ వేక్'లో రాత్రి, సుప్తచేతన. ఒక దీర్ఘసమ్మిశ్రిత స్వప్నం.

జాయిస్ పదహారేళ్లకు పైగా సమయం వెచ్చించిన ఈ పుస్తకం 1939లో వెలుగు చూసింది. ఇప్పటికీ 'ఫిన్నెగన్స్ వేక్'ను అర్థం చేసుకొని ఆదరించినవాళ్లు బహు తక్కువ మందే ఉంటారు"

యాభైతొమ్మిదో ఏట జాయిస్‌కు కష్టాల్ని తట్టుకునే శక్తి నశించింది. ఆర్థికంగా ఫిన్నెగన్స్ వేక్ విఫలయత్నం. భవిష్యత్తంతా అంధకారమయమే. లూసియానా ఏమవుతుందోనన్న బెంగ. కడుపులోని వ్రణాలకు ఆపరేషన్ చేశారు. 1941 జనవరి 13నాడు జ్యూరిచ్‌లో మరణించారు జాయిస్.

'యూలిసీస్' చదవటానికన్న, వినటానికెక్కువ బాగుంటుందంటారు. జాయిస్ సంభాషణా చాతుర్యం అనితర సాధ్యం. ఆ మాటల విరుపు, యాస, మరో రచయిత పట్టుకోలేకపోయాడు.

పాత్రలు చాలాసార్లు తమలో తాము మాట్లాడుకొంటాయి. గడియారం టిక్-టిక్, గుర్రపు డెక్కల చప్పుడు, సముద్రపు హోరు- అన్నిటినీ.. పదాల్లో అద్భుతంగా పట్టుకున్నాడు జాయిస్. పాత్రలు పెద్ద విద్యావంతులేం కాదు. కాని, అందరూ షేక్‌స్పియర్‌లాగా, డాంటెలాగా భాషా ప్రవీణులే. భాష చెయ్యగల మేజిక్ అనుభవించాలంటే జాయిస్‌ను చదవాల్సిందే.

ఇది సీరియల్‌గా వచ్చిన తొలిరోజుల నుండీ ఇప్పటిదాకా ఆయనను అనుసరించటానికి రచయితలు ప్రయత్నిస్తూనే ఉన్నారు. కాని ఎవరూ ఆ దరిదాపులకు కూడా చేరలేదు.

'యూలిసీస్ ఓ అన్వేషణ. నువ్వూ, నేనూ, అందరం అన్వేషకులమే. జీవితంలో ఏదో పోగొట్టుకుని సాహిత్యంలో, సంస్కృతిలో, రాజకీయాల్లో, ఆధ్యాత్మికతలో, వెదుక్కుంటున్న మానవ జాతి కథ. ఆధునిక మానవుని అన్వేషణకు ప్రతిరూపం యూలిసీస్' అంటాడు ప్రముఖ విమర్శకుడు

విలియం మార్క్‌టిండాల్.

స్టువార్ట్ గిల్బర్ట్ రాసిన కీ (టిప్పణి) ఈ పుస్తకాన్ని అర్థం చేసుకోవటానికి బాగా ఉపయోగపడుతుంది. జాయిస్ చేసిన భాషా ప్రయోగాలు అనేక మలుపులు తిరుగుతూ అనేక విన్యాసాల తర్వాత, పడకలో మాలీ బ్లూం ఎడతెగని ఆలోచనలు ఒక్క విరామ చిహ్నం లేని పాతికవేల పదాల స్వగతంగా పరాకాష్ఠకు చేరుకుంటాయి. పుస్తకంమీద నిషేధం ఎత్తివేసిన తర్వాత కూడా గిట్టని వాళ్ల అభిశంసనలు ఆగలేదు.

'నీచమైన పుస్తకం', 'గందరగోళం', 'అర్థం లేని చెత్త', 'పిచ్చాసుపత్రిలో వుండాల్సిన మనిషి జాయిస్', 'ఇలాంటి వాళ్లను బయట తిరగనివ్వటం ప్రమాదకరం', 'నైతికంగా పతనమైన మనిషి జాయిస్', 'సాహిత్య తిరుగుబోతు', 'ఇది సాహిత్యం కాదు.. కుళ్లిన ఆలోచనల దుర్గంధం' లాంటి ఘాటైన విమర్శలు అనేకం వచ్చాయి.

అదే సమయంలో డబ్ల్యు. బి. ఈట్స్ జాయిస్‌ను 'జీనియస్' అన్నాడు.

'భాషమీద యింత అధికారమున్న వ్యక్తి మిల్టన్ తర్వాత జాయిస్సే' అన్నాడు టి.ఎస్. ఇలియట్

భిన్నధృవాల్లాంటి సాహితీవేత్తల అభిప్రాయాల మధ్య సామాన్య పాఠకుడికి దారి కనిపించలేదు. యూలిసీస్‌లో చెప్పిన కథ సులభగ్రాహ్యమే. ఆ చెప్పిన పద్ధతే పాఠకుడికి కొరుకుడు పడదు.

యూలిసీస్ రచనాశిల్పం జాయిస్ మేధో పరిణతికి ప్రతీక. ఆ పదచిత్రాలు, ఆ వాక్య నిర్మాణం, ఇతర పాశ్చాత్య భాషా సంస్కృతుల సంబోధన, అసంఖ్యాకమైన గ్రంథాల నుండి ఇచ్చిన ఉదాహరణలు.. ఒక విజ్ఞాన సర్వస్వంలో ఉండవలసినంత సమాచారం ఒక కథలో అన్యాపదేశంగా పొందగలగటం- ఇవన్నీ పాఠకుల ఊహకు అందని విషయాలు. ఇంగ్లీషులోనే కాదు, మొత్తం ప్రపంచ సాహిత్యంలోనే యూలిసీస్ అంత విలక్షణమైన కాల్పనిక రచన మరొకటి లేదని అందరూ అంగీకరించినా, చదివి ఆనందించినవాళ్లు మాత్రం తక్కువే.

అయితే యిప్పటికి 'యూలిసీస్' చదివిన వాళ్ల సంఖ్య కొంత పెరిగింది. కాని రాబిన్సన్ అండ్ కాంబెన్స్ తయారుచేసిన 'ఏ స్కెలిటన్ కీ టు ఫిన్నెగన్స్ వేక్' తోడు లేకుండా ప్రారంభించటం దుస్సాహసమే. ఇదొక లిటరరీ పజిల్. ప్రముఖ అమెరికన్ రచయిత థారంటన్ విల్డర్, 'మెదడుకు పదును పెట్టాలనుకున్నప్పుడల్లా ఫిన్నెగన్స్ వేక్ కొద్దిగా చదువుతాను' అన్నాడు.

'యూలిసీస్' చదివిన పాఠకులకన్నా దీని గురించి చదివిన పాఠకులే ఎక్కువ. పుస్తకంలో ఏముందో తెలుసుకోవాలనుకున్న వాళ్లకోసం, అధ్యాయాల పరంగా కథ యిలా సాగుతుంది.

**మొదటిభాగం- టెలిమాకియాడ్:**

**అధ్యాయం 1 – టెలిమాకస్:** స్టీఫెన్, బక్ ముల్లిగన్‌లు మార్టెల్లోటవర్‌లో అల్పాహారం చేస్తారు. పిల్లలకు పాఠాలు చెప్పటం గురించి స్టీఫెన్‌ను ఎద్దేవా చేస్తాడు ముల్లిగన్.

**అధ్యాయం 2 – నెస్టర్:** క్లాసులో పాఠం చెబుతాడు స్టీఫెన్. స్కూల్ మాస్టర్ డీజీతో మాట్లాడతాడు.

**అధ్యాయం 3 – ప్రొటియస్:** తల్లి మరణం తర్వాత స్టీఫెన్ కుటుంబ పరిస్థితి దిగజారుతుంది. ఇంటివైపు మెల్లిగా నడుస్తూ, చెదరిపోయిన చిన్నప్పటి కలల్ని గుర్తుచేసుకుంటాడు.

**రెండో భాగం- ది ఒడిస్సీ:**

**అధ్యాయం 1 – కాలిప్సో:** బ్లూం ప్రవేశం, అల్పాహారం వండుతుంటాడు. బాయ్‌లాన్ నుండి లేఖ అందుకుంటుంది మాలీ. ఇద్దరూ రహస్య సమావేశం కోసం ప్రయత్నిస్తున్నారని తెలుసుకుంటాడు

బ్లూం.

**అధ్యాయం 2 – లోటస్ ఈటర్స్:** బ్లూం పోస్టాఫీసుకెళ్లి, లేఖాప్రణయం కొనసాగిస్తున్న మార్తా రాసిన వుత్తరం అందుకుంటాడు. తర్వాత, చర్చి కెళ్లి, సబ్బు కొనుక్కుని రోజంతా ఆ సబ్బును జేబులో పెట్టుకుని తిరుగుతాడు.

**అధ్యాయం 3 –హేడ్స్:** డిగ్నాం అంత్యక్రియలకు హాజరవుతాడు బ్లూం. దారిలో స్టీఫెన్ కనిపిస్తాడు. బ్లేజెస్ బాయ్‌లాన్ గురించి వ్యంగ్యంగా మాట్లాడతారు వాళ్లు.

**అధ్యాయం 4 – అయోలస్:** ఆఫీసులో, అడ్వర్టయిజింగ్ స్లోగన్‌ల గురించి తీవ్రంగా ఆలోచిస్తాడు స్టీఫెన్. పత్రిక ఎడిటర్లతో మాట్లాడతాడు.

**అధ్యాయం 5 – లెస్ట్రిగోనియన్స్:** రోడ్లమీద చాలాసేపు నడుస్తాడు బ్లూం. డేవీ బవిన్ పబలో సేదదీరుతాడు. బాయ్‌లాన్ గురించి కొన్ని విషయాలు తెలుస్తాయి.




**అధ్యాయం 6 – స్కైలా అండ్ చేరిబ్డిస్:** స్టీఫెన్ లైబ్రరీకెళ్లి షేక్స్పియర్ గురించి మాట్లాడుతాడు. ఆధ్యాత్మిక గురువు కోసం అతడు అన్వేషిస్తున్న విషయం తెలుస్తుంది.

**అధ్యాయం 7 – వాండరింగ్ రాక్స్:** జెసూట్ ఫాదర్ కాన్మీ, స్టీఫెన్, బాయ్‌లాన్, అతని సెక్రెటరీ టైపిస్ట్ మిస్ డ్యూన్, బ్లూంలు మనకు దర్శనమిస్తారు.

**అధ్యాయం 8 – సైరెన్స్:** ఆర్మండ్ హోటల్‌లోని బార్‌మెయిడ్‌లు, మిస్ డౌస్, మిస్ కెన్నెడీ ఉబుసుపోక కబుర్లు చెప్పుకుంటారు. బాయ్‌లాన్, మిస్ డౌస్‌తో సన్నిహితంగా మాట్లాడతాడు. బ్లూం లంచ్ చేస్తాడు. తన భార్య గురించి ఎవరో చెప్పుకోవటం వింటాడు.

**అధ్యాయం 9 – సైక్లాప్స్:** బార్‌లో, తగువు పెట్టుకుని అవమానం భరిస్తాడు బ్లూం. అతడిపై బిస్కట్ బార్స్ విసిరేస్తారు.

**అధ్యాయం 10 – నాసికా:** బీచ్‌కు వెళ్లిన బ్లూం, వికలాంగురాలైన గెర్టీ మాక్డోవెల్ వైపు కోరికగా చూస్తాడు. ఆమె అతణ్ణి ఒక అపరిచిత హీరోగా ఊహించుకుంటుంది.

**అధ్యాయం 11– ఆక్సెన్ ఆఫ్ ది సన్:** ప్రసూతి వైద్యశాల. రాత్రి పదిగంటలు. మిసెస్ ప్యూర్‌ఫామ్ ప్రసవిస్తుంది.

**అధ్యాయం 12– సిర్స్:** అర్ధరాత్రి మద్యశాల. స్టీఫెన్‌కు మందెక్కువైంది. బ్లూం కూడా వున్నాడు. ఇద్దరూ కలసి మాట్లాడుకుంటారు. ఆధ్యాత్మికంగా వీళ్లిద్దరూ తండ్రీ-కొడుకులు. ఇదే నవల క్లైమాక్స్.

**మూడో భాగం – ది నోస్టస్**

**అధ్యాయం 1 – యుమేయస్:** తప్పతాగిన స్టీఫెన్‌ను మద్యశాల నుండి లాక్కొస్తాడు బ్లూం. ఇద్దరూ ఒక కాబ్ డ్రైవర్ యింట్లో గడుపుతారు. అనుకోకుండా ఎదురైన ఓ వ్యక్తితో, తను ఉద్యోగం వదిలేసిన స్కూల్లో ఖాళీ వుందంటాడు.

**అధ్యాయం 2 – ఇథాకా:** నిద్రపోవటానికి స్టీఫెన్, బ్లూంలు యింటికి చేరుకుంటారు. కోకో తాగి స్టీఫెన్ వెళ్లిపోతాడు. బ్లూం భార్య పక్కన పడుకుంటాడు.

**అధ్యాయం 3 – పెనెలోప్:** నిద్రా-మేలుకువా కాని స్థితిలో వున్న మాలీ, భర్త బెడ్ మీదికి చేరటం గమనించి, ఒక సుదీర్ఘమైన కలవరింతలో మునిగిపోతుంది. అందులో తన బాల్యాన్ని, యవ్వనాన్ని, అప్పటిదాకా నవలలో జరిగిన అనేక సంఘటనలను గుర్తు చేసుకుంటుంది. విరామ చిహ్నాలు లేని అతిపెద్ద మోనోలాగ్ యిదే.

'యూలిసీస్' చదవలేకపోతే యూ ట్యూబ్‌లో కొంతైనా విని, ఆనందించవచ్చు.

– ఎం. వసంత

# తిక్క కుదిరింది

- వీరేశ్వరరావు. ఎమ్

సింగవరపు రామారావు సి.రా. పేరుతో మొదటిసారి ఒక పత్రికకు ఉత్తరం రాసాడు. ఆ ఉత్తరం అచ్చయ్యింది. అచ్చయిన ఉత్తరాన్ని మిత్రులకు పార్టీ ఇచ్చి బలవంతంగా చదివించాడు. ఆ తర్వాత చాలా ఉత్తరాలు, కవితలు, కథలు రాసాడు. చాలా భాగం చి.కా.బు (చిత్తు కాగాతాల బుట్ట)లోకి పోగా కొన్ని చిన్నపత్రికల్లో అచ్చయ్యాయి. అచ్చయ్యినప్పుడల్లా తన ఫ్రెండ్స్‌కి, బంధువులకి చెప్పి చదవమని పోరేవాడు. సి.రా బాధపడలేక బాగుందని వాళ్ళు ఉత్తరాలు రాసేవారు. కథ కింద ఆ ఉత్తరాల కటింగ్‌లు అతికించుకొనేవాడు. ఆ విధంగా సి.రా కీర్తి కండూతి పెరిగింది. సి.రా పేరు ఒక నెలలో ఏ పత్రికలోనైనా కనబడకపోతే పిచ్చెక్కినట్లు ఉండేవాడు. సి.రా మఖలో పుట్టి పుబ్బలో వాడిపోయే పత్రికల్లో చాలా రాసాడు. 'నాది సి. రా.. నా కవిత పెద్దరాశి..'లా అంటూ!



సింగవరపు రామారావు ఉద్యోగ ప్రయత్నాలలో హైదరాబాద్ వచ్చి కూకట్‌పల్లిలో స్థిరపడ్డాడు. ఒక ప్రైవేట్ కంపెనీలో ఎకౌంటెంట్‌గా పనిచేస్తున్నాడు. ఆఫీసుస్టాఫ్‌కి కవితలు వినిపిస్తున్నాడు. వాళ్ళు సి.రాని చూసి 'కసిరా' అని గొణుక్కుంటారు. సి.రా ఈ మధ్య పెళ్ళయ్యాక కూకట్‌పల్లిలో ఫ్యామ్లీపోర్షన్ తీసుకున్నాడు. అద్దె మూడు వేల ఐదువందలు. ఒకరోజు సి.రా ఇంటికి ఓనర్ వచ్చాడు. అద్దె తీసుకున్నాడు. ఓనర్ బయలుదేరుతుండగా మన సి.రా ఊరుకోకుండా రచయితనని తనలోని ఇంకో కోణాన్ని బయటపెట్టాడు. అచ్చయ్యిన తన రచనల బౌండ్‌ని చూపించాడు.

ఓనర్ అడిగాడు 'పత్రికల వాళ్ళు పారితోషికం పంపుతారా? ' అని.

'ఏదో పదో.. పరకా' అన్నాడు వినయంగా సి.రా.

'ఎప్పటినుంచో రాస్తున్నారు కదా! బాగా సంపాదించి ఉంటారు' అన్నాడు ఇంటి ఓనర్!

సి.రా మాట్లాడలేదు.

'మీ రచనలు బాగున్నాయి! ఇంకా రచయితగా మంచి భవిష్యత్ ఉంది' అని పొగిడి ఇంటి ఓనర్ వెళ్ళిపోయాడు.

ఓనర్ వెళ్ళాక గంటకి ఫోన్ వచ్చింది!

సి.రా భార్య రుసరుసలాడుతూ చెప్పింది. ఓనర్ నుండి ఫోన్ అని.

'నోర్మూసుకొని ఉండకుండా ఆ ఓనర్‌కి రచనలు చూపించారు. మీకు జీతం ద్వారా కాకుండా పత్రికల ద్వారా బోలెడు డబ్బు వస్తుందని వచ్చే నెల నుండి అద్దె ఐదు వందలు పెంచుతున్నానని ఫోన్ చేసాడు. ఈ పాత కొంపకి!'

అలా సి.రా కీర్తి కండూతి వల్ల తిక్క కుదిరింది. ©

# వాడే.. వీడు..



- వి. శ్రీలక్ష్మి

సుబ్బారావు, రంగారావు అనుకోకుండా బస్టాండు దగ్గర కలుసుకున్నారు. సుబ్బారావు అప్పుడే బస్సు దిగి రెండడుగులు వేసాడు. రంగారావు పక్కనే ఉన్న పళ్ళ దుకాణంలో పళ్ళు బేరమాడుతున్నాడు. చుట్టాలింటికి పళ్ళు తీసుకువెళ్తే బావుంటుందని సుబ్బారావు కూడా పళ్ళ దుకాణం వైపు నడిచాడు. అప్పుడు ఇద్దరూ చూసుకున్నారు. ఒకర్నొకరు గట్టిగా కౌగిలించేసుకున్నారు. అది నడిరోడ్డని కూడా మరచిపోయి.

రంగారావు కాస్త ముందు తేరుకున్నాడు. "ఏమీ తోచక ఇప్పుడే ఇంట్లోంచి బయటకి వచ్చాను. నువ్వేంటిఇక్కడ? చాలా రోజులకి కలిసాం. ఇక్కడకి మా ఇల్లు దగ్గరే పద.. పద" అని అన్నాడు.

సుబ్బారావు ఏదో చెప్పబోతున్నా వినిపించుకోలేదు రంగారావు. మంచి బేరం పోయిందని పళ్ళ దుకాణదారుడు తెల్లమొహం వేసాడు. అదేమీ పట్టించుకోకుండా ఇద్దరూ ముందుకు అడుగులు వేసారు, మాట్లాడుకుంటూనే.

రంగారావు అన్నాడు "చాలా రోజులకి కలుసుకున్నాం. అబ్బో.. ఎన్నాళ్ళ మాట. మా ఇంట్లో ఉండి ఈ రోజు భోజనం చేసి వెళ్ళాల్సిందే"

"మళ్ళీ ఇంకోసారి వస్తాను. ఈ సారికి వదిలెయ్యి చెల్లాయికి శ్రమ ఎందుకు" అని వారిస్తున్నాడు సుబ్బారావు.

మాటల్లో ఉండగానే ఇల్లు వచ్చేసింది.

"ఇదే మా ఇల్లు" అని లోపలికి తీసుకువెళ్ళాడు రంగారావు.

భార్యకి సుబ్బారావుని పరిచయం చేసాడు.

"ముందు కాఫీ పంపించు. తరవాత భోజనం ఏర్పాట్లు చెయ్యి. ఈ రోజు ఇక్కడే భోజనం చేస్తాడు" అని రంగారావు చెబుతుంటే మొహమాటపడ్డాడు సుబ్బారావు.

తర్వాత ఇద్దరూ మాటల్లో పడ్డారు. రంగారావు ఇంట్లో అడుగడుగునా ఆడంబరం కనిపిస్తోంది. ఇంటి నిండా ఖరీదైన వస్తువులు. చిన్న సైజు బంగళాలా ఉందా ఇల్లు.

తన ఇంటిని పరికించి చూస్తున్న సుబ్బారావుతో "ఇది మా అబ్బాయి కట్టించిందే. ఎలా ఉంది? వ్యాపారంలో నన్ను మించిపోయాడనుకో. రెండు చేతులా ఆర్జిస్తున్నాడు. ఇప్పుడు నాకేం దిగులులేదు. అమ్మాయికి కూడా మంచి సంబంధమే చేసాను. పిల్లల విషయంలో దిగుల్లేదు. అన్నట్టు నీక్కూడా ఓ కొడుకు కదూ! సరిగ్గా చదవడనీ, అల్లరి చిల్లరగా ఫ్రెండ్సుతో తిరుగుతుంటాడనీ బెంగ పెట్టుకునేవాడివి. ఇప్పుడేం చేస్తున్నాడు? ఉద్యోగం చేస్తున్నాడా? ప్రయోజకుడయ్యాడా?" అని రంగారావు అంటుండగానే టీవీలో ఏదో న్యూస్‌ను లైవ్‌లో చూపిస్తున్నారు.

ఇద్దరూ అటు చూసారు.

## చతుర కథలు

"అరే మా అబ్బాయి పోలీసుల మధ్య ఉన్నాడేమిటి? ఏమిటీ.. స్మగ్లింగ్‌లో పట్టుబడ్డాడా? ఆశ్చర్యంగా ఉందే?" అని రంగారావు అంటూవుంటే, సుబ్బారావు కల్పించుకుని "ఇంకో ఆశ్చర్యకర విషయం.. అతడి పక్కన నిల్చున్న డి.ఎస్.పి మా లక్ష్మీనారాయణే! ప్రయోజకుడయ్యాడా అని అడిగావు కదా..వాడే వీడు!" అన్నాడు.

©

# అభినందన చందనం!

## కప్పు టీ ధరకే 'చతుర' సమగ్ర నవల



పన్నెండు రూపాయలకు ఓ కప్పు, టీ లేదా కాఫీ కూడా రాని ఈ రోజుల్లో సుమారుగా వంద పేజీల నవలను 'చతుర' రూపంలో అందించడం గిన్నీస్ రికార్డుల్లోకి పోయే విషయమేమో? నా జీవితంలో ఈ చతుర, విపుల జంటపత్రికలను నూతన సంవత్సర కానుకలుగా ఆప్తులకు చందాలు కడుతుంటాను. తక్కువ ఖర్చులో నమ్మకంగా ప్రతినెలా ఇళ్లకు చేరుకునే మంచి కానుకలివి!

**వీసాలు లేకుండా విదేశీ సందర్శన**

ప్రతినెలా అనువాద కథల ద్వారా ఎన్నో దేశాలని వీసా లేకుండా చూపుతున్న 'విపుల' తెలుగువారు గర్వంగా చెప్పుకోదగ్గ పత్రిక. నా మటుకు ఢిల్లీలో ఉన్న ఇతర భాషా సాహితీ మిత్రులకు 'విపుల' గురించి చెప్పడం, కాపీలను చూపడం ఒక 'అంబాసిడర్'గా చేస్తుంటాను! ఎన్నెన్నో మంచి పత్రికలు కనుమరుగవ్వడాన్ని చూసాం. గత రెండు దశాబ్దాల్లో ఆర్థిక సంస్కరణల నేపథ్యంలో దూసుకు వచ్చిన వరదల్ని, సునామీల్ని తట్టుకుని, నిలిచి ముందుకు సాగుతున్న జంట పత్రికలు 'విపుల', 'చతుర'. ఢిల్లీలో ఉన్న మాకు ఈ రెండు పత్రికలు చేరినరోజు పండగే! అవి చేరని సందర్భాల్లో యాజమాన్యం దృష్టికి తెస్తే, వెంటనే కాపీ పంపే సంస్కారాన్ని కొనసాగిస్తున్న సిబ్బందికి అభినందనలు! ఈ రెండు పత్రికలు 'ఈనాడు' గొడుగు కింద జన్మించడం వాటి అదృష్టం. అంటే సంజీవనిని శరీరంలో అంతర్భాగంగా ఉంచుకుని బయటి ప్రపంచానికి చేరడమన్నమాట. అక్షరబలానికే పీటవేస్తూ ప్రతినెలా మొదటి తారీఖున మన ముంగిట్లో వాలేట్టు చేస్తున్నారంటే ఎడిటర్ రామోజీరావుగారి అంకిత భావం స్పష్టమవుతుంది.

**– డా. టీ. సంపత్‌కుమార్,**
కెనడియన్ అంబసీలో అధికారి,
ఢిల్లీ

## ప్రారంభ సంచికల నుండి చదువుతున్నా!

చతుర, విపులల్ని ప్రారంభ సంచికల నుండి చదువుతున్నాను. ప్రయాణాల్లో నాకు తోడుండేవి ఇవే. నేను రచయితనే అయినా విపులకు కథలు పంపే సాహసం ఎపుడూ చేయలేదు. అయితే అనేక చతురకతలూ, కార్డుకథలూ ప్రచురణకు నోచుకున్నాయి. అన్ని పజిల్స్‌లోనూ పాల్గొంటూ బహుమతులు కూడా పొందాను. 1987లో ఓసారి మూడు, నాలుగు చతుర కతలు రాసి పోస్ట్ చేశాను. నాలుగురోజులయ్యాక విడుదలైన చతుర సంచికలో 'మినీకథల పోటీ'ని ప్రకటించారు. అది చూసి, నాలుగు రోజులాగి ఉంటే ఆ కతల్ని పోటీకి పంపి ఉండేవాడినని మథనపడ్డాను. కానీ నన్ను సంభ్రమాశ్చర్యాలకు గురిచేస్తూ పోటీకి పంపని ఆ కతల్ని కూడా పరిశీలించి నా కతకు మొదటి బహుమతి ప్రకటించారు. నేనిప్పటికీ గర్వంగా తలచుకునే సందర్భం అది. ప్రపంచంలోని అన్ని భాషల కథలూ చదివే అదృష్టం కలిగిస్తున్న విపుల, మంచి నవలల్ని అందిస్తున్న చతుర మరో వందేళ్ల పాటు వెలువడాలని ఆశిస్తున్నాను.

**– కె.ఎన్.వి ఆంజనేయులు,**
విశాఖపట్నం

అన్నీ సరైన సమాధానాలు రాసిన వారిలో డ్రా ద్వారా ఎంపికైన ఈ విజేతకు రూ.150/- త్వరలోనే అందుతాయి.

**ఉడాలి భాస్కరయ్య**
19/12, ప్లాట్. నెం. 3,
అడయార్,
చెన్నై - 600020

## చతురంగం - 28 జవాబులు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 శై | శ | 2 వం | | 3 మ | 4 క | 5 రం | | 6 చై | 7 నా |
| లం | | 8 ద | 9 గా | | 10 ల | వ | 11 ణం | | తి |
| | 12 మ | | 13 త్ర | య | ము | | 14 ర | 15 తి | |
| 16 వ | ద | 17 న | ము | | 18 శ | 19 వం | | 20 అ | 21 ర |
| 22 కు | ము | లు | | 23 అ | | 24 శీ | 25 ను | | ధ |
| ళ | | 26 గు | 27 ణ | ని | 28 ధి | | 29 మే | 30 ఘ | ము |
| 31 మా | 32 సం | | వీ | | 33 రు | 34 మ | | నం | |
| 35 త | తా | 36 తి | | 37 మ | ర | క | 38 తం | | 39 జూ |
| | 40 న | రం | 41 వా | | ము | | 42 బు | ద్బు | దం |
| 43 మో | ము | | 44 గు | ట్టు | | 45 చీ | ర | | లో |

## సరైన సమాధానాలు రాసిన వారు

1. సి. నిర్మల, తిరుపతి, 2. డా. శివభూషణం, కర్నూలు, 3. రామకూరు లక్ష్మి, శ్రీకాకుళం, 4. ఆర్. వి. సి హెచ్. నాగేశ్వరరావు, శ్రీకాకుళం, 5. ఆంధ్ర అచ్యుతరామయ్య, తణుకు, 6. తల్లాప్రగడ మధుసూదనరావు, బెంగళూరు, 7. ఎన్. సుదర్శనరావు, నిజాంపేట, హైదరాబాద్, 8. కొక్కెరగడ్డ కామశాస్త్రి, మానేపల్లి, తూ. గో. జిల్లా, 9. నియాజ్ అలి, ఉప్పర్‌పల్లి, హైదరాబాద్, 10. జి. జయచంద్రగుప్త, కర్నూలు, 11. ఎమ్. నవ్య, విజయవాడ, 12. కరణం శివానందరావు, బెంగళూరు, 13. కణుగుల గ్రీష్మ, శ్రీకాకుళం, 14. ఎస్. మణిమేగలై, బైరాగిపట్టెడ, తిరుపతి, 15. కె. విజయభారతి, హైదరాబాద్, 16. కన్నేపల్లి నారాయణమూర్తి, శ్రీకాకుళం, 17. ధరణి పద్మాసన, హైదరాబాద్, 18. సి. జనార్ధన సింగ్, నల్లకుంట, 19. ఎస్. నాగశ్వేత, బెంగళూరు, 20. గేదెల రామారావు, ఏలూరు, 21. పి. ప్రభావతి, మియాపూర్, 22. ఆర్. వంశీకృష్ణ, ఎమ్మిగనూరు, 23. గండ్లూరి బలరామశాస్త్రి, నాచారం, 24. సిహెచ్. వి. కృష్ణమాచార్యులు, హైదరాబాద్, 25. ఎ. అరుంధతి, పుణె, మహారాష్ట్ర, 26. జి. ప్రభాకర్ రావు, మల్లాపూర్, హైదరాబాద్, 27. పొణుకుమాటి లీలాప్రవీణ, కొత్త నాగులూరు, కృష్ణాజిల్లా, 28. గౌతమిశిష్టా, హబ్సిగూడ, 29. వంకాయల చిరంజీవి, రాజమండ్రి, 30. ఎం. వి. జోగేశ్వరశర్మ, అరసవిల్లి, శ్రీకాకుళం జిల్లా, 31. చెరుకువాడ హర్ష, విజయవాడ, 32. యు. నారప్ప, కర్నూలు, 33. జయశేషసాయి, సామర్లకోట, 34. యల్లాప్రగడ కృష్ణమూర్తి, అలకాపురి, హైదరాబాద్, 35. శివలెంక నాగమల్లిక, మెహదీపట్నం, 36. జె. జయశ్రీ, హైదరాబాద్, 37. బి. ఎస్. రంగ, తాడేపల్లిగూడెం, 38. భృగుబండ ప్రణతి, ఉప్పల్, 39. ఆలూరి పార్థసారథి, చెన్నై, 40. కె. వి. బ్రహ్మమ్మ, బాపట్ల, 41. పి. బి. సీతాదేవి, నరసాపురం, ప. గో. జిల్లా, 42. పి. వి. రవికుమార్, తిరుపతి, 43. బోడపాటి కృష్ణవేణి, చెన్నై, 44. సి. హెచ్. కోటయ్య శాస్త్రి, కాకినాడ, 45. గెడ్డం రామస్వామి, వీరవరం, తూ. గో. జిల్లా, 46. పి. సుజాత, గుంటూరు, 47. టి. సుజాతవేణుగోపాల్‌రావు, సంగారెడ్డి, 48. పక్కి సుందరీకృష్ణ, గరివిడి, విజయనగరం జిల్లా, 49. అనంతుల సుబ్బారావు, గుంటూరు, 50. ఇ. యల్. నరసింహారావు, మధిర, 51. వేదాల సీత, విశాఖపట్నం, 52. మేలనాతూర్ జైవంత్, విజయవాడ, 53. పి. దేవసేనమ్మ, హైదరాబాద్, 54. ఇందన మల్లికార్జున్‌రావు, ఏలూరు, 55. పి. వెంకటేశ్వర శర్మ, బళ్లారి, 56. చుండూరు అప్పల నరసింహం, బెంగళూరు, 57. వేదుల నరసింహమూర్తి, హైదరాబాద్, 58. పొనుగోటి నరసింహారావు, రామన్నపేట, నల్లగొండ జిల్లా, 59. వీధి బిందు, రాజమండ్రి, 60. ప్రతాప అరుంధతి, కరీంనగర్, 61. జె. వి. ఎస్. రుత్విక్, టెక్కిమిట్ట, నెల్లూరు జిల్లా, 62. పాలకుర్తి సుధీర్‌కుమార్, మాదాపూర్, 63. టి. ఆర్. బాలకృష్ణారావు, రాజమండ్రి, 64. కాకర్లమూడి కృష్ణప్రసాద్, తణుకు, 65. జె. ఎస్. ఉమాదేవి, చోడవరం, విశాఖ జిల్లా, 66. ఎ. నరసింహావతారం, అనంతపురం, 67. కొత్తపల్లి సుధాదేవి, చీరాల, 68. పి. లక్ష్మీప్రసన్న, హైదరాబాద్.

# చతురంగం - 29 ఆధారాలు

**అడ్డం**

1. అడవి, తోట (3)
3. దేవదానవులు దీన్ని మథించారు (5)
7. మనస్సు (2)
8. రాయప్రోలువారి కావ్యం (5)
10. లక్షణం (3)
11. పిల్ల, స్త్రీ (2)
12. బానిస హిందీలో (3)
14. ప్రకాశమానం .. అటునుంచి (3)
15. నోట్లో వేసుకుంటే తీయగా ఉండేది (3)
16. జాతి ఇలా ఉంటే అభ్యుదయం (4)
18. ఓ నేపథ్యగాయని (2)
19. కులం కల్లుముంత -- మత్తు మందు' అన్నాడు మార్క్స్ (2)
20. ప్రారంభించడాన్ని ఇలా అంటారు (3)
22. పాండురాజు రెండో భార్య (2)
23. తనువు (2)
24. సీతారాములు 14 ఏళ్లు చేసింది (4)
26. కౌరవుల శత్రువులు (4)
28. మంగళసూత్రం (2)
29. పని చేయించుకోవడానికి చాటుమాటుగా ఇచ్చే డబ్బు మొదలైనవి (3)
30. చిన్ని అల (3)
31. మీరు కాదు (2)

**నిలువు**

వాంతి (3)
గోదావరి ఒక -- (2)
కృశించు, నాశనము (3)
ఒక విధం (2)
పెంచడం (3)
సమూహం (2)
గడ్డిపోచ (3)
ఈనాడు గ్రూపు నుంచి వస్తున్న పిల్లల పత్రిక (5)
పువ్వులలో రాణి (3)
ఆంగ్లంలో అధికారి (2)
ఈ కథ ఎన్టీఆర్, జమున నటించిన జానపద చిత్రం (6)
...కు తగ్గ బొంత అని సామెత (2)
గారాబం తలకిందులు (2)
తెలుగు నెలల్లో మొదటిది (4)
అల్లూరి సీతారామరాజు ఈ వీరుడే, కాకుంటే కింద నుంచి (2)
పెళ్లి (3)
రక్తనాళం.. తిరగబడింది (2)
ధనికుల నివాసాలు (3)
కోతి (3)
అడ్డం 26కు ధర్మపత్ని (3)
లోపించింది (3)
పాములా భ్రమింపజేసేది (2)

## 3వ ప్రపంచ తెలుగు రచయితల మహాసభలు సెప్టెంబరులో

ప్రపంచ తెలుగు రచయితల సంఘం, కృష్ణాజిల్లా రచయితల సంఘం ఆధ్వర్యంలో సెప్టెంబరు 20, 21, 22 తేదీలలో మూడో ప్రపంచ తెలుగు రచయితల మహాసభలు విజయవాడలో జరగనున్నాయి. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాంస్కృతిక శాఖ సౌజన్యంతో జరిగే ఈ మహాసభలలో కవి సమ్మేళనాలు, గ్రంథావిష్కరణలు, పుస్తక ప్రదర్శనలు, తెలుగువెలుగుల చిత్రప్రదర్శన, జానపద కళారూపాల ప్రదర్శనలు మరెన్నో ఉంటాయి. ఆసక్తి కలిగిన భాషాభిమానులు పూర్తివివరాలకు **9440172642, 9440167697** చరవాణి నెంబర్లలో లేదా ఈ టపా : prapanchatelugu@gmail.com లో సంప్రదించవచ్చు

# చతురంగం - 29

రూ.150/- బహుమతి

గడువు తేది : ఆగస్టు 17

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | | | 3 | 4 | 5 సా | 6 | | |
| 7 | | | 8 | | | | | | 9 |
| | | 10 | | | | | | 11 | |
| | 12 | | | | 13 | | 14 | | |
| 15 | | | | 16 | | 17 | | | |
| | | | 18 | | | | | 19 | |
| 20 | | 21 | | 22 | | | 23 మే | | |
| | 24 | | 25 | | | 26 | | | 27 |
| 28 | | | | | 29 | | | | |
| | | 30 | | | | | | 31 | |

పంపినవారి పేరు: ----------------------------------------

వయసు ( ) చిరునామా : ----------------------------------------

----------------------------------------

---------------- పిన్ : ------------ ఫోన్ : ----------------

## ఆధారాలు

**నిబంధనలు**

✦ చతురంగాన్ని ఇదేపేజీలో పూర్తిచేసి పంపాలి. ✦ తుడుపులు, కొట్టివేతలు ఉండరాదు. ✦ మా 'కీ'తో సరిపోలిన పూరణలనే పరిగణనలోకి తీసుకుంటాం. ✦ గడువు తర్వాత అందిన పూరణలు పరిశీలించం. ✦ ఎక్కువ మంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతను ఎంపిక చేస్తాం. ✦ ఒక్కొక్కరు ఎన్ని కూపన్‌లైనా పంపవచ్చు. ✦ ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

చతురంగం పంపాల్సిన చిరునామా :

**చతురంగం** చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ -082

★ ఒకే కవరులో చతురంగం కూపన్లు ఎన్నయినా పంపవచ్చు.

★ చతురంగం, చతురప్రవేశిక, విపుల వినోదిని ఒకే కవరులో పంపినా పరిశీలిస్తాం.

# చతుర సెప్టెంబరు కానుక

అతడో పెద్ద హీరో! అతని సినిమాలంటే ప్రేక్షకులు విరగబడాల్సిందే! అభిమానులు రెచ్చిపోవాల్సిందే. సాధారణ సినిమావాళ్లలా తన సినిమాలు హిట్టవ్వాలని గుళ్లూ గోపురాల చుట్టూ తిరిగే అలవాటు లేదతనికి! దేవుడ్నే తప్పు పట్టేవాడు. పైగా 'దేవుడి స్థానంలో నేనే ఉంటే ఈ లోకాన్ని ఆయనకన్నా గొప్పగా నడిపించగలను...' అని ఓ టీవీ ఛానెల్ ఇంటర్వ్యూలో చెప్పాడు.

ఆ తర్వాత ఏం జరిగింది? అతను ఎదుర్కొన్న పరిస్థితులేంటి? చివరికి అతనికి అర్థమైనదేంటి? ఆద్యంతం ఉత్కంఠగా సాగే పుట్టగంటి గోపికృష్ణ నవల

## దేవుడితో పంతం!

మీ కోసం వస్తోంది!



Printed, Published, Edited & Owned, by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, No. 7-134 / 1& 2, Moosapet Village, Balanagar Mandal, Kukatpally - 500 072, R.R District, Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 2223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Kadapa: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982818; Chennai: 28232390; Bangalore: 25583804. www.eenadu.net.

# అక్షరధార

వేల ఏళ్ల క్రితం మన ప్రాచీనులు మనిషి ప్రవర్తనా నియమావళిని నిర్దేశిస్తూ వాటిని శ్లోకబద్ధం చేశారు. అవి అన్ని కాలాలకి, అన్ని ప్రదేశాలకి చెందిన అందరికీ సమానంగా వర్తించే నిత్య సత్యాలు.

## ఆరు దుర్లక్షణాలు

అలస్యం త్యక్తవ్యం లౌల్యం లోభః పరాపవాదశ్చ ।
అస్థానేఘచ కోపః తథా విమానశ్చ పురుషేణ ॥

భావం: సోమరితనం, చాపల్యం, దురాశ, పరనింద, అనువుగాని కోపం, దురహంకారం- ఈ ఆరింటినీ మనిషి విడిచిపెట్టాలి.

## విచారం ఎలాంటిది?

చింతయా క్షీయతే దేహో
నాస్తి చింతా సమా మృతిః ।
త్యాజ్యతాం నృప శార్దూల
స్వస్థో భవ విచక్షణః ॥

భావం: ప్రభూ! చింత వల్ల ఆరోగ్యం చెడి, దేహం క్షీణిస్తుంది. చింత మరణంతో సమానం. అందువల్ల విచారాన్ని వదిలేసి, వివేకంతో స్వస్థత చెందాలి.

## ఆయుష్షుకి తాళం చెవి

దానేన భోగీ భవతి మేధావీ వృద్ధసేవయా ।
అహింసయా చ దీర్ఘాయురితి ప్రాహుర్మనీషిణః ॥

భావం: మనిషి దానం చేస్తే భోగి, పెద్దలని సేవిస్తే మేధావి, అహింస పాటిస్తే ఎక్కువ ఆయుష్షుగలవాడు అవుతాడు.

## నిద్రలేమికి హేతువులు

జాగర్తి చ సచింతోయ ఆదివ్యాధి సుపీడితః ।
జారశ్చోరో బలిద్విష్టో విషయీ ధనలోలుపః ॥
కు సహాయీ కు నృపతిర్ధిన్నామాత్య సుహృ త్ప్రజాః ॥

భావం: మానసిక చింత కలవారు, అనారోగ్య పీడితులు, వ్యభిచారులు, దొంగలు, బలవంతులతో విరోధం కలవారు, ఇంద్రియ సుఖాల మీద ఆసక్తిగలవారు, ధనవ్యామోహం కలవారు, దుష్టుల సహాయం కలవారు, విరక్తులైన ప్రజలు, మంత్రులు.. వీరంతా నిద్రలేమితో బాధపడతారు.

## పిల్లల పెంపకం

షోడశాబ్దాత్పరం పుత్రం
ద్వాదశాబ్దాత్పరం స్త్రియం ।
న తాడయే ద్దుష్టవాక్యైః
పీడయేన్న స్నుషాదికం ॥

భావం: పదహారేళ్ల వయసు వచ్చిన కొడుకుని, పన్నెండేళ్ళ కూతురిని శారీరకంగా దండించకూడదు. అలాగే వారిని చెడ్డ మాటలతో తిట్టకూడదు.

## గౌరవం దక్కాలంటే..?

కూటే న వ్యవహారంతు వృత్తి లోపం న కస్యచిత్ ।
నకుర్యా చ్చింతయే త్తస్య మనసా ప్యహితం క్వచిత్ ॥

భావం: సంఘంలో గౌరవించబడాలంటే, మోసపూరితంగా వ్యవహరించకూడదు. మనసులో కూడా ఎవరికీ అపకారం తలపెట్టకూడదు. మనం ఏ పనినైనా లోపం లేకుండా చేయాలి.

సేకరణ : లిపి

